# తాళ్ళపాక పద సాహిత్యం

**ఐదవ సంపుటం**

అన్నమయ్య ఆధ్యాత్మిక గ్రంథాలయం,

గుంటూరు

రేకు: 0201-1 మధ్యమావతి సంపుటం: 08-001

పల్లవి: తెగని పనులకు నింతేసి యాలే
మొగమోటతోడివి మోహములెల్లను

చ. 1: అలిగిన విభుఁడు నిన్నుట్టె వేడుకొనవచ్చె
చలమో ఫలమో సతి నీకు
వెలలేని కోపములు వేగినంతాఁ జేసినాను
కలయక మానేరా కాఁకలెల్లఁ దీరను

చ. 2: తతి మాటాడనివాఁడు తానే సరసములాడీ
వ్రతమో యితవో వనిత నీకు
మతకాన మీరెంత మారుమోములై యుండిన
రతిఁ గూడకుండేరా రచనలతోడను

చ. 3: యేడోవున్న శ్రీవేంకటేశుఁడే యింటికి వచ్చె
ఆడికో వాడికో అంగన నీకు
పాడి పంతములతోడ బలుములెంత చూపిన
వీడెమిచ్చి కూడితిరి వేరులయ్యేరా

రేకు: 0201-2 హిందోళవసంతం సంపుటం: 08-002

పల్లవి: తనమాటే నిజము తా బొంకినా
తనువంటినంతలోనే తాపమారీనా

చ. 1: తప్పక చూచినవాఁడు తలవంచుకొననేలే
నెప్పుదాఁక గురులేసి నేఁ గాననీనా
అప్పటి నే నొలయఁగ నాయములంటీ తాను
కొప్పుజారినంతలోనే కోపమారీనా

చ. 2: తగులనాడినవాఁడు తప్పుదిద్దుకొననేలే
నిగిడి మేడెము చొచ్చి నేఁ గాననీనా
జిగి నా మొగమోటకు చేతులు చాఁచీ తాను
గగురుపొడిచితేనే కాఁకలారీనా

చ. 3: మచ్చికె చేసినవాఁడు మంకులు నెరపనేలే
నెచ్చెలి సాకిరివెట్టి నేఁ గాననీనా
అచ్చపు శ్రీవేంకటేశుఁడన్నిటాను నన్నునేలె
రచ్చకెక్కెనిఁక తాను రాకుండీనా

రేకు: 0201-3 నారణి సంపుటం: 08-003

పల్లవి: ఏల బుద్ధులు చెప్పేరే యింతలో నాకు
మేలిమి విభుఁనితోడ మేకులేలే

చ. 1: తన మాటలు చెల్లించి తగవులనే చెల్లించి (?)
చనవే చేకొందుఁగాక జగడాలేలే
పెఁనగినట్టే పెనఁగి ప్రియములలో మునిఁగి
మనసు దెలిసేఁ గాక మరియాలే

చ. 2: మాటలెల్లా నూఁకొని మచ్చికెల్లాఁ జేకొని
పాటలు పాడుదుఁ గాక పదరనేలే
కాటుకకన్నులఁ జూచి కందువవేళలు గాచి
చాటి చెప్పేఁగాక యిఁక జాగులేలే

చ. 3: కరఁగినట్టే కరఁగి కరతలెల్లా మొరఁగి
సిరులఁ గూడుదుఁ గాక చింతలేలే
యిరవై శ్రీవేంకటేశుఁడెనసెఁ దానే నన్ను
తొరలించుకొందుఁ గాక తోయనేలే

రేకు: 0201-4 వరాళి సంపుటం: 08-004

పల్లవి: ఇంట గెలిచి కా నీవు యిఁక రచ్చ గెలిచేది
వెంటనే ఆనతీరాదా వినవలె నేను

చ. 1: మాయలెంత సేసినాను మచ్చికెంత వూసినాను
ఆయెడ నావలె నిన్నునాపె నమ్మీనా
కాయపు నీ ఘాతలివి కందువ మచ్చములివి
యేయింతి సేసినవంటే యేమనేవు నీవు

చ. 2: కల్లలెన్ని ఆడినాను కదిసెంత గూడినాను
యిల్లదె నావలెనాపె యియ్యకొనీనా
తెల్లనికన్నులతేట దిష్టమైన యాచెమట
చెల్లఁబెట్టుకొని యాపె చింతవాపఁ గలవా (దా?)

చ. 3: నెమ్మినెంత పొగడినా నీకు నీకే పొగడినా (?)
రమ్మని నావలెనాప రతిఁ గూడీనా
యెమ్మెల శ్రీవేంకటేశ యెనసితివిటు నన్ను
సమ్మతించనాడనెట్టు సరస మాడేవు

రేకు: 0201-5 మాళవి గౌళ సంపుటం: 08-005

పల్లవి: ఏలాతని దూరేవే యింకా నీవు
ఆలీలఁ బుణ్యఫలములవి నీకే వలదా

చ. 1: గుట్టుతోడ నీమోవి గురుతు సేసినాఁడింతే
తిట్టకువే రమణుని తెరవ నీవు
వట్టిమాకులిగిరించు వనిత నీమాట వింటే
నెట్టన ఆగుణములు నీకు నీకే వలదా

చ. 2: రేసుల నీచేతులను రెట్టింపు సేయఁగనేలే
ఆసల సాదించకువే ఆతని నీవు
వాసికిఁ బూవకపూచు వనిత నీచేఁతలకు
బాసల నీయందే అవి పతి చూపవలదా

చ. 3: ముంచి వొత్తిన చన్నుల ముద్రలు వొత్తినాఁడింతే
అంచల శ్రీవేంకటేశునకు నీవు
యెంచనీతనిఁ గూడితెందైనాఁ గావక కాచు
నించి నీజాణతనాలు నీమీఁదనే వలదా

రేకు: 0201-6 శ్రీరాగం సంపుటం: 08-006

పల్లవి: పదరుదురా యిటు పైపైనే
అదన నీకు మోహపు వాఁడతఁడు

చ. 1: చెలువుఁడు నీకటు సేసిన బాసలు
తలఁచుకొనఁగదవె తరుణీ
అలుగక ములుగక ఆతనిగుణములు
తెలుసుకొనఁగదవె దినదినములను

చ. 2: అంతరంగమున నాడిన మాటలు
చింతించుకొనవె చెలియా
పంతములాడక పలుమరుఁ గొసరక
పొంతనె కనుకో పూఁటకుఁ బూఁట

చ. 3: శ్రీవేంకటపతి చెనకిన చెనకులు
భావించి చూడమో పడఁతీ
యీవిభుఁడె కలసె నిఁక నేమిననక
ఆవటించు ముదమడగడుగుకును

రేకు: 0202-1 శ్రీరాగం సంపుటం: 08-007

పల్లవి: రచనలనిన్నిట రసికుఁడవు
యిచట విన్నపంబిదె సేసెదను

చ. 1: పలుకుల చిలుకల పాటకోవిలల
పిలుచులుగా చెలి పెంచెనదే
అలుగకుమీ నీవందుకు రమణుఁడ
కల సహజమె యిది కసరులు గావు

చ. 2: చనుజక్కవలను సతి నెరుయలుల
ఘనముగ మూఁకలు గట్టించె
మొనలుచూపె మోపుగట్టెనని
ననిచి వేరకు నాథుఁడవు

చ. 3: నడపుల హంసల నయనచాతకముల
పడఁతి శ్రీవేంకటపతి పాదిగె
నిడువులఁ గడుచు నిన్నుసోఁకించెనని
జడియకుమీ నీచనవులె మెరసి

రేకు: 0202-2 నాదరామక్రియ సంపుటం: 08-008

పల్లవి: వింత వింత సతులాల వినరమ్మా
యెంతలేదు మీ కెల్లా నిదెచాలు సుండి

చ. 1: చనవేమెరతుఁగాని చలము సాదింపనోప
చెనకీనంటా నేల చేయి వట్టీనే
కనుసన్న మెలఁగేటి కాంతను నాకీపాటి
కొనగోరుదాఁకించిన కొమ్మలకేపాటో

చ. 2: యిచ్చకమూడుదుఁగాని యీసడించ నెన్నఁడును
తుచ్చమాడకుండా నాన తూరిపట్టీనే
మచ్చికైన సతిని నామాటలకే యింతసేసె
హెచ్చి తన్నుఁ దిట్టేవారినెంత సేసునో

చ. 3: గక్కనఁ గూడితిఁగాని కాఁకలు సేయనెప్పుడు
వెక్కసించీఁ జన్నులంటా వేల మొ(నొ?)క్కీనే
వొక్కటైన నాతో నవ్వీ వూరకే శ్రీవేంకటేశుఁ
డిక్కువలనున్నవారినెంత నవ్వునో

రేకు: 0202-3 రామక్రియ సంపుటం: 08-009

పల్లవి: నీకంకణము గట్టినట్టి నెలఁత నేను
ఆ కంటు దీరుచవయ్యా ఆపరాధి నేను

చ. 1: వెలఁదులు నిన్నాడఁగా వింటిని నేను
అలిగి పాసిన విరహపువేళల
పలికి వారిఁ దిట్టని పాపజాతిదాన నేను
యెలమి నన్నప్పటి నీవేల మెచ్చేవయ్యా

చ. 2: మచ్చికై నీవిందుండఁగా మాయింటనే వుంటి నేను
రచ్చఁ జెలులు పంతాన రానియ్యరైరి
యిచ్చగించి వుండినట్టి యెడ్డగుణము సతిని
పచ్చిగా నాకేల నీవు బాఁతిపడేవయ్యా

చ. 3: నీవు గాఁగలించుకోఁగా నివ్వెరగుతోనుండితి
ఆవేళ నన్నెచ్చరించరైరి చెలులు
కావిరి నూరకుండిన కడుమత్తురాలను నేను
శ్రీవేంకటేశ నన్నేల చెక్కునొక్కేవయ్యా

రేకు: 0202-4 దేసాళం సంపుటం: 08-010

పల్లవి: చూతువురావయ్యా సుదతికాఁపురము
యీతలనిదె నీయింటిలోనను

చ. 1: తీపు మోవిలోని తేనెలు గరఁచీ
చూపులకాఁకల చురుకులను
దాపగు చెక్కుటద్దములు దోమీ
పూపుల నవ్వుగప్పురానను

చ. 2: పులకబియ్యాలఁ బొంగలివెట్టీ
చలి వలపుల చన్నులను
పొలపునెరుల పోరుల వాపీ
ములువాఁడి గోళ్ళ ముచ్చటను

చ. 3: మొనపి సిగ్గులను ముగ్గులు వెట్టీ
చెనకేటి చెక్కు చేతులను
యెనసె శ్రీవెంకటేశ నిన్నునాపె
కని నీవు రాఁగాఁ గాఁగిటను

రేకు: 0202-5 మాళవి గౌళ సంపుటం: 08-011

పల్లవి: ఏల నన్ను దూరేవే యేమనేవే నన్నును
మేలు మేలని యెప్పుడు మెచ్చవే నీవు

చ. 1: సేనలు వానిసుద్దులు చెప్పవే నీవెందాఁక
వీనులు చల్లగ నాఁడే వింటినే నేను
తానె యిందు విచ్చేసితే తరవాతిపనులకు
ఐనట్లాఁ దోఁచినమాటాడేనే నేను

చ. 2: సూటిగాఁ గమ్మటినేల చూచేవే యాతనిదిక్కు
కాటుకకన్నులఁ దొల్లె కంటినే నేను
పాటించి తానిప్పుడు నాపానుపుపైఁ గూచుండితే
చీటికి మాటికి సేవ సేసేనే నేను

చ. 3: వొడఁబరిచి మమ్మేల వొక్కటి సేసేవే నీవు
కడు వేడుకనప్పుడే కలసితిమే
అడరి శ్రీ వేంకటేశుఁడాయములు నన్నంటితే
చిడుముడిగురులుగాఁ జెనకేనే నేను

రేకు: 0202-6 కన్నడగౌళ సంపుటం: 08-012

పల్లవి: ఇంకా విన వేడుకయ్యీనేమంటివి
బొంకకుమీ నాతోనాపెపొందులకేమంటివి

చ. 1: తొయ్యలి నిన్నొకమాటు తొంగి చూచెనేమంటివి
యియ్యెడకుఁ దానె వచ్చెనేమంటివి
పయ్యద జారఁగ నిల్చె భ్రమయించ నేమంటివి
అయ్యఅసాదలు వెట్టేనందుకు నేమంటివి

చ. 2: నవ్వుతా నిన్నుమెచ్చిన నాటకానకేమంటివి
యివ్వల నీకు మొక్కితే నేమంటివి
రవ్వగానాపె వుండిన రాజసానకేమంటివి
పవ్వళించి సొలసిన పనికినేమంటివి

చ. 3: వెలఁది నిన్నుఁ గూడితే వేడుకతోనేమంటివి
యెలమి శ్రీవేంకటేశ యింకేమంటివి
కొలఁది మీరఁగ నన్నుఁ గూడితి వింతలోననే
తెలిసితి నీగుట్టల్లా తిరుగనేమంటివి

రేకు: 0203-1 శంకరాభరణం సంపుటం: 08-013

పల్లవి: ఆడమె యింకనేమీ నౌఁగాదనుచుఁ దన్ను
సూడుఁబాడు దిద్దేవాఁడు సుద్దులిన్ని నేరఁడా

చ. 1: పెక్కులు నేర్చినతఁడు బెంబాడిచేఁతలతఁడు
దిక్కులఁ దననేరాలు దిద్దుకోలేఁడా
చక్కని పదారువేలు సతులఁ దెచ్చినతఁడు
పక్కన మావంటివారి భ్రమయించనోపఁడా

చ. 2: రాతిరిపనులాతఁడు రవ్వల కెక్కినతఁడు
భీతిలేక ఆనలెల్లాఁ బెట్టుకోలేఁడా
ఈతల రుక్మిణీదేవి నెత్తుక తెచ్చినతఁడు
చేతులు మాపై జాఁచి చెనకక మానునా

చ. 3: దేవర దానై నతఁడు దిమ్మరివిద్యలతఁడు
యీవేళ నాకోరిక యీడేర్చలేఁడా
శ్రీ వేంకటేశుఁ డితఁడు చేరి నన్నునిటు గూడె
వేవేలు మన్ననలచే వెలయించుటరుదా

రేకు: 0203-2 బౌళి సంపుటం: 08-014

పల్లవి: ఏమి సేసేరో తాము యిద్దరమూనేకము
కామించి తామెంత నన్ను గరశించేరు

చ. 1: అప్పుడు నీవును నేను నాడుకొన్న మాటలే
చెప్పుమనుచును సారెఁ జెలులనేరు
చిప్పిల సరికిబేసిఁ జెనకిన చెనకులే
చొప్పులెత్తి తమకెల్లాఁ జూపుమనేరు

చ. 2: నంటున మనమిక్కడ నవ్వినట్టి నవ్వులే
వొంటినుండి యీడనాతోనూహించేరు
జంటలఁ జెల్లించుకొన్న సరసపు చనవులే
వెంటవెంట వచ్చి వచ్చి వెలుచుకొనేరు

చ. 3: వాడికెనొండొరులము వలచిన వలపులే
కోడి యెరుకలు సేసికొన వచ్చేరు
యీడనె శ్రీవేంకటేశ యెనసితి మింతలోనే
వీడెమిచ్చేమని యిట్టే వేగిరించేరు

రేకు: 0203-3 శ్రీరాగం సంపుటం: 08-015
పల్లవి: ఇంతలోనేమేమి పుట్టునో యింతికి నీవలపుల
చింతదీర విచ్చేసి చిత్తగించవయ్యా
చ. 1: ఆసల నలపుపుట్టెనంగన కించుకించుక
వేసటనెదురు చూచి వెరగుపుట్టె
పాసిన తమకమునఁ బరాకులెల్లాఁ బుట్టె
సేసేటి నావిన్నపాలు చిత్తగించవయ్యా
చ. 2: చెక్కులఁ జెమటపుట్టె చింతతోడ సిగ్గులను
నెక్కొని రానికోపాన నిట్టూర్పు పుట్టె
వెక్కసపు నీగుణాలు వినివేడుకలు పుట్టె
చిక్కెను నీపాలనిదె చిత్తగించవయ్యా
చ. 3: సెలవుల నవ్వుపుట్టె చేరువకు నీవు రాఁగా
కలసిన నీకాఁగిట గర్వము పుట్టె
యెలమి శ్రీవేంకటేశ యిన్నిటా ధైర్యము పుట్టె
చిలుకుఁజెలువములు చిత్తగించవయ్యా

రేకు: 0203-4 కాంబోది సంపుటం: 08-016

పల్లవి: దవ్వుల విరహమోప దగ్గరి గుట్టును నేర
పువ్వువంటిది నామతి బుద్ధులిఁకఁ జెప్పరే

చ. 1: తమకించి పొదిగితే తరితీపు చాలదు
జమళి సిగ్గులైతే చవిలేదు
తెమలని వోరపైతే తేఁకువలు మెరయవు
భ్రమసి వుందాన నింకఁ బతితో నేమందునే

చ. 2: పక్కన నే నవ్వితేను పంతానకు వెలితయ్యా
లక్కవలెఁ గరఁగితే లావు చాలదు
వెక్కసానఁ బెనఁగితే వేసటలు గనమౌను
యెక్కడనున్నదో మేను యిట్లానుందాననే

చ. 3: తొలుత నేఁ జెనకితే దొమ్ములయ్యీఁ జేఁతలు
తలవంచుకుండితే దంటనందురు
కలసెను శ్రీవేంకట ఘనుఁడింతలో నన్ను
నెలకొంటి సంతసాన నేరుపులింకెట్టివే

రేకు: 0203-5 కేదారగౌళ సంపుటం: 08-017

పల్లవి: విన్నవించనేమున్నది వేగినంతాను
యిన్నిటా నీసొమ్ము నేను యీడేర్తువు గాక

చ. 1: యెదురు చూచితి నీకు నింతులచేఁ జెప్పింపితి
వెదకితి నీవుండేటి విడిదలను
చెదరని వలపులు చిమిడితేఁ గొరయౌనా
పదను దప్పకుండాను పాలింతువుగాక

చ. 2: పట్టితి వ్రతము నీకు పైపైఁ దమకించితిని
బెట్టి పేరుకొని నిన్నుఁ బిలచితిని
వెట్టిగాని మనసిది వేఁచితేను చవియౌనా
యిట్టే ససివాడకుండా నేలుదువుగాక

చ. 3: వేళలు గాచితి నీకు వేగించితి నిందాఁక
మూలమైనదేవరకు మొక్కుకొంటిని
యీలీల శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
బాలకి నన్నిట్టే చేపట్టుదువు గాక

రేకు: 0203-6 సామంతం సంపుటం: 08-018

పల్లవి: కక్కసించఁ బనిలేదు కడనున్నవారికెల్లా
చక్కని నీవలపులే సాదింతువెపుడు

చ. 1: చనువుగలవారిది చక్కనిమాట
వినవలసితే నీవు వింటివప్పుడే
మనసువచ్చినవారి మనవులెల్లా
కనుసన్నలోననే కైకొందువపుడే

చ. 2: చెల్లుబడిగలవారు చేసినచేఁత
చెల్లఁ బెట్ట వలసితేఁ జెల్లింతువు
వుల్లమువచ్చినవారి వూడిగాలెల్లా
మెల్లనే యేపాటైనా మెత్తువు నీవు

చ. 3: అంది పొందినట్టివారి యాసలెల్లా
యెందునున్నానొనగూర్చి యీడేర్తువు
కందువ శ్రీవేంకటేశ కలసితివి
ముందె నన్ను మెచ్చితివి ముచ్చటతోనపుడు

రేకు: 0204-1 సాళంగనాట సంపుటం: 08-019

పల్లవి: మనసుకుఁ గమ్మటి నీమనసే తారుకాణ
వెనక ముందరనవి విచ్చిచెప్పరాదు

చ. 1: సతి నీతో విన్నవించే జవ్వనపుఁగతలెల్ల
సతమై కొననాలికెఁ జదివితివి
యితరులేమీ నెఱఁగరిద్దరును నవ్వుకోఁగా
వితగాని మీపనులు వెల్లవిరులాయను

చ. 2: సుదతి నీకునొఁగే సోబనపక్షంతలు
అదన నీవు మీఁజేతనందుకొంటివి
అదె పెండ్లి పేరటాననాపె నీవుఁ బెనఁగఁగ
పదిలపు మీగుట్టు బట్టబయలాయను

చ. 3: కలికి సూడిదవట్టే కమలపు మొగ్గలను
వొలిసి నీవురమున నొత్తుకొంటివి
సొలసి శ్రీవేంకటేశ చూచేటి మీచూపులను
తెలిసి మీరతులెల్ల తేటతెల్లమాయను

రేకు: 0204-2 పాడి సంపుటం: 08-020

పల్లవి: కాంత నీసందిమోహము గానవచ్చెను
చింతదీర బుజ్జగించి చిత్తగించరాదా

చ. 1: మొగమునఁ గళదెరె మోవిపైకి నవ్వువచ్చె
మగువ నీతోనేమని మాట చెప్పెనో
సగటున నటునిటు పరాకులేల సేసేవు
తగు విన్నపములవధరించరాదా

చ. 2: కన్నులఁ దేటలువారె కాయమెల్లాఁ బులకించె
కన్నె నీతోనిఁకనేమి సన్నసేసెనో
చిన్నితేఁతసిగ్గులను శిరసేల వంచేవు
వన్నెల నేకతాన కవసరమీరాదా

చ. 3: నిలువెల్లఁ జెమరించె నిట్టూరుపులు రేఁగె
కలికి నిన్నెటువలెఁ గాఁగిలించెనో
అలమి శ్రీవేంకటేశ అట్టెనీవు గూడితివి
మలసి యిటువలెనే మన్నించరాదా

రేకు: 0204-3 శ్రీరాగం సంపుటం: 08-021

పల్లవి: ఎడమాటలింకనేల యెందాఁకాను
విడువరాని బాసలు వెంట వచ్చినయ్యా

చ. 1: పడఁతి పయ్యదలోని పాలిండ్లు నీకునిట్టె
విడిదల సేసెనిందు విచ్చాయవయ్యా
వుడివోని వలపుల వులుపా వట్టినదిదె
వెడఁగుఁదనాలేఁటికి విచ్చేయవయ్యా

చ. 2: కందువ తేనెల మోవి కలగంపుచూపులతో
విందులు నీకుఁ బెట్టీ విచ్చేయవయ్యా
కందువమాటలఁ జెప్పి కడునుపచారాలు
విందువుగాని యీడకు విచ్చేయవయ్యా

చ. 3: కూడఁగఁ దనమేను చిగురుఁబానుపుగా నీకు
వేడుకఁ బరచెనిదె విచ్చేయవయ్యా
యీడనె శ్రీవేంకటేశ యింతిని గలసితివి
వీడెమిచ్చినిట్లనే విచ్చేయవయ్యా

రేకు: 0204-4 మంగళకౌశిక సంపుటం: 08-022

పల్లవి: ఎరఁగరటే ఆతనినెందాఁకనే
తరితీపు సేసేటి మీతగవెందాఁకానే

చ. 1: ఇక్కడనుండే విభుఁడు యెదురుచూచును నాకు
యిక్కడనే శింగారించే రెందాఁకనే
వెక్కసమై నామాటకు వీనులాలకించునట్టే
చుక్కబొట్టే పెట్టఁబట్టె సూటియెందాఁకనే

చ. 2: సారిదినింతక (కు?) నా సుద్దులే యడుగుచుండు
యిరవుగఁ గొప్పువెట్టేరెందాఁకనే
మరపి యాతఁడు నన్ను మనసులోఁ దలపోయి
తిరముగ పల్లకి దెచ్చుటెందాఁకనే

చ. 3: మలసి నాకుఁగా లోన మంతనమాడుతానుండు
యెలమిఁదోడుక వచ్చేరెందాఁకనే
కలసితినిట్టె వచ్చి ఘను శ్రీవేంకటేశ్వరుఁ
గొలిచి యిట్టేవుండే గుట్టెందాఁకనే

రేకు: 0204-5 నాదరామక్రియ సంపుటం: 08-023

పల్లవి: వేగిరించనేల నీతో వేమారును
బాగులు నీవెఱఁగనివా బతికించేవాఁడవు

చ. 1: వన్నెల నీమీఁద నేను వలపెంత చల్లినాను
మన్నించేవాఁడవు నీవె మాఁటిమాఁటికి
విన్నపాలప్పటి నీతో వేగినంతాఁ జేసినాను
సన్నల నీచిత్తమే సమ్మతించేది

చ. 2: జవ్వనమదాన నీతో సరసమెంతాడినాను
నవ్వేటివాఁడవు నీవే నానాఁటికి
రవ్వగా నీచెయ్యివట్టి రతికెంత దీసినాను
నివ్వటిల్లఁ గరఁగేది నీదేహమే

చ. 3: చెలరేగి నేనెంత సిగ్గులతో మొక్కినాను
కలసేవాఁడవు శ్రీవేంకటేశ నీవే
నిలువునఁ జెమరించె (చి?) నే నిన్ను నెనసితే
కలదెల్ల నీకరుణే కందువైనది

రేకు: 0204-6 బౌళి సంపుటం: 08-024

పల్లవి: ఇద్దరుఁ దెలుసుకోరే యిన్నిటా జాణలు మీరు
పొద్దునఁ దెర వేసేము పొలఁతుల మిపుడు

చ. 1: మొలచెనది గదవే మోవినే చిరునగవు
తలఁచిన పని యేదో తరుణి నీవు
చెలువుఁడంతటిలోనె సిగ్గువడీ నీయెదుట
యెలమిఁ దెలియవు మాకిటమీఁది పనులు

చ. 2: చెమరించెనదిగదే చెలియ నీమేనెల్ల
తమకించిన పనేదొ తగిలి నీవు
జమళినాతఁడందుకు సన్నల మెచ్చెఁ గన్నుల
సమములై తోఁచీ మాకుసంతోసపుఁబనులు

చ. 3: పొడమెనదిగదవే పులకలు నీమేన
జడిగొన్న నీలోనిసంతోసమెంతో
అడరి శ్రీవేంకటేశుఁడలమె నిన్నంతలోనే
పుడివోనివాయ మాకు వుద్యోగపుఁబనులు

రేకు: 0205-1 ఆహిరి సంపుటం: 08-025

పల్లవి: పగవారికైనా నిట్టిపాటు వద్దయ్యా
తెగువలు నీవురాఁగాఁ దిప్పుకొంటిఁ గాని

చ. 1: నీసుద్దులే ఆడుకొంటా నెలఁతలతోడుత
ఆసలు మతిఁ బెట్టుక అలసితిని
గాసిలినమీఁద కాఁకలు దొట్టించఁగాను
వీసమంత పొద్దైనా వేగించరాదాయ

చ. 2: చొప్పుగా నీకెదురులు చూచిచూచి వాకిటను
రెప్పల ముయ్యఁగలేక రేసువడితి
వుప్పతిల్లు వలపెల్ల నొక్కమాటె రేఁగఁగాను
నిప్పువంటి తమకము నీఁగఁగ రాదాయను

చ. 3: కందువకు నీవురాఁగా గక్కనఁ గాఁగిట నించి
యిందుకా శ్రీవేంకటేశ యిట్టె మెచ్చితి
విందుల నీరతులలో వేడుక పిక్కటిల్లఁగా
సందడించి కుచములు సదమదమాయను

రేకు: 0205-2 వరాళి సంపుటం: 08-026

పల్లవి: రండుా నేరుతువే రమణి నీవు
వెండిపైఁడి వుంగరాలు వేలనే పెట్టితివే

చ. 1: అంగములు గరఁగఁగా నాతనితో మాటలాడి
యెంగిలినవ్వులు చిందేవేమే నీవు
వెంగెముల లోపలనే విరహపుటెండ గాసె
చెంగట వెన్నెల గొంత సెలవిఁ జూచితివే

చ. 2: కనుఁగవ చూపులను కాంతునిఁ దప్పక చూచి
కొనగోరితాఁకులను గొసరేవే
తనివోక తొలుతను తామెరవిరుల వేసి
వెనకఁ జందురులను వెంటనంపితివే

చ. 3: గక్కన శ్రీవేంకటేశుఁ గాఁగిటను లాలించి
వొక్కమాటే చన్నులను వొత్తేవిపుడు
తెక్కులను నడురేయి తీగెల గూండ్లువెట్టి
జక్కవ పులుగులను సారెఁ గూడించేది

రేకు: 0205-3 గౌళ సంపుటం: 08-027

పల్లవి: రాఁగా రాఁగా వలపులు రచ్చబడీని
చేఁగదేరి వున్నాడవు చెల్లు నీకునిపుడు

చ. 1: వేసారవు నీవైతే విన్నపాలు వినుటకు
సేసేనంటే యెంతలేదు చెలియకును
యీసుద్దులకే వున్నారమిద్దరికి నడుమను
చేసినట్లు చేయవ చెల్లు నీకునన్నియు

చ. 2: తనియవు నవ్వి నవ్వి దగ్గరిన వేడుకల
చెనకఁగ నెంతలేదు చెలియకును
ననుపుల వంకలొత్త నడుమ నేమున్నారము
చినికేవు తరితీపు చెల్లు నీకు నింకను

చ. 3: విడువవు నీవిట్టె వెలఁది చెఱఁగు వట్టి
చిడిముడి పడదు యీచెలి యిందుకు
యెడయక శ్రీవేంకటేశ యిట్టె కూడితిరి
చెడదు మావూడిగము చెల్లు నీకునిపుడు

రేకు: 0205-4 మధ్యమావతి సంపుటం: 08-028

పల్లవి: ఏది నాకు బుద్ది యింకనేమి సేతును
యీాదె నీకృప నాపై యిరవైవున్నది

చ. 1: మందలించి నీతో నేను మాటలాడేనంటేను
యెందునో పరాకు నీకు నేమిసేతును
విందువెట్టి మోవితేనె వెసనీకిచ్చేనంటే
చిందరై నీయధరము చీకాకై వున్నది

చ. 2: నవ్వు నవ్వి నీతోను నటనలు నేనేనంటే
యెవ్వలనో జూడమాడేవేమిసేతును
పువ్వువలె నీమేను పొదిగి భోగించేనంటే
చివ్వనఁ బెంజెమటల చిత్తడి మైనున్నది

చ. 3: పరపుపై నిన్నునేను పచ్చిగాఁ జేసేనంటే
యిరవుగా వేడుకొనేవేమిసేతును
గరిమె శ్రీవేంకటేశ కలసితివిటు నన్ను
నిరతపు నీమోహము నిజము నాకైనది

రేకు: 0205-5 శుద్ధవసంతం సంపుటం: 08-029

పల్లవి: ఇచ్చగించి నవ్వు నవ్వేవేమనేవయ్యా
యెచ్చుకుందు లేదు మీలోనిఁకనానతీవయ్యా

చ. 1: యిందుముఖి నీకు మొక్కి యిచ్చెనిదివో కానికె
అందుకు నీవేమనేవు ఆనతీవయ్యా
చెంది నీతో సిగ్గువడి చేరువ నిలుచున్నది
యెందాఁకా వట్టిజోలి యిఁకనానతీవయ్యా

చ. 2: కన్నులఁ దప్పక చూచి కంబము వట్టుకున్నది
అన్నీనాయ నీతలఁపు ఆనతీవయ్యా
సన్నలు మాకుఁ జేసీ సంగడికిఁ దెమ్మనుచు
యెన్నరాదు తమకము యిఁకనానతీవయ్యా

చ. 3: యేకశయ్యమీఁదనుండి యెడమాటలాడించీ
ఆకతలవి యెట్టివో ఆనతీవయ్యా
కైకొని శ్రీవేంకటేశ కాంతనిట్టెకూడితివి
యేకాలముఁ బాయమని యిఁకనానతీవయ్యా

రేకు: 0205-6 భైరవి సంపుటం: 08-030

పల్లవి: కంటిమి వింటిమి నీకతలు నేఁడు
నంటుననే ఆసలు సానలఁ బట్టేవా

చ. 1: కన్నులనే సొలసేవు కాఁకలనే ఆలసేవు
కన్నెరొ నీకాతనికి కలదా పొందు
నన్నునేల మొరఁగేవు నాకునేల దాఁచేవు
సన్నలనే వలపులు చవిగొనేవా

చ. 2: సెలవులనే నవ్వేవు చెక్కులు చెమరించేవు
మలసి మీ యిద్దరికి మాటలందెనా
చెలఁగి యేల బొంకేవు సిగ్గులేల పెంచేవు
వెలినుండే రతులెల్లా వెలసేసేవా

చ. 3: భావములనె చొక్కేవు పైపైఁ బులకించేవు
శ్రీవేంకటేశ్వరు మేలు చేకూడెనా
పూవువలెఁ బొదిగేవు బుసకొట్టే వింతలోనె
యీవిధాన నేమిమ్ము యెనయించనేరనా

రేకు: 0206-1 ముఖారి సంపుటం: 08-031

పల్లవి: ఇంత యేఁతురా సతులనెందాఁకాను
యెంతవడికెంతవడి యిప్పుడా నీవలపు

చ. 1: మాటలకు తుదలేదు మనసుకు గురిలేదు
యేఁటికి మమ్ము బోదించేవెందాఁకాను
కాటుకకన్నుల నీరుగ్రమ్మ నెదురుచూచితి
యీటులేక బుజ్జగించేవిపుడా నీవలపు

చ. 2: నవ్వులకు గుట్టులేదు నంటునకు వెలలేదు
యివ్వలనేఁటికి యానలెందాఁకాను
చివ్వన నిట్టూర్పురేఁగ చెక్కునఁ జేయి వెట్టితి
వె(నె?)వ్వరి సాకిరివేట్టేవిప్పుడా నీవలపు

చ. 3: ఆసలకు తనివి లేదాయాలకు సిగ్గులేదు
యేసేపు చూపుల యమ్ములెందాఁకాను
నేసవెట్టి కూడితివి శ్రీవేంకటేశ్వర నేఁడు
యీసుదీరఁ గరుణించేవిప్పుడా నీవలపు

రేకు: 0206-2 బౌళి సంపుటం: 08-032

పల్లవి: సేయవయ్య నీవు నీచిత్తము వచ్చినట్టల్లాను
యీయెడ నీమతకములెట్టుగాఁగలదో

చ. 1: నగవులే తరచాయ నాకు నీకునేపొద్దు
వగటులే మీఁదమీఁదఁ బాయకున్నవి
మొగముచూపులే కడు ముంచుకొనునేపొద్దు
యెగసక్యాలిఁకమీఁదనెట్టుగాఁగలదో

చ. 2: ముచ్చటలే గనమాయ మోహములనిద్దరికి
రచ్చలఁ బడెను లోలో రతులెల్లాను
పచ్చిదేరెఁ బంతములు పైపై సరసమాడఁగా
యెచ్చరికలిటమీఁదనేమిగాఁగలదో

చ. 3: యేకతాలు సమకూడెనియ్యకోళ్ళేమనకు
వాకులు పోకులు వొక వావి గూడెను
చేకొని శ్రీవేంకటేశ జిగినన్నుఁ గూడితివి
యీకడ మేలుకు మేలులెంతేసి కాఁగలదో

రేకు: 0206-3 ఆహిరి సంపుటం: 08-033

పల్లవి: ఇంకనేడ సుద్దులు యెవ్వరెందుకును దిక్కు
బింకమున నీకే మొరపట్టుతింతే (ట్టుడిం?) కాక

చ. 1: ఆసకొలిపి నీవు అన్నిటాను వలపించి
పాసి వుండితే మనసు పట్టవచ్చునా
నేసవెట్టి పెండ్లాడి చేతికి లోనై
వేసరుకొంటే నాదెస విన్నవించవచ్చునా

చ. 2: పెంచి పెద్దరికమిచ్చి పిలువక సతులలో
కొంచెపరచితేనంత గోడు గలదా
మంచముమీఁదికిఁ దీసి మన్నించి అంతలోనే
కొంచించి నిద్రవోఁబోతే కొల దాఁకదా

చ. 3: కాఁగలించనప్పణిచ్చి కడుఁ జన్నుల నొత్తితే
లోఁగేవు నవ్వరా నిన్ను లోకులెల్లాను
యేఁగి వచ్చి శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
చేఁగదేర మెచ్చితేను చెవి సోఁకెనా

రేకు: 0206-4 సామంతం సంపుటం: 08-034

పల్లవి: కోరి నీకు నీయందే గుక్కిళ్ళున్నవి
యేరీతైనాఁ జేయవచ్చునేమి గొరతయ్యా

చ. 1: పయ్యదలో నీచెలికి పసిఁడిబిందెలున్నవి
తియ్యని మోవిలోన తేనెలున్నవి
ఆయ్యెడ మాటల బెల్లాలప్పటిఁ గొన్ని వున్నవి
యెయ్యెడఁ జూచిన నీకు యేమి గొరతయ్యా

చ. 2: చెంది యాపెమోములోనే చెక్కుటద్దములున్నవి
కందువచూపు ముత్యాల గనులున్నవి
మందలించిన కాఁగిట మర్మములెల్లానున్నవి
యెందునైనా నీసిరులే యేమిగొరతయ్యా

చ. 3: అవిగో కమ్మని వూర్పులాలవట్టములున్నవి
తవిలిన రతుల నిధానమున్నది
కవగూడితిరి శ్రీ వెంకటరాయ మీరిద్దరు
యివలఁ జూచిన మరియేమి గొరతయ్యా

రేకు: 0206-5 రీతి గౌళ సంపుటం: 08-035

పల్లవి: నెయ్యని పోసుకోరాదు నీళ్ళని చల్లఁగరాదు
చెయ్యారఁగంటిమి నేఁడు చేరి నితోపొందులు

చ. 1: ప్రేమము చాలాఁజేసి పెక్కుసతుల నీతోను
మోముచూడ సిగ్గువడి ముసుఁగుతోనున్నదాన
జామువోయి వచ్చి నీవు సరసములాడేవు
యేమని నేనియ్యకొందు నేఁటిజన్మమయ్య

చ. 2: పలుమారు నీతోనవ్వి పరాకై వుండిన నీతో
పలుకఁగ సిగ్గుపడి భావింపుచునున్నదాన
కలగన్నట్లావచ్చి కందువలంటేవు నన్ను
బలిమి యేమున్నది నాబదుకు నీచేతిది

చ. 3: మచ్చికతో నిన్నుఁ గూడి మన్నించిన నీతోను
పచ్చిసేయ సిగ్గువడి పదరక వున్నదాన
యెచ్చుగా శ్రీవేంకటేశ యిట్టె నన్నునేలితివి
విచ్చన విడాయ నా విభుఁవములెల్లను

రేకు: 0206-6 పాడి సంపుటం: 08-036

పల్లవి: నేనేమీననఁ జుమ్మీ నెలఁతలాల
తానకమై సిగ్గువడీ తాఁదానే

చ. 1: అప్పుడు వచ్చేనని యానలు వెట్టినవాఁడు
తప్పని బొంకనివాఁడు తాఁదానే
ముప్పిరి నేనింతలోనే మోముచూచి నవ్వితేను
దప్పిదేర సిగ్గువడీ తాఁదానే

చ. 2: వుక్కు మీరి విరహాన వుడికించినట్టివాఁడు
తక్కికరుణించేవాఁడు తాఁదానే
ముక్కుమీఁద వేలిడుక మోనమున నేనుండితే
దక్కి సిగ్గుల మునిఁగీ తాఁదానే

చ. 3: అగపడి రాజసాననట్టె విఱ్ఱవీఁగేవాఁడు
తగిలి కూడినవాఁడు తాఁదానే
జిగిమించి రతులలో శ్రీవేంకటేశ్వరుఁడు
దగదొట్టి సిగ్గువడీ తాఁదానే

రేకు: 0207-1 సామంతం సంపుటం: 08-037

పల్లవి: పొద్దువోనివాఁడవై పూఁచి మమ్ముఁ జెనకేవు
సుద్దులు చెప్పినవారు సూడిచ్చేరా

చ. 1: ఆడినమాటకుత్తరమాపె నీకీవలెఁ గాక
వాడికచెలుల మెల్లా వాదించేమా
జాడగాదు మాతోనేల సరసాలాడేవు
వీడేలందుకొన్నవారు వియ్యమందేరా

చ. 2: చేసినచేఁతకుఁజేఁత చెలి నిన్నుఁ జేసుఁగాక
యీసుదీర్చేచెలులము యియ్యకొనేమా
సేసలువెట్టితినంటా చెరగులేల పట్టేవు
కైసేసిన పేరఁటాండ్లు కాలుదొక్కేరా

చ. 3: కొంకక నీరతులకు గురి నీదేవులే కాక
వంకలొత్తే చెలులము వావి చెప్పేమా
కంకిగా శ్రీవేంకటేశ కాంత దానే వచ్చి కూడె
లంకెల చుట్టాలము మేలములాడేమా

రేకు: 0207-2 ముఖారి సంపుటం: 08-038

పల్లవి: తెలిసితిమిన్నాళ్ళకు దేవరగుట్టు
వెలుపల లోపల వెలసితివింతటా

చ. 1: కాయము వొక్కతెమీఁద కనుచూపొక్క తెపై
ఆయనాయనెంత నీకు ఆసోదము
యేయెడఁ జూచిన నీవు యిరుమొనసూదివై
చాయలకు నాలుగుహస్తములు ధరించితి

చ. 2: వుండేది వొక్కతెయింట పండేది వొక్కతెవద్ద
రండును నడుపేవు నీ రాజమున
పండును గాయయునైన బలుపుల్లదొరవై
యెండ నీడ కన్నులను యెలయించేవిపుడు

చ. 3: వురమున మహలక్ష్మి వుర్విని వీఁపున మోవి
సిరుల మించేవు నేఁడు శ్రీవేంకటేశ
తొరలించి వలపుగుదులు గుచ్చినవాఁడవై
పరమున నిహమునఁ బాయవు నీవిపుడు

రేకు: 0207-3 భైరవి సంపుటం: 08-039

పల్లవి: నీకునీకే యేలికవు నేనంటినా
కాకరివిద్యలఁ బొంది కరఁగేవుగాక

చ. 1: తీయని నామోవిమీఁద తేనెల తీపులేకాక
వోయయ్య ఆమాటలలో వొగరున్నదా
నీయంతనీవు సేసేటి నెరసులచేఁతలలో
పాయక వెంగేలుంద భ్రమసేవుగాక

చ. 2: కన్నుల నాచూపులలో కమ్మిన తేటలేకాక
యెన్నటికెన్నటి సుద్ది యెఱ్ఱనున్నవా
నిన్న మొన్న నించుకొన్న నీమేనిరేకలు చూచి
పన్ని వొక్కటొక్కటే భావించేవుగాక

చ. 3: నెట్టన నాచేఁతలలో నిండు సరసమేకాక
గట్టివజ్రపుగోళ్ళ ఘాతలున్నవా
యిట్టె శ్రీవేంకటేశ యెనసితివిటునన్ను
గుట్టున నవియూనిదీ గూడించేవుగాక

రేకు: 0207-4 నాట సంపుటం: 08-040

పల్లవి: ఎంతసటకాఁడవో యెవ్వరి నెలయించేవు
చింతించితే నాకైతే చిమ్మిరేఁగీఁ గోపము

చ. 1: కన్నుల జంకించేవు కడుసోఁకనాడితేను
సన్నలు సేసేవు నీవు సాదించితేను
యిన్నిటా సోఁకనాడితే యెట్లానయ్యీనీకు
నిన్నుఁజూచి నాకైతే నిండుకొలది గోపము

చ. 2: చేయిచేతదిమేపు సెలవుల నవ్వితేను
కాయము సోదించితే యేకతమాడేవు
ఆయాలు నేఁదడివితే నలుపేల వచ్చెనీకు
మాయలుచూచి నాకైతే మక్కళించీఁ గోపము

చ. 3: నించేవు కాఁగిటను నిన్నుఁజూచి నవ్వితేను
మంచముపైకిఁదీసితే మన్నించేవు
యెంచఁగ శ్రీవేంకటేశ యింపులెట్లాయనీకు
అందలమోవిగంటికి నందుకొనీఁ గోపము

రేకు: 0207-5 శ్రీరాగం సంపుటం: 08-041

పల్లవి: ఇంతయేటికి చాలు నిందరూ వినేరు
రంతుసేయకిపుడిట్టే రావయ్యలోనికి

చ. 1: కోపములెల్లాఁ బాసె కొంఱతలెల్లాఁ దీరె
ఆపొద్దే నీవురాఁగా నలుకమానె
నీపలుకులెల్లావింటి నీవు వేఁడు కొననేల
రాఁపుసేయకిపుడిట్టే రావయ్యలోనికి

చ. 2: వేసటయించుకలేదు వెరపులు పనిలేదు
సేసలునీవు వెట్టఁగఁ జింతయింకేలా
నీసేఁతలెల్లా మంచివే నిన్నునాడఁజోటులేదు
రాసికెక్కెవలపులు రావయ్యలోనికి

చ. 3: చెమటలు చల్లనారె చిత్తముపుడుకు వోయ
నెమకి శ్రీవేంకటేశ నీవుగూడఁగా
తమకములిద్దరిని తప్పులెవ్వరికి లేవు
రమణుఁడ నీకు మొక్కే రావయ్యాలోనికి

రేకు: 0207-6 దేవగాంధారి సంపుటం: 08-042

పల్లవి: రారే ఆతనినేల రవ్వసేసేరు
దూరించుకోఁడు వచ్చిసంతోస పెట్టీనిపుడు

చ. 1: చతురుఁడైనవాఁడు చనవులిచ్చినవాఁడు
సతిఁ గరుణించి మన్నించక మానునా
మతిలోఁ బాయనివాఁడు మనముచెప్పినదాఁక
యితవెరగనిచేఁత లింతసేసీనా

చ. 2: మాటలాడేయట్టివాఁడు మర్మమెరిఁగినవాఁడు
ఆఁటదానికి బాసిచ్చి అదెరఁగఁడా
సూటిదెలిసినవాఁడు సొలసి యందరిచేత
కూటమిఁ గొసరింపంచుకొనఁ బోయీనా

చ. 3: శ్రీ వెంకటాద్రివాఁడు చేరి నమ్మించినవాఁడు
యీవనితఁ గలసి తానెరవయ్యీనా
దేవుఁడితఁడైనఁవాఁడు తెరవలు నవ్వేదెల్ల
భావించుకొనుచు మేలే పచరించఁడా

రేకు: 0208-1 రామక్రియ సంపుటం: 08-043

పల్లవి: సాకిరులు నేము నేమే సతులుమీరడుగరే
దీకొనిమానిజములు దెలుసుకోరే

చ. 1: పొంచి తాను నగఁగాను బొమ్మల జంకించితిని
తెంచక చెలులు పాడి దీర్చరే మీరు
కంచముపొత్తుకు రాఁగాఁ గప్పురాన వేసితివి
యెంచక యెవ్వరిది మేలేర్పరచరే

చ. 2: పేరుకొని పిలువఁగఁ బెదవుల గొణఁగితి
తేరిచి మాడుఁబాడు దిద్దరే మీరు
చేరి జారించెఁ బయ్యద చేతఁ గొప్పువట్టితి
సారపు మాపంతములు చక్కఁ బెట్టరే

చ. 3: మోవిదానె యియ్యఁగాను మొనపల్లు సోఁకించితి
శ్రీవేంకటేశునకు నాకుఁ జెప్పరే బుద్ధి
దేవుఁడు తా నన్నుఁ గూడె తెలిసి నేనే మొక్కితి
యేవలఁ జూచిన మీరు యిఁక నేమనేరే

రేకు: 0208-2 సౌరాష్ట్రం సంపుటం: 08-044

పల్లవి: మమ్మేమి బుజ్జగించేవు మాకేమి
సమ్మతించి నీకు సంతోసములై తేమేలు

చ. 1: పయ్యెద జారిననేమి భ్రమసిన నేమి నేను
నెయ్యమెంత చేసినాను నీకుమేలు
యియ్యెడ సతులతోన నెమ్మెలు మెరసేనీకు
అయ్యజియ్యవెట్టినాను అప్పటినిమేలు

చ. 2: పవ్వళించి వుంటేనేమి బడలి వుండితేనేమి
నివ్వటించి కాఁగిలించ నీకుమేలు
రవ్వగా నీకొలువులో రాజసము చెల్లించి
పువ్వులవేసినందుకు పొగడితే మేలు

చ. 3: తలవీడి వుంటేనేమి తప్పకచూచిననేమి
నెలవునఁగూడితివి నీకుమేలు
చెలఁగి శ్రీవేంకటేశ చేత నన్ను నేలితివి
యెలమి మనసరసాలెందుకైనమేలు

రేకు: 0208-3 హిందోళవసంతం సంపుటం: 08-045

పల్లవి: మనసెరిఁగినకల్ల మానుపరాదు
యెనలేనిదొరవు నీవేమిసేతువయ్యా

చ. 1: దప్పిగొంటివని నీకు దయదలంచితిఁగాక
చిప్పిలి యేపనులో చేసితివంటినా
రెప్పలెత్తి చూచేవు రేసలువుట్టఁ దిట్టేవు
నెప్పున నామోము చూచి నీకేల కలఁగ

చ. 2: కళలు నీమోముననే కానవచ్చీనంటిఁగాక
సొలసి నీరతులలో చొప్పులెత్తేనా
చలముల జంకించేవు సన్నలను సాదించేవు
నెలవై నాయిచ్చలకు నీకేల కలఁగ

చ. 3: నేరుపరివౌదువని నిన్ను నేమెచ్చితిఁగాక
తారుకాణ సేసి మాట తగిలించేనా
యీరతి శ్రీవేంకటేశ యెనసితివిటునన్ను
నీరచనకు నవ్వితే నీకేల కలఁగ

రేకు: 0208-4 శంకరాభరణం సంపుటం: 08-046

పల్లవి: తానేడ ఆతఁడేడ దయలు దలఁచ వచ్చీ
యీనెపానఁ గంటిమిగా యివిగొన్ని సుద్దులు

చ. 1: నగుతా నాతనినంటే నాతో నీపె వాదించీ
తగవు చెప్పరే మీరు తనమగఁడా
జిగితో నేనేకతానఁ జేసేటి చేఁతలవేళ
అగపడి తానప్పుడడ్డాలువచ్చీనా

చ. 2: కొప్పు నేజారఁదీసితే కురులు దాఁగూడదువ్వీ
తప్పక చెప్పరే మీరు తనమగఁడా
చిప్పిలు రతులలోనఁ జీకాకు సేసేటివేళ
అప్పటివలెనే తావహించుకవచ్చీనా

చ. 3: చెమరించ నేఁగూడితే చేరి తావిసరవచ్చీ
తమకించక చెప్పరే తనమగఁడా
జమళి శ్రీవేంకటేశు సాదించేటి యట్టివేళ
గమిగూడుకొని తాను కావఁగవచ్చీనా

రేకు: 0208-5 నాదరామక్రియ సంపుటం: 08-047

పల్లవి: రచ్చలఁబడెవలపు రావయ్యా
చెచ్చరవచ్చి ప్రియాలు చెప్పించుకోవయ్యా

చ. 1: దగదొట్టెవలపు తరుణి నిట్టూర్పుల
యెగసక్కెములు సేసే వేమయ్యా
చిగిరించెవలపు చిత్తములో కోరికల
మొగముచూచియైన మొక్కించుకోరాదా

చ. 2: కుచ్చిపారీ వలపులు కొమ్మచెమట యేరుల
మచ్చరమేమి గల్లాను మానవయ్యా
పచ్చనాయ వలపులు పలు పులకపైరుల
ముచ్చటాడి ఆపెచేత మొక్కించుకోరాదా

చ. 3: నాని విరిసె వలపు నాతి సెలవినవ్వుల
లేని తరితీపుమాని లేవయ్యా
కోనల శ్రీవేంకటేశ కూడితిరి మీరిద్దరు
మోనాన నూరకే యిట్టె మొక్కించుకోరాదా

రేకు: 0208-6 దేశా(సా)క్షి సంపుటం: 08-048

పల్లవి: చెప్పరాదు వాయెత్తి చేసేటి మీ చేఁతలెల్ల
కప్పిన నీగుట్టెల్లఁ గానవచ్చునిఁకను

చ. 1: కామిని యిప్పుడు నీతోఁ గన్నులనే మాటలాడె
ఏమని యనినదో యెఱఁగఁగాని
వాములై నవవిగొన్ని వలపులు పులకలై
యీమాట కామాఁట యెనవచ్చునిఁకను

చ. 2: చెలియ యప్పుడు నీకుఁ జేతులార సేవచేసె
చల్లపట్టి మర్మమెత్తి సాదించఁగాని
నిలువెల్లఁ జెమరించె నీఁకు మోహరసములై
తలఁపులు తలఁపులు తారుకాణే యిఁకను

చ. 3: అంగన యిప్పుడు నిన్ను నాయములంటఁగఁ గూడె
పంగించి మీభావములేర్పరచఁ గాని
యింగితాన శ్రీవేంకటేశ నీవే నవ్వితివి
యెంగిలి మీమోవులివి యేరుపడెనిఁకను

రేకు: 0209-1 లలిత సంపుటం: 08-049

పల్లవి: పండిపొల్లవోయీనా పట్టరానిమనసు
యెండకు నీడకుఁ దీసి యింతకోపఁగలనా

చ. 1: చాలుఁజాలు చెలియ చవిగాదుసొలయ
మేలువాఁడై తేఁగదా మీరఁజూచేది
నాలికాఁడు మొదలనే నవ్వులనె పొద్దువుచ్చీ
యేలినప్పుడేలీఁగాక యింతకోపఁగలనా

చ. 2: రావెరావె ముగవా రతికెక్కె తెగువ
మోవులు సోఁకితేఁగదా మొనచూపేది
రావిజిగురై నవాఁడు రచియించీ తరితీపు
యేవివరమో కందము యింతకోపఁగలనా

చ. 3: వింటివింటి కాంతా వేళవచ్చెఁగొంత
తొంటివలెనై తేఁగదా దొమ్మిసేసేది
దంట శ్రీవేంకటేశుఁడు తానేవచ్చి నన్నుఁ గూడె
యింటిలోనే నన్ను మెచ్చీ యింతకోపఁగలనా

రేకు: 0209-2 మంగళకౌశిక సంపుటం: 08-050

పల్లవి: కరుణదెచ్చుక యింతిఁ కాతువు గాక
దొరతనము చూపితే దూరఁగనేమున్నది

చ. 1: నిండుకొన్న విరహాన నిన్నటనుండిఁ జెలి
యెండనుండఁగా నాడించే వెడమాటలు
వండవండనట్లాయ వలచినవలపెల్ల
గుండె రాయిసేకొంటేఁ గొరనేమున్నది

చ. 2: పట్టరాని తమకాన పానుపుపై నుండి చెలి
వెట్టనుండఁగా జల్లేవు వెడనవ్వులు
పటఁ బట్టఁ బాములాయ పంతపుఁ గోరికెలెల్ల
పట్టినదే చలమైతే పలుకనేమున్నది

చ. 3: కన్నుదనియక నిన్నుఁ గాఁగిలించుకుండి చెలి
చన్నులనొత్తఁగ నీవు సారె లోఁగేవు
పన్నఁబన్న పందిలాయ బయలు శ్రీవేంకటేశ
నిన్నునాపెఁ జూచుకొంటే నేరములేమున్నవి

రేకు: 0209-3 లలిత సంపుటం: 08-051

పల్లవి: ఆరంగఁ జూడరే అదె కృష్ణమహిమలు
కూరిమి మించిన గోపికలు

చ. 1: కొట్టేటివుట్లు కోలలగుంపులు
గుట్టులఁ బొంచెడి గోపాలులు
అట్టులుఁ బండ్లు నట్టె చక్కిలాలు
చుట్టుల నెక్కడ చూచినను

చ. 2: యేఁగేటి వీధులు యిండ్లిండ్ల వాకిళ్ల
వాఁగే పంచమహావాద్యములు
దాఁగిలి ముచ్చిమిఁ ద్రావేటి పాలును
చేఁగదేరీనెందు చేయిచాఁచినా

చ. 3: కారేటి జున్నులు గడ్డపెరుగులు
వారలువట్టేటి వైపులును
యీరీతి శ్రీవేంకటేశుని సన్నిది
ఆరితేరె నెంద నరసినను

రేకు: 0209-4 రామక్రియ సంపుటం: 08-052

పల్లవి: నీమనసాపె యెరుఁగు నిక్కముగాను
గామిడితనానఁగాని కలుగదు వలపు

చ. 1: చెక్కు నొక్కి నీవు ముందు చేయివట్టి తీయుదాఁకా
అక్కడనే నిలుచుండె నాపె సాదించి
నిక్కము నింతేసిసేయ నేరిచినవారికిఁగా
చిక్కి చేతికిని లోనై సిద్ధించు వలపు

చ. 2: ననుపున నీవింతేసి నవ్వులు నవ్వినదాఁక
అనువుగా మాటలాడె నాపె సాదించి
పెనఁగేటి యిటువంటి బేసబెల్లివారికేకా
వెనకముందరికెల్లా వెలవెట్టు వలపు

చ. 3: కందువల నీవుగూడిన కరగించిన దాఁకా
అందాన వేళలు గాచె నాపె సాదించి
యిందునే శ్రీవేంకటేశ యిటువంటివారికిఁగా
సందడించి మీయందే సరిదాఁకె వలపు

రేకు: 0209-5 ముఖారి సంపుటం: 08-053

పల్లవి: ఇంకనేల గుట్లు యిన్నియు బయటఁబడె
మంకులెల్లఁదీరె నిఁక మానరాదు పొందులు

చ. 1: చేసినదెల్లా నీపైచెలి చేసినదిచేఁత
వాసినవి కొనగోరి వాఁతలు నివి
తాసువలె వలపులు తారుకాణలకువచ్చె
మూసి మంతనాలేఁటికి మోహరించె పొందులు

చ. 2: ఆడినట్టెల్లఁ జెల్లెసంగన మాటనీతో
వేడుక నీ సొమ్మాయ నీ వినోదముల
వీడుదోడై మీనవ్వులు వెన్నెల తేటలుగాసె
యీడనేల మీసిగ్గులు యితవాయ పొందులు

చ. 3: పట్టినదెల్లాఁ బంతము పడఁతి నీరతులలో
ముట్టినవి చన్నులు నీమొనచేతుల
యిట్టె శ్రీవేంకటేశ యిద్దరును గూడితిరి
అట్టుకెక్కె నిందరిలో నాఱడి మీపొందులు

రేకు: 0209-6 గౌళ సంపుటం: 08-054

పల్లవి: వద్దు వద్దు మీలోన వట్టివాదులు
సుద్దుల మాటలకే సూడువట్టేరా

చ. 1: పంతములాడితేనేమి బలిమిచేసితేనేమి
వింతలేని మనసుల వెలఁదులకు
దొంతర వలపులెల్ల తోడుతనే వెంటరాఁగా
యింతమాత్రపు వలఁపు లివి చెల్లవా

చ. 2: గబ్బితనమైననేమి గర్వము చూపిననేమి
వుబ్బేటి జవ్వనముల వువిదలకు
నిబ్బరపు టాసలెల్ల నిండుకొని వుండఁగాను
అబ్బురపుఁ దమకములవి మానీనా

చ. 3: కన్నుల నొక్కిననేమి కాఁగిలించుకొన్ననేమి
నిన్నుఁ గూడి వుండినట్టి నెలఁతలకు
మన్నించు శ్రీవేంకటేశ మరి నీ యాసవుండఁగా
సన్నపు మోవితీపుల చవులెక్కవా

రేకు: 0210-1 నారణి సంపుటం: 08-055

పల్లవి: పంతమిచ్చేఁ గోపయ్య పట్టవయ్య
యింత నీవుమన్నించితే యియ్య కొంటినయ్యా

చ. 1: సెలవికి నవ్వువచ్చె చేరి నీతో మాటాడఁగ
వులివచ్చి సాము నీతో నోపమయ్యా
పులకలు మేననిండె పొంచి వద్దఁ గూచుండఁగ
యెలమి నిన్నొరయఁగ నెంత దానయ్యా

చ. 2: చెక్కులఁ జెమటనిండె సిగ్గులు నేఁబడఁగా
వొక్కమాటే జాణతనాలోపమయ్యా
చొక్కులు మతికి వచ్చె సుద్దులు నీచేవినఁగ
దక్కె నన్నిపనులును తమకించనయ్యా

చ. 3: కాయము కళలురేఁగె కాఁగిట నిన్నుఁ గూడఁగా
వోయయ్య నిన్నలయించ నోపమయ్యా
యీయెడ శ్రీవేంకటేశ యిట్టైనన్ను నేలితివి
చాయలు సన్నలు లోలో సరివచ్చెనయ్యా

రేకు: 0210-2 కొండమలహరి సంపుటం: 08-056

పల్లవి: కొంక నీకేఁటికి లోనఁగూచున్న దదెచెలి
అంకెకు నీవు రాఁగాను అలుగునా యీకె

చ. 1: ఎక్కడ నీవుండినాను యింతొపొందు నీకు గురి
చిక్కించి యింతికిని నీ చిత్తమే గురి
పుక్కిట చెలులెందరు పోరాటాలు వెట్టినాను
అక్కరగలదు నీతో అలుగునా యీకె

చ. 2: యేమేమి సేసివచ్చినా యింటికి విచ్చేసితివి
కామించి కన్నులఁ జూచె కాంత నీమోము
గామిడి చెలులెంతేసి గడియించి చెప్పినాను
ఆముకొన వలచి నీకలుగునా యీకె

చ. 3: సతులెందరు గల్లా చనవు లీసతివే
దృతినీకుఁ బట్టానకు దేవులాయెను
యితవై శ్రీవేంకటేశ యేకమైరి చెలులెల్ల
అతిరతిఁ గూడె నీతో నలుగునా యీకె

రేకు: 0210-3 వరాళి సంపుటం: 08-057

పల్లవి: వచ్చి వచ్చి రమణుఁడు వాకిట నేల నిలిచె
తచ్చనలెల్లాఁ దెలిపె దగ్గరి రమ్మనవే

చ. 1: వలచిన యట్టివారు వడినేమి యాడినాను
మలసి నవ్వుట గాక మంకులేఁటికి
చలములు సాదించ సవతిపోరాయేమి
తలఁపులో కొదదీర్చె దగ్గరి రమ్మనవే

చ. 2: కొమెరపాయపువారు కొచ్చి కొచ్చి పెనఁగితే
జమళిఁ గైకొంటగాక సటలేఁటికి
వుమురఁ బెట్టగ నట్టె వుక్కిసకూడాయేమి
తమకము చెల్లఁబెట్టె దగ్గరి రమ్మనవే

చ. 3: పొత్తుగూడినట్టివారు పొదిగి కాగిలలించితే
హత్తి మెచ్చవలెగాఁక ఆనలేఁటికి
వొత్తి శ్రీవేంకటేశుఁడు వొడివట్టి నన్నుఁగూడె
తత్తరీఁడు మాటచెప్పె దగ్గరి రమ్మనవే

రేకు: 0210-4 దేశా(సా)క్షి సంపుటం: 08-058

పల్లవి: వట్టిసిగ్గు లేఁకనేల వనితెల యెదుటను
వెట్టదీరనేము తెర వేతుమా యిద్దరికి

చ. 1: పలుకుఁదేనెల విందు పచ్చిమోవి బాగాలు
కలిగె నేఁడు నీకుఁ గాంతవల్లను
పులక పువ్వుల సే బుసకొట్టు సురట్లు
నెలఁత చేకొనె నిదె నీవల్లను

చ. 2: సిరుల నవ్వుగందాలు చెమటల పన్నీరు
దొరకె నేఁడు నీకు తొయ్యలివల్ల
సరసపుఁ బొంతనాలు సళుపుగోరి సొమ్ములు
నిరతినాపెకుఁ గూడె నీవల్లను

చ. 3: గబ్బి బొమజంకెనలు కళలమే సుంకువలు
అబ్బెను నేఁడు నీకు నంగనవల్ల
గొబ్బున శ్రీవేంకటేశ కూడితివి జవ్వనికి
నిబ్బరపు తమి నిండె నీవల్లను

రేకు: 0210-5 ధన్నాశి సంపుటం: 08-059

పల్లవి: వేసవియెండలుండునా వేరె వానకాలానకు
పాసినకాఁకలు రతి పచరించ వచ్చునా

చ. 1: పేరఁబెట్టితే వలపు పెరుగువంటిదెపో
కేరి కాచఁబోతే విరిగి పోవుఁ గాని
గారవించే రమణుని కతలకు లోఁగావే
దూరఁబొయ్యేవుగనక తుత్తుమురౌ మనసు

చ. 2: చవిగొంటే తమకము చక్కెరవంటిదె పో
కవ వాసితే అట్టె కారమౌఁ గాని
నవకపు నాయకుని నవ్వులెల్లాఁ జేకొనవే
తిరిరేరుగనక పై తీగె సాగు చలము

చ. 3: పనిగొంటే జవ్వనము బంగారువంటిదె పో
దినములు దొబ్బితే వన్నెదీఁ గాని
యెనసెను శ్రీవేంకటేశుఁడు న(ని?)న్నింతలోనే
పెనఁగేవుగనక ముప్పిరిగొను బీరము

రేకు: 0210-6 దేవగాంధారి సంపుటం: 08-060

పల్లవి: ఇంకేల మొరఁగేవే యింతి మాతో నేఁడు
లంకెసింగారముల లలి మీరుఁ గాక

చ. 1: చిగురుఁ గెమ్మోవిపై చిలుక వోట్లమరునా
మిగులఁగ కోవిలల మేఁత గాక
జిగిఁ జెక్కుటద్దముల చెమటచిత్తడేలే
పొగరుమెఱుఁగుల కళల పొడి రాలుఁగాక

చ. 2: జక్కవకుచంబులకు చంద్రోదయములేలే
నిక్కి రత్నపుటెండ నిగుడుఁ గాక
పక్కన నడుమును బయలువాఁకనేలే ఆరు
అక్కడ నిట్టూర్పుగాలి అలరుఁ గాక

చ. 3: పొంచి తనువల్లిపై పులకమొలకలు (ల?) దేలె
పంచాస్త్రువిదులందు పరుగుఁ గాక
యెంచగల శ్రీవేంకటేశుఁడిదివో కూడె
ముంచుకొని తలఁబాలు మురుకొనుఁ గాక

రేకు: 0211-1 ఆహిరి సంపుటం: 08-061

పల్లవి: ఏఁటి బుద్ధులు చెప్పేరే యింకా నాకు
మాఁటలాడుటగాక మచ్చుచల్లేదా

చ. 1: పతిఁబాసిన నేరమి పైకొని నాకుండఁగాను
అతనినెంతేసి మాఁటలాడుమనేరే
మతిలోని నామంకే మళ్ళవేకొని కొంత
వెతదీర్చుకొంటగాక వేగిరించేదా

చ. 2: పంతమాడిన గర్వపుబలిమి నాకుండఁగాను
రంతుల నాతనినెట్టు రవ్వసేతునే
వంత నా వల్ల వచ్చిన వగపల్లాఁబెడఁబాయ
చింతదీర్చుకొంట గాక సిగ్గువడేదా

చ. 3: కాఁగిటఁ గూడినయట్టి ఘనత నాకుండఁగాను
ఆఁగుచు నాతనినెట్టు అలయింతునే
తోఁగిన చెమటలాడ తోడనే శ్రీవేంకటేశు
రేఁగి నవ్వించుటగాక రిచ్చవడేదా

రేకు: 0211-2 దేసాళం సంపుటం: 08-062

పల్లవి: విన్నపము లేకనేల వేగినంతాను
మన్నించకికనుంటే మఱియేది త్రాణ

చ. 1: కాంతకు నీవు చూచిన కనుచూపులే త్రాణ
మంతనాన నీవాడిన మాటలే త్రాణ
పొంత నీపై తలపోఁత పొద్దువోకలే త్రాణ
యింతట నీవురాకున్ననికనేది త్రాణ

చ. 2: నలినాక్షికపుడు నీ నవ్విన నవ్వులే త్రాణ
పలుమారుఁ జేసినట్టి బాసలే త్రాణ
పొలసి నీవువేసిన పువ్వులచెండే త్రాణ
పిలుపించకికనుంటే పిక్కటిల్లుఁ ద్రాణ

చ. 3: సతికి నీకూటమిలో చనవిచ్చుటలె త్రాణ
వ్రతముగా నీవింటికి వచ్చుటే త్రాణ
గతియై శ్రీవేంకటేశ కాఁగిలించి నదె త్రాణ
తతినిట్టె కూడకుంటే తగనేది త్రాణ

రేకు: 0211-3 మధ్యమావతి సంపుటం: 08-063

పల్లవి: ఎన్నిటికిఁక దయ యేడనున్నది
వన్నె చిత్తరువు వ్రాసి వనితఁజేసితివా

చ. 1: చిత్తమెల్ల నీరాయ సిగ్గులెల్ల నెగ్గులాయ
వత్తివలె విరహాన వాడె దేహము
యిత్తల నీవెట్టఁ బొంది యెన్నఁడిఁక వడదేరు
కొత్తగా కరుగుగట్టి కోమలిఁ జేసితివా

చ. 2: చెమ్మగించె తనువల్లి చెక్కులు చేతికివచ్చె
చిమ్మిరేఁగి పులకలచెట్లు మొలచె
తమ్మివలెఁ జెంగలించె తరి యెన్నఁడిఁక తోలు
బొమ్మకు ప్రాణమువోసి పొలఁతిఁ జేసితివా

చ. 3: వీడెపు మోవి వెలసె వెగటులెల్లాఁ బాసె
వేడుక రతులచేత విఱ్ఱవీఁగెను
యీడనే శ్రీవేంకటేశ యింతినిట్టే కూడితివి
నీడకు చైతన్యమిచ్చి నెలఁతఁ జేసితివా

రేకు: 0211-4 కేదారగౌళ సంపుటం: 08-064

పల్లవి: ఆయములకెల్లా గురి అతనుని బాణములు
చాయ చూచెకొమ్మనవె జామెక్కెనిపుడు

చ. 1: తలపోఁతలకు గురి తాననేనూనిద్దరము
పలుకులకెల్లా గురిపంతమొక్కటే
సెలవి నవ్వులకును చెలులిందరును గురి
తెలుకో రమ్మనవే తెల్లవారెనిపుడు

చ. 2: తగులాయాలకు గురి తననాసందిపొందులు
పగటులకెల్లా గురి పచ్చిసేఁతలు
అగపడ్డందుకు మేని అడియాలములు గురి
మొగమేది రమ్మనవే మువ్వరజామెక్కెను

చ. 3: ఇచ్చిన కాఁగిళ్ళ గురి యిద్దరితమకములు
విచ్చనవీళ్ళకు గురి వింతరతులు
యిచ్చట శ్రీవేంకటేశుడింతసేసి కూడెనింకా
మచ్చికెతో రమ్మనవే మద్యాన్న మెక్కెను

రేకు: 0211-5 ఆహిరి సంపుటం: 08-065

పల్లవి: మగువకు దిక్కెవ్వరు మరియును నీవేకాక
తగవు ధర్మాలు నీవే తలపోయ వలదా

చ. 1: యేపున నీయంతనీవు యింతి విచారించకున్నా
ఆపెమాట వినవద్దా అయ్యో నీవు
చాపలాన నీకంటె సవతికి దయవుట్టె
పాపపుణ్యములు నీవు భావించుకోవలదా

చ. 2: పంతాన నీకెవద్దికి పైకొని నీవురాకున్నా
కాంతపంపు సేయవద్దా కట్టా నీవు
పొంతనే మొగమోటము పొరుగువారెందుగలిగె
చెంత నీవిచ్చినబాస చెల్లించుకోవలదా

చ. 3: ఇల శ్రీవేంకటేశుఁడ యెంతరాజసమైనా
చెలిమేలు చూడవద్దా చెల్లఁబో నీవు
తొలఁగక కూడితివి తోడియాపె యెచ్చరించఁగ
నెలకొన్న నీ గుణాలు నెరపఁగ వలదా

రేకు: 0211-6 పాడి సంపుటం: 08-066

పల్లవి: తాసువంటిది మన తప్పులు నీకా లేవు
మూసిన ముత్యాలవలె ముంచీని నవ్వులు

చ. 1: పొలఁతికి బాసయిచ్చి బొమ్మచారివై వుండఁగ
చెలి వేరొకతె వచ్చి చేయివట్టీని
బలిమి యెవ్వరిదో పనులు దాదాత మోచె
నిలువునూరు వండీని నీమేనిపలకలు

చ. 2: వనితకు సన్నసేసి వ్రతము వట్టుకుండఁగ
పెనఁగి వేరొకతె తాఁ బిలిచీ నిన్ను
చనవు లెవ్వరిపాలో చవులు రెంటాఁదోఁచి
పొనిఁగి పోఁకను నీపై పుట్టెడమ్మి వలఁపు

చ. 3: కొమ్మవొకతెతోఁ బెండ్లికొడుకవై నీవుండఁగ
కమ్మర నొకతెవచ్చి కాఁగిలించీని
యెమ్మెల శ్రీవేంకటేశ యిద్దరితో మొగమాట
యిమ్ముల కోటికిఁ బడిగెత్తెను నీరతులు

రేకు: 0212-1 శంకరాభరణం సంపుటం: 08-067

పల్లవి: ఏమైనానాడేవారి నేమందును
మోము చూచితే చెరువుముయ్యమూకుడున్నదా

చ. 1: అడియాలముగ నీవు ఆదేవి సత్యాలే కాక
కడు మావంటి వారితోఁ గల్లలాడేవా
జడిసి తొల్లి అసురతులతో నేమో కాక
తడవితే నేటివేళ తప్పు నీయందున్నదా

చ. 2: చిమ్మిరేఁగ నీవిన్నిటాఁ జేసేవి పుణ్యాలే కాక
పమ్మి నీవొళ్ళు నెంచితే పాపమున్నదా
కుమ్మరించి యీసుద్దులు గొల్లెతలందేమో కాక
నెమ్మది నీపొద్దుకు నింద నీయందున్నదా

చ. 3: దగ్గరితే నీవల్లను దయదాక్షిణ్యాలే కాక
కగ్గిన నిష్టూర మించుకంతగలదా
వెగ్గళించి నన్నును శ్రీవేంకటేశ కూడితివి
వొగ్గి నిన్నుదూరఁబోతే వొచ్చము నీకున్నదా

రేకు: 0212-2 సామంతం సంపుటం: 08-068

పల్లవి: ఇంక నీచిత్తముకొద్ది యింతిభాగ్యము
వుంకువ కోరికెలలో నోలలాడీనదివో

చ. 1: వనిత వాలుక చూపు వంచి (అట్టె)
పెనఁగుచు పులకలు పెంచి
మునుకొన్న తమకము ముంచీనదె
గునిసి నీతో నలుగఁ గొంచీనదివో

చ. 2: పొలసి మోహముమాట పొదిగి అట్టె
సెలవుల నవ్వులెల్లాఁ జిదిగి
యెలమి జవ్వనమున నెదిగి
వులివచ్చి గోరుమోప నొదిగీనదివో

చ. 3: మొక్కపుటూరుపులు విసరి అట్టె
గుక్కక పైపై రతులు గొసరి
చక్కని శ్రీవేంకటేశ సతి గూడి నిన్ను
మొక్కుచు మోవితేనెకు ముసరీనదివో

రేకు: 0212-3 భైరవి సంపుటం: 08-069

పల్లవి: కోపించ నేరుతునా గునిసీఁ దాను
తీపుమోవికిఁగా నేల తిట్టీనే తాను

చ. 1: పొద్దువోదా వలపులు పోగువోసి వున్నవా
పెద్దరికేలకు నేల పిలిపించీనే
చద్దివేఁడి జవ్వనాన సడి దనమీఁదవేసి
వొద్దనున్న నన్నింతేల వొరసీనే తాను

చ. 2: మాటలేదా మరి తనమనసుకు రూపుగద్దా
చీటికిమాటికి నేల చేఁత చేసీనే
పాటించిన తమకాన పంతమెల్లా తనకిచ్చి
యేటవెట్టుకొంటే యాలయెగ్గరేఁచీఁ దాను

చ. 3: ఇట్టెకొత్తా తనలోని యెన్నికకు తప్పుగద్దా
పట్టి కాఁగిలించి యాల భ్రమయించీనే
గుట్టుతో శ్రీవేంకటేశుఁ గూడి నే సంతోసించఁగా
గట్టియైనందుకు నెంత కరఁచీనే తాను

రేకు: 0212-4 తెలుఁగుఁగాంబోది సంపుటం: 08-070

పల్లవి: ఒద్దేలే జగడాలు వోయింతి
సిద్ధెబట్టి కోరికలు చిత్తఁగించఁ గదవే

చ. 1: మొగముచూచి యతఁడు మోవితేనెలడుగఁగా
వొగరులేలాడేవే వోయింతి
నగవుల పంచదార నాథుఁ డందుపై జల్లి
జిగి చవిచేకొనీఁ జిత్తగించఁ గదవే

చ. 2: వాటపు వలపతఁడు వారవట్టుకుండఁగాను
వూటలేల పోఁ జల్లేవే వోయింతి
పాటించి సరసముల పన్నీరతఁడు నించి
చీటికి మాటికి వేఁడీ చిత్తగించ గదవే

చ. 3: అప్పుడే కాఁగిటఁ గూడి ఆయములతఁడంటఁగా
వుప్పతించేవేలె రతులోయింతి
చిప్పిలె కాఁగిటిలోన శ్రీవేంకటేశ్వరుఁడు
చెప్పరాని చేఁత సేసీఁ జిత్తగించ గదవే

రేకు: 0212-5 రామక్రియ సంపుటం: 08-071

పల్లవి: ఏలనాచే మొక్కించేరే యిప్పుడేనన్ను
కాలగాలమున మేలు కనుఁగొనేఁగాక

చ. 1: పంతమే ఫలముగాఁక బ్రదికేటి వారికి
చెంతలఁ బ్రియాలు చెప్పఁజెల్లునటవే
దొంతులు వేరిచేనంటే తోదోపులు వలపులు
కాంతుఁడు మన్నించిన కనుఁగొనేఁగాక

చ. 2: రాజసమే ఫలముగా రచ్చసేసేవారికి
వోజదప్పి కిందుపడ నొనరునటే
సాజము చూచేనంటే చలములు బహళము
పూజ లాతనిచేతనే పొరసేఁగాక

చ. 3: కూటములె ఫలముగా గురియైనవారికి
పాటించి కోపించుకొనఁ బాడియటవే
యీటున శ్రీవేంకటేశుఁడింతలోనే నన్నుఁగూడె
తేటలనాతనివల్లఁ దిరమయ్యేఁ గాక

రేకు: 0212-6 సామంతం సంపుటం: 08-072

పల్లవి: ఇద్దరును నవ్విరిదె యెడమాటలిఁకనేల
కొద్దిమీర మనమెల్లాఁ గోరినట్టే ఆయెను

చ. 1: సరసములాఁడగాను చవిపుట్టె వలపులు
విరసపుటలుకలు వెడజారెను
తరితీపులవల్లను తమివుట్టె మీఁద మీఁద
కెరలిన వోట్లలో కిసరులు వాసెను

చ. 2: కందువలనుండఁగా కన్నులకు నింపులాయ
మందలించె వెనకటి మంకులుమానె
సందడించి పెనగఁగా చనవులు మితిమీరె
చిందువందులై నట్టి సిగ్గు వెడజారెను

చ. 3: ముంచి మాటలాడఁగాను మోవులతేనె దొరకె
చంచలపుఁ గపటాల సడిదీరెను
యెంచఁగ శ్రీవేంకటేశుఁడింతియునుఁ గూడిరిదె
కొంచముదొడ్డెరఁగని కొసరులు దక్కెను

రేకు: 0213-1 హిజ్జిజి సంపుటం: 08-073

పల్లవి: కానీవే యెంతకెంత గబ్బితనము
యీనెపములెల్లాను యెరఁగనటె

చ. 1: నవ్వులనె వొకమాట నటనలనొకమాట
దివ్వెనలనొకమాట తిట్టేవేమే
పువ్వులనె వొకవాటు పోరచినె వొకవాటు
యివ్వలనే వేసితేను యేమిసేసేవే

చ. 2: కన్నులమొనలుచూపి కతలమొనలుచూపి
చన్నులమొనలుచూపి సాదించేవే
నున్ననిగోరుదీసి నూఁగురుల కొప్పుదీసి
యిన్నినే రట్టుసేసితే నేమిసేసేవే

చ. 3: బిగువుఁగాఁగిటఁ బట్టి బీరమునఁ జలపట్టి
పగటున కొనగొంగు పట్టేవేమే
జిగిమించఁగలసితి శ్రీవేంకటేశుఁడఁదాను
యెగసక్కేల దూరితే నేమిసేసేవే

రేకు: 0213-2 మలహరి సంపుటం: 08-074

పల్లవి: ఏలనన్నుఁబాసితివి యిందాఁకానేడపరాకు
తాలిమిగలదాననా తలఁచి నీయడకు

చ. 1: మొక్కితిఁగా అల్లనాఁడె మొరఁగులు మానుమని
తక్కులేక వలచినదాన నేనని
నిక్కపుటాసలు నాలో నిండియుండవివియని
మక్కువనాతోఁగూడి మన్నించుమని

చ. 2: సేవలెల్లాఁ జేసితిగా సిగ్గులు వడకుమని
వేవేలు నావిన్నపాలు వినుమని
భావించునావల్ల నీకు పంతమెల్లాఁజేరెనని
నీవల్లఁ దప్పులేకుండా నెరవేరించుమని

చ. 3: కప్పితిఁగాపయ్యద యీకపటము వాసెనని
చిప్పిలె నాచిత్తము నీచేఁతలనని
యిప్పుడె శ్రీవేంకటేశ యేలితివి నన్నునిట్టె
దప్పిదేరె మోవితేనెఁదనిసితినని

రేకు: 0213-3 నాదరామక్రియ సంపుటం: 08-075

పల్లవి: మీరే యెరఁగరా యిన్ని మేటిజాణలు
మారుమోములిఁకనేల మాటాడరాదా

చ. 1: సతమైన కూరిమికి సాదించనేల
హితవైన వినయాలే యింపులుగాక
కుతిలంబులేని మతి కొరనేల
రతికెక్కె చనవు మెరయుటగాక

చ. 2: ఆసపడ్డ చూపులకు నడ్డాఁకలేల
వేసటలేక నవ్వుటే వేడుకగాక
సేసవాలవావులకు సిబ్బితియేల
మోసపోని కూటములే ముచ్చటలుగాక

చ. 3: ఆయాలు సోఁకిన పనికచ్చికమేలా
చాయలు సన్నలునే చవులుగాక
యీయెడ శ్రీవేంకటేశ యింతీనీవూఁ గూడితిరి
రేయిఁబగలివే పెరరేఁపులు గాక

రేకు: 0213-4 శుద్ద దేశి సంపుటం: 08-076

పల్లవి: వెల్లవిరాయఁ బనులు వేసాలేలే
గొల్లదానవా నీవు కొంకనిఁకనేఁటికే

చ. 1: కన్నులతేటలు వారె కళలు మోమునమీరె
చిన్నదానవా యింకా సిగ్గులేఁటికే
చన్నులకొండలమీద చంద్రవంకలవె నిండె
కన్నెపడుచవా నీవు కప్పి దాఁచనేఁటికే

చ. 2: పొలుకొనెఁ బులకలు పమ్మె సిగ్గుమొలకలు
గోలదానవా యేమి గుట్టుదాఁచేవే
తూలుచును నీకొప్పు తుమ్మిదలెల్లా బెదరె
బాలదానవా వట్టిభయము నీకేఁటికే

చ. 3: గాఁటపు నిట్టూర్పురేఁగె కమ్మని మోవెల్లరేఁగె
నేఁటిదానవా నీవు నివ్వెరగేలే
యీటువెట్టి శ్రీవేంకటేశుఁడిదె నిన్నుఁ గూడె
మాఁటుదానవా నీకు మతకములేఁటికే

రేకు: 0213-5 సౌరాష్ట్రం సంపుటం: 08-077

పల్లవి: మనలోనే యింతగద్దా మాఁటి మాఁటికి
వినిపించే వినవయ్యా విన్నిపములెల్లను

చ. 1: పక్కన నవ్వినప్పుడే భయమెల్లఁ బాసెనీవు
చెక్కు నొక్కినప్పుడే చింత దీరెను
యెక్కువ ప్రియములతో యేల వేడుకొనేవింత
మొక్కే నుండవయ్యా నీకు మోహించినదానను

చ. 2: దండఁ గూచుండినప్పుడే తగవులెల్ల నీడేరె
కొండల చన్నులంటఁగా కోరికె దక్కె
వెండియు నాకెంతేసి వినయాలు సేసేవు
పండేనయ్యా నీవద్ద నేబత్తిగలదానను

చ. 3: కలసిన యప్పుడే కాయము తనివిఁబొందె
చెలిమి నేసినప్పుడే చెమరించెను
యెలమి శ్రీవేంకటేశ యీడేరితి నీ రతుల
చెలఁగే నిదిగోవయ్యా సేవసేసేదానను

రేకు: 0213-6 దేశా(సా)క్షి సంపుటం: 08-078

పల్లవి: సరివచ్చెఁ గదవే చల్లేటి నీవలపులు
గరిమె నీరమణుఁడుల గాలివంటివాఁడు

చ. 1: తాలిమిగలవారికి తలఁపెల్లానీడేరు
అలరి కోపక త్తెలకాలు సోఁకు
యేల తప్పక చూచేవు యెఱఁగవా నీవిది
మేలిమి నీమగఁడు తుమ్మిదవంటివాఁడు

చ. 2: చెంతనున్నవారికి చేతికిఁ జిక్కు బనులు
పంతపు మగువలకుఁ బట్టుఁ జలము
మంతనమేమాడేవు మాఁటిమాఁటికి నాతోను
మంతుకెక్కి పతి నీడమానివంటివాఁడు

చ. 3: కూడినట్టివారికి గుణములెల్లా మంచివి
వేడుక వనితలకు వెలియే లోను
యీడనే శ్రీవేంకటేశునింతినీవు గూడితివి
తోడనితఁడెంచితే చంద్రునివంటివాఁడు

రేకు: 0214-1 మాళవిగౌళ సంపుటం: 08-079

పల్లవి: ఏడనుండా నాసొమ్ము యెందు వొయ్యీనే
వీడెములో కప్పురమే వీనివలపెల్లను

చ. 1: పంతమాడుకొనఁ గాని భావించ నాతనిరూపు
చింతించ నాలోనిదే చెప్పనేలే
దొంతివెట్టి గొల్లెతలు దోమటిదొడుకఁగాను
బంతిచిక్కినట్టి మోవిపండు నే దాఁచితినే

చ. 2: విచ్చి చెప్పఁగాని తనవింతచక్కఁ దనమెల్ల
పచ్చి నాచపులలోనే పదరనేలె
ముచ్చటఁ బదారువేలు ముడిచివేసినపువ్వు
తెచ్చి నేదాఁచుకొంటిని దేవర యెరఁగదా

చ. 3: బట్టు నీ నారతి నాఱడి శ్రీవేంకటేశుఁ
డొట్టి వొరసినవొర వొరయనేలె
అట్టె తొల్లిటివారి అరచేతి నిమ్మపండు
గుట్టున నేదీసుకొంటి గుఱుతులడుగరె

రేకు: 0214-2 హిందోళవసంతం సంపుటం: 08-080

పల్లవి: నేనుసేసే చేఁతలలో నెరుసున్నదా
మీనుల వినుమంటేను వేసరేవుగాక

చ. 1: కప్పుర మిచ్చితిఁ గాక కవకవ నవ్వితినా
రెప్పల మొక్కితిఁగాక రేసు రేచేఁనా
ముప్పిరినెవ్వతెచేనో ముందువాడివచ్చి
దప్పితో నొక్కటొక్కటే తలచేవుగాక

చ. 2: చిగురందిచ్చితిఁగాక చేగోరు దాఁకించితినా
మొగమోటనుంటిఁగాక ముంచికైకోనా
మగువ యెవ్వతెచేనో మర్మాలు తొరలి వచ్చి
పగటులనూరకే భ్రమసేవుగాక

చ. 3: రతులఁ గూడితిఁ గాక రాజసము చూపితినా
సతమై యుండితిఁగాక సాదురీతిని
గతియై శ్రీవేంకటేశ కడపలోఁ గూడితివి
మతి నెవ్వతోఁ దలఁచి మలసేవుగాక

రేకు: 0214-3 ముఖారి సంపుటం: 08-081

పల్లవి: అవునయ్యా దొరవౌదువన్నిటా నీవు
వివరముతోడి నన్ను వీరిడిఁజేసేవు

చ. 1: యెవ్వతెనో సరివెట్టేవేఁటికి నాతోఁ జలము
పువ్వువంటి మనసిట్టే పూఁపసేసేవు
జవ్వనమదముతోనే సరినన్నుఁ జేరితేను
నవ్వులనె పొద్దువుచ్చి నాలిసేసేవు

చ. 2: యెక్కడికైనాఁ బిలిచేవెగసక్కె మెంత నీకు
లక్కవంటి వలుపేల వుక్కుసేసేవు
లెక్కలేని యాసతోడ తెమ్మని నేఁగొసరితే
జక్కవ చన్నులేముట్టి జాగుసేసేవు

చ. 3: యెంతవడైనాఁ గూడేవేమి నేరుచుకొంటివి
వంతవంటి సిగ్గేఁటికి వాఁకసేసేవు
యింతలో శ్రీవేంకటేశ యిద్దరముఁ గూడితిమి
దొంతిమోవి తేనెలిచ్చి దొరఁజేసేవు

రేకు: 0214-4 వసంతవరాళి సంపుటం: 08-082

పల్లవి: ఆతఁడిదె నీవిదె ఆసలెల్లా నెరవేరె
చేతికి లోనాయఁ బతి చెల్లునమ్మా

చ. 1: మగఁడు నిన్ను మన్నించె మనసొక్కటాయనిఁక
నగవద్దా యిఁకనీవు నలినాక్షి
మగువలమున్నారము మంకుమీయలుకదీర్చ
జిగినీవు చేసినదే చేఁత యిఁకనమ్మా

చ. 2: రమణుఁడు చెయి వట్టె రాజసము నీకుఁ దగు
చెమరించ నీకువద్దా చిగురుఁబోఁడి
అమరించఁగలము నీయంకెకు నన్నిపనులు
విమలము నీపగటు విచ్చనవిడెమ్మా

చ. 3: శ్రీవేంకటేశుఁడు గూడె చెలివలమేల్మంగవు
నీ వాతని మెచ్చవద్దా నీలవేణి
చేపదేరె మాకొలువు సేవలిట్టే సేసేము
కైవసమాయ రతులు కళదేరవమ్మా

రేకు: 0214-5 మెంచభౌళి సంపుటం: 08-083

పల్లవి: ఎంతవానికెంతవట యేలే యింత
మంతనాన నుండియును మాకుదీరదా

చ. 1: కొప్పు దువ్వితేఁ బతిపైఁ గోపగించుకొనేవేమే
తప్పులేని తప్పుమోపి తమకింతురా
విప్పుచుఁ బ్రియము చెప్పి వేఁడుకొనీ నాతఁడే
దప్పిదేరె మోవిచూచి దయ పుట్టదా

చ. 2: ధీరతతోఁ జెక్కు నొక్కితేను విదిలించేవేమే
దూరులేని దూరుగట్టి దొమ్మిసేసేవు
సారపు నీసుద్దులెల్లా చవిసేసినాతఁడే
ఆరీతినాతనిఁ జూచి ఆయము గరఁగదా

చ. 3: చిప్పిలఁ గాఁగిలించితే జీరవారెననేవేమె
చొప్పులేని చొప్పులెత్తి సూడువట్టేవే
అప్పుఁడు శ్రీవేంకటేశుఁ డలమేల్మంగవు నీవు
చొప్పులుగాఁ బెంజెమట చూచి చింత వాయదా

రేకు: 0214-6 శ్రీరాగం సంపుటం: 08-084

పల్లవి: ఎత్తరే ఆరతులీపె కింతులాల
హత్తెను శ్రీవేంకటేశు కలమేలుమంగ

చ. 1: హరి పురముపై సొమ్ము అరతఁగట్టినతాళి
సరిలేని దేవుని సంసారఫలము
సిరులకుఁ బుట్టినిల్లు సింగారములవిత్తు
మెరుఁగుఁబోడి యలమేలుమంగ

చ. 2: పరమాత్మునికి నాత్మభావములో కీలుబొమ్మ
కెరలుచునితఁడు భోగించే మేడ
సరసపు సముద్రము సతమైన కొంగుపైఁడి
అరిదిసంపదలది యలమేలుమంగ

చ. 3: శ్రీవేంకటేశుని దేవి చిత్తజునిఁ గన్నతల్లి
యీ విభుఁని కాఁగిటిలో యేచిన కళ
బూవపు పెండ్లిమేలు పొందిన నిధానము
ఆవల నీవల నీపె యలమేలుమంగ

రేకు: 0215-1 వరాళి సంపుటం: 08-085

పల్లవి: అంతేసి యెరఁగలేము ఆడువారము
మంతనాన విన్నవించే మన్నించవయ్యా

చ. 1: నీతో నేమాటాడితే నిజము నిష్ఠూరము
నీతెరిఁగి మాటలెల్ల నీవాడవయ్యా
చేతి మీఁదనే వుండవి చేకొను నామొక్కులెల్లా
మాతలఁపు లీడేరించి మన్నించవయ్యా

చ. 2: సారె నీతో నవ్వితేనే సరసమే విరసము
నారీతి చూచి నీవే నవ్వవయ్యా
గారవపు నాగోళ్ళు నీగడ్డము పైనుండవి
మారుకొని వేఁడుకొనే మన్నించవయ్యా

చ. 3: చన్నుల నిన్నొత్తితేనే చలములే పలములు
వున్నతిఁ గాఁగిట నీవే వొత్తవయ్యా
అన్నిటా శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
మన్నించి కూడితివింకా మన్నించవయ్యా

రేకు: 0215-2 శ్రీరాగం సంపుటం: 08-086

పల్లవి: తలవంచు కొననేలే తరుణి నీకు
యెలమిఁదప్పకచూచీ నిదివో నీవిభుఁడు

చ. 1: తాలిమిగలచెలికి తలఁపెల్లా నీడేరు
జాలిఁబొరలకున్న చవియౌ మేలు
నాలి నెరపకుండితే నవ్వులు వేళమేవచ్చు
యీలీలనే వుండరాదా యిదివో నీవిభుఁడు

చ. 2: మాట వొడఁబడికైతే మనసులు గరఁగును
యీటుకుఁ బెనఁగితేను యిచ్చక మవును
కూటములు గలిగితే గుణములు చక్కనవును
యేఁటికి నూరకుందాన విదివో నీవిభుఁడు

చ. 3: తగవుల నడచితే తప్పదు సంతోషము
మొగమోట గలిగితే మోహముమించు
జిగి యలమేలుమంగ శ్రీవేంకటాద్రివిభుఁని
యెగసక్యాలకే కూడితితఁడే నీవిభుఁడు

రేకు: 0215-3 బౌళి సంపుటం: 08-087

పల్లవి: నీకుదొరకితేఁగన నీవుమానేవా
మైకొని నన్నిన్నిటాను మన్నించునితఁడు

చ. 1: సేసవెట్టిన పతిని చెప్పినట్టు సేయించుకో
దోసమా నీవేల దూరవచ్చేవే
యీసు రేఁచుక దొడ్డ హితవరివలెనే
పోసరించి నాకేల బుద్ధిచెప్పవే

చ. 2: చేతికి లోనైనవాని చెక్కు వేల మీఁటితేను
యేతులా నీకేల యెకసక్యాలు
కాతరించి నీవే దగ్గరిన చుట్టమువలె
ఆతుమై నీవేఁటికి నాయాలు తిద్దేవే

చ. 3: కూడిన శ్రీవేంకటేశు గోరనేను గీరితేను
ఆడికల నీవేల అడ్డమాడేవే
నీడనలమేల్మంగను నే నాకంటె నెక్కుడా
చూడఁజూడ నీవేల జోహరనేవు

రేకు: 0215-4 మాళవ శ్రీ సంపుటం: 08-088

పల్లవి: అప్పణిచ్చేనిదె నీకు ననుమానించకుమిఁక
చిప్పిల మోహించిన నీచేతిలోనిదానను

చ. 1: యెంతనవ్వినా మేలే యెరిఁగిన విభుఁడవు
చెంతనుండి మరియేమి సేసినా మేలే
యింతమాత్రమునకే యెగ్గులెంచ తప్పులెంచ
సంతోసాన నీకులోనై సమ్మతించేదానను

చ. 2: అలయించినా మేలే ఆయములెరుఁగుదువు
కొలువు యిట్టె సేయించుకొన్నా మేలే
మలసినమాత్రానకే మచ్చరించ నెచ్చరించ
చెలఁగుదు నీపాదాల సేవసేసేదానను

చ. 3: చేరి కూడితివి మేలే శ్రీవేంకటేశుఁడవు
యీరీతినలమేల్ మంగనేమన్నా మేలే
సారె యీమాత్రానకే జంకించ బొంకించ
మేరతోనుండుదు నిన్ను మెచ్చేటిదానను

రేకు: 0215-5 సాళంగనాట సంపుటం: 08-089

పల్లవి: అన్నిటా నేరుపరిగా అలమేలుమంగ నీకు
చిన్నిచిన్ని ముద్దులనే సిగ్గువిడిపించెను

చ. 1: చనవు మెరసి నిన్ను సారెసారెఁ బేరుకొని
మనసు దనియ నాపె మాటలాడెను
కనుసన్నచూపులనె కప్పురవిడెములిచ్చి
తనువు దనియ నీపైఁ దలఁబాలు వోసెను

చ. 2: పన్నుగడలతోడనే పానుపుచేరువనే
కన్నులుదనియఁగ దగ్గరి నిల్చెను
మన్ననలు దైవార మచ్చికలు పెడరేఁచి
విన్నవీనులు దనియ విన్నపాలు సేసెను

చ. 3: మాఁగిన మోవియిచ్చి మనసు గరఁచి యిట్టే
కాఁగిలి దనియ నీకుఁ గప్పెఁ బయ్యద
వీఁగక శ్రీవేంకటేశ వెలఁదిఁ గూడితివిట్టె
రాఁగా వయసుదనియ రతికేలిసేసెను

రేకు: 0215-6 శుద్ధవసంతం సంపుటం: 08-090

పల్లవి: అలమేలుమంగ యీకె ఆనుకవద్దనుండది
చెలరేఁగి కందువలు చిత్తగించవయ్యా

చ. 1: తరుణిదేహమే నీకు తగుదివ్యరథము
గరుడధ్వజంబాపె కప్పుపయ్యద
తురగములు రతులఁ దోలెడు కోరికెలు
సరినెక్కి వలపులు జయించవయ్యా

చ. 2: దిండు కలపిఋఁదులు తేరు బండికండ్లు
అండనే పవ్వులుగుత్తులా పెచన్నులు
కొండవంటి శృంగారము కోపునఁగల సొబగు
నిండుకొని దిక్కులెల్లా నీవేగెలువవయ్యా

చ. 3: వెలఁదికంఠము నీకు విజయశంఖమదిగో
నిలువెల్ల సాధనాలు నీకునాపె
యెలమి శ్రీవేంకటేశ యిద్దరునుఁ గూడితిరి
పలుజయముల నిట్టే పరగవయ్యా

రేకు: 0216-1 గౌళ సంపుటం: 08-091

పల్లవి: ఏమిచూచేవు మాదిక్కు యివియేమేలు
నీమనసే యెరుఁగును నీవు సేసేమేలు

చ. 1: మాటకుమాటాడఁబోతే మరియెన్నైనాఁ గలవు
మోటుపెట్టి నేము నీకు మొక్కేదే మేలు
పాటించి సతులకెల్లా పైఁడికొంగువరచిన
మేటివి నిన్నెందుకైనా మెచ్చేదే మేలు

చ. 2: చేతకుఁజేత సేసితేఁ జిక్కులెన్నైనాఁ గలవు
నాఁతినింతే నిలుచుండి నవ్వేదేమేలు
కాఁతాళించి చెలులకే గద్దెవెట్టితివురము
పూఁతవలపులనిన్నుఁ బొగడేదే మేలు

చ. 3: సేసకును సేసచల్లఁ జేయికిఁ జేయి గలదు
పోసరించి నీకాఁగిటఁ బొందేదే మేలు
ఆల శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
మోసపోక కూడితిమి మోహములే మేలు

రేకు: 0216-2 వరాళి సంపుటం: 08-092

పల్లవి: ఎన్నఁడూనెరఁగమయ్య యిటువంటి పనులు
నిన్నుఁనాపెఁ గంటిమయ్య నేరుపులపొగుల

చ. 1: నిన్నుఁజూచి వడదేరీ నెలఁత అల్లంతనుండి
కన్నులనే వలపులు కాచుకున్నవో
పన్నిన సిగ్గులువీడఁ బయ్యద జారఁగఁదోసె
చన్నులనే జవ్వనము సాదించీనో

చ. 2: ఘాతలనె చెనకీని కాంత నీమోము చూచి
చేతులనె తమకము చిమ్మిరేఁగీనో
కాతరాన నీగుణాలు కడుఁగడుఁ గొసరీని
దూతికెవలెనే మాట దొమ్మిసేసీనో

చ. 3: అక్కుపైనిలిచి కూడె నలమేలుమంగ నిన్ను
చక్కఁదనమెల్ల నీకు సంచమాయనో
గక్కన శ్రీవేంకటేశ కాయముఁ గాయమునంటె
పెక్కువ సింగారాలు పెనఁబెట్టెనో

రేకు: 0216-3 దేసాళం సంపుటం: 08-093

పల్లవి: అన్నేసి నాకునాకే ఆడుకోరాదు
యెన్నుకొమ్మీ నామాటలితవైనయపుడు

చ. 1: అలుకలు దీర్చితివి ఆయములంటితివి
చెలఁగి నీచెప్పినట్టు సేసేమయ్య
చెలపట్టేవేళగాదు సరిదాఁకీనిటమీఁద
తలఁచుకో నామాఁట తతి వచ్చినపుడు

చ. 2: చేయి మీఁదవేసితివి సిగ్గులెల్లాఁ బాసితివి
ఆయనాయ నీకునడ్డమాడనయ్య
రాయడించే చోటుగాదు రతికెక్కినపుడైనా
చాయకుఁ దెచ్చుకో మాట చవులై నయపుడు

చ. 3: కన్నులనే నవ్వితివి కాఁగిటఁ గూడితివి
మిన్నకైనా నిన్ను సారె మెచ్చేనయ్య
అన్నిటా శ్రీవేంకటేశ అలమేల్‌మంగను నేను
వన్నెకుఁ దెచ్చుకో మాట వహికెక్కినపుడు

రేకు: 0216-4 సామంతం సంపుటం: 08-094

పల్లవి: అప్పటనుంటియుఁ జెప్పేవాసుద్దులు
అప్పుడే అన్నియువింటినాసుద్దులు

చ. 1: అంగడికెల్లానెక్కెను ఆసుద్దులు
అంగనలందరు విన్నారాసుద్దులు
అంగమా నాకాడుకోను ఆసుద్దులు నీకు
నంగదలన్నియుఁ బాపనాసుద్దులు

చ. 2: ఆరితేరెనింతలోనే ఆసుద్దులు
ఆరచి కతలవంటివాసుద్దులు
ఆరఁగాఁ బండినపంటలాసుద్దులు
ఆరీతినే యియ్యకొంటినాసుద్దులు

చ. 3: అలుకలిన్నియుఁబాపె నాసుద్దులు
అలయని రతులలో నాసుద్దులు
అలమేల్మంగను నేను ఆసుద్దులు
అలమితి శ్రీవేంకటేశాసుద్దులు

రేకు: 0216-5 భైరవి సంపుటం: 08-095

పల్లవి: ఆతనివగలెరఁగరమ్మలాల
చేతులువట్టి బలిమిసేయకురే మీరు

చ. 1: నిద్దిరించేనంటాను నెలఁతలరాకలకు
వొద్దికెఁగాచుక వున్నాఁ డూరకే తాను
వొద్దికి రమ్మనీనంటా వొడివట్టి తియ్యకురే
యిద్దరు చెలులున్నారు యెక్కుడా నేను

చ. 2: మోనాననుండేనంటా మచ్చుటతోఁజెలులకు
ఆనుక పొంచుక వున్నాఁడక్కడఁదాను
ఆనవెట్టినాతఁడంగానందరుఁబిలువకురే
లోననున్నవారికంటె గుట్లునేరుతునా

చ. 3: చేసన్న సేసేనంటా సేమంతి బంతిని నన్ను
వేసె శ్రీవేంకటాద్రి గోవిందుఁడే తాను
సేసవెట్టి కూడినాఁడు చెరఁగు వట్టించకురే
బాసగొన్నవారికంటె బలువా నేను

రేకు: 0216-6 ముఖారి సంపుటం: 08-096

పల్లవి: పువ్వుల వేసినవారిఁ బూఁపల వేతురటవే
నివ్వటిల్ల మీలోమాట నీవేయెఱఁగవా

చ. 1: చేసన్న సేసినందుకు సెలవియ్యవలెఁగాక
మాసటీనివలె మారుమలయనేలె
ఆసపడ్డవేళ నీవు అంగీకరించకవుంటే
దోసమందురదినీవు తొల్లేయెఱఁగవా

చ. 2: చెంతఁ గూచుండినందుకు సేసవెట్టవలెఁగాక
పంతగత్తెవలె మారుపలుకకువే
మంతనమైనవేళ మరఁగులు వెట్టితేను
జంతందురు లోకులజాడ నీవెఱఁగవా

చ. 3: ఇట్టెకూడినందుకును యిచ్చగించవలెఁగాక
జట్టిబేరగానివలె సటలేఁటికే
గుట్టుతో శ్రీవేంకటేశుఁ గూడియుఁ గొరితేను
దిట్టతనమందురు యీతెరఁగులెఱఁగవా

రేకు: 0217-1 సామంతం సంపుటం: 08-097

పల్లవి: వెన్న చేఁతబట్టుకొని వేఁడనేలే నేతికి
కన్నుచూపుల నతని గంపఁగమ్మనేరవా

చ. 1: చేరి చేయిచేఁత బట్టి సిగ్గున బాసడిగేవు
పోరచి నీవిభుఁడెందు వోయీనే యింక
సారెకు నీపయ్యదలో చన్నులు దాఁచినట్టు
తారసిల్లి రమణుని దాఁచనేరవా

చ. 2: వొంటిఁ జిక్కించుక నీవు వొట్టు వెట్టుకొమ్మనేవు
దంటయై వేరొకతెను తగిలీనట్టే
గంటువేసి పోఁకముడి గట్టిగాఁ గట్టినయట్టు
వొంటిగాకుండా నాతని వొడిఁగట్టనేరవా

చ. 3: మొక్కలానఁ గాఁగిలించి మోవిముద్రలు వెట్టేవు
వెక్కసా శ్రీవేంకటగోవిందుఁడు నీకు
వొక్కమాటే కంఠహారమురమునఁ గట్టినట్టు
చక్కని నీమేనితోడ జంటసేయ నేరవా

రేకు: 0217-2 సాళంగనాట సంపుటం: 08-098

పల్లవి: ఇద్దర సరిగెలువ నింతలోనే జూజమా
వొద్దికై వొకరొకరు వూరకుంట గాక

చ. 1: సలిగెమాటాడితేను సాదించేవారు గలరా
వొలుగులు వారఁగ నవ్వుదురుగాక
చెలిపంతమేమాడినా చెల్లించఁగవలదా
బలిమి నీవింతలోనే పచారించవలెనా

చ. 2: కొంగువట్టి తీసితేను కోపగింతురాయేమి
అంగవించి అందుకు లోనౌదురుగాక
అంగనల చేఁతలకు అంగీకరించవలదా
సంగతితో నీరాజసము చూపవలెనా

చ. 3: అక్కున నిన్నదిమితే నప్పుడ జంకింతురా
చెక్కు నొక్కి కరఁగి మెచ్చింతురుగాక
యెక్కువ శ్రీవేంకటేశ ఈపె నిన్నుఁ గూడెనిట్టె
పిక్కటిల్లు నీనేర్పులఁ బెనఁగఁగవలెనా

రేకు: 0217-3 లలిత సంపుటం: 08-099

పల్లవి: అన్నియుఁ దెలుకొందమాతఁడే వద్దనున్నాఁడు
మన్నన గనుకొందము మరవకురే

చ. 1: మనసువచ్చినవారి మాటలే చవులుగాక
యెనయనివారితోడ నేఁటిసుద్దులు
చనవు దానిచ్చితేను సాదించ నేనేరనా
పనిగలయందాఁకాఁ బదరకురే

చ. 2: జోడుగూడినట్టి వారి చూపులే యింపులుగాక
యీడుగానివారికొసరెంతై నానేమే
వాడికగలయప్పుడు వంచు కొననేరనా
జాడకు వచ్చినదాఁకా చలమేఁటికే

చ. 3: రతిఁ గూడినట్టివారిరచనలే మెచ్చుగాక
కతలు చెప్పేటివారి గతులేఁటివే
యితవై శ్రీవేంకటేశుఁడింతలోనే నన్నుఁ గూడె
తతివచ్చెనిఁకమీఁద తలవంచనేఁటికే

రేకు: 0217-4 శంకరాభరణం సంపుటం: 08-100

పల్లవి: నేరుచుకోవేనీవు నిక్కము దంటతనము
ఆరితేరితే నిన్నునటు రట్టుసేయఁడా

చ. 1: చెక్కుచేతితోడనింకా సిగ్గుపడేవు పతితో
మక్కువనేకతవేళ మరఁగేఁటికే
పక్కనఁ గన్నెవుగాఁగా పాలార్చీఁ గాకతఁడు
వెక్కసపు బ్రోడవైతే వెల్లవిరి సేయఁగా

చ. 2: నాలిసేసి పానుపుపై నవ్వులు నవ్వేవు ఈనవు
కోలుముందైనమీఁదఁ గొంకనేఁటికే
పోలించి ముగ్ధవుగాఁగా పొదిగీఁగాకాతఁడు
అలరి గద్దరివైతే నాయాలు సోఁకించఁడా

చ. 3: పొంచినట్టి రతివేళ బొమ్మల జంకించేవు
మంచమెక్కి వావులింకా మానవేఁటికే
అంచెనురమెక్కించెఁగా కలమేలుమంగవని
నించి శ్రీవేంకటేశుఁడు నీకంటె మించఁడా

రేకు: 0217-5 ముఖారి సంపుటం: 08-101

పల్లవి: వీఁపుగానరాఁగా దాఁగే విధమేఁటికే
తోపునకుడిందునేది దొరసానివిపుడు

చ. 1: నీరాక గోరుకొని నిలుచున్నాఁ డితఁడు
యీరీతినే వద్దనుంటే నేల లోఁగేవే
పేరే నా వరుస గాక పెనఁగేటినారతులలో
దూరల్లా నీదేకాదా దొరసానివిపుడు

చ. 2: మాటలు నీవాడేవంటా మలసు కొన్నాఁడతఁడు
యేఁటికే నన్నుఁజూచి యేల లోఁగేవే
కూటమే నాదిగాక గురుతులు సోకించేటి
తూఁటరివి నీవుగావా దొరసానివిపుడు

చ. 3: సరినీవు చూచేవంటా సన్నలు సేసీ నతఁడు
యిరవై నేఁ దిట్టేనంటా నేల లోఁగేవే
అరిది శ్రీవేంకటేశుఁ డలమేలుమంగ నేను
తొరలఁ గూడితిమిదే దొరసానివిపుడు

రేకు: 0217-6 పాడి సంపుటం: 08-102

పల్లవి: ఏమని వూరడించేవో యిఁక నీచిత్తముకొద్ది
దామెన తిట్లతోడ తలవంచీనదివో

చ. 1: చెలి నినుఁ జేరవచ్చి చేతులెత్తి మొక్కఁగా
చెలరేఁగి చన్నులపైఁ జేయి చాఁచేవు
వెలఁదితో నవ్వులకు వేళావేళలు లేవా
సెలవుల నవ్వులనె సిగ్గుపడీనదివో

చ. 2: అంగన బాగాలిచ్చి ఆకు మడిచీయఁగానా
యెంగిలి సేసేవు మోవి యిందరిలోన
గుంగిలి సరసాలకు కొంతైనా మరఁగువద్దా
సంగతి గాదని నీతో సన్నసేసీనదివో

చ. 3: వువిద పైపై నీకు వూడిగాలు సేయఁగానా
జవళిఁ బాదాలు చాఁచి సారె పంచేవు
కవగూడితివి శ్రీవేంకటేశ తగవే కదా
పవళించి యింకా నీతో పంతమాడీనదివో

రేకు: 0218-1 దేవగాంధారి సంపుటం: 08-103

పల్లవి: బాపు బాపు యిఁకనాకుఁ బరిణామము
ఆపనులెల్లానావి అదియే నావలపు

చ. 1: మంతనాన నీవు నాపె మాటలాడఁగాఁ జూచి
చింతలెల్లఁ బాసి యేక చిత్తమాయను
వంతులకు నే నీకు వలతునాపెకు నీవు
అంతకంటె వలతువు అదియే నావలపు

చ. 2: చలివాసి యిద్దరును సరసమాడఁగఁ జూచి
బలిమి నాజన్మము సఫలమాయెను
అలరి నే నీకు లోను ఆపెకు నీవులోనై
అలవాటాయఁ గనక అదియే నావలపు

చ. 3: మంచముపై నిద్దర నెమ్మదినుండఁగాఁ జూచి
సంచమై నామేనెల్ల చల్లనాయను
యెంచఁగ శ్రీవేంకటేశ యిద్దరము నీసొమ్ము
అంచెలఁ గూడితిమిదె అదియే నావలపు

రేకు: 0218-2 భూపాళం సంపుటం: 08-104

పల్లవి: ఎగ్గుపట్ట నీకేలే యిందుకుఁగాను
దగ్గరి పైఁ జేయిచాఁచి తమకించరాదా

చ. 1: వెక్కసాలంతేసి వద్దు విభుఁడు పరాకైతే
యిక్కువలంటఁగరాదా యింకా నీవు
దిక్కులు చూచితేనేమి దేహము నీమీఁదనదే
చిక్కించుక సేయరాని సేఁత సేయరాదా

చ. 2: అలుకలంతేసి వద్దు ఆతఁడు కొలువైవుంటే
వలపు రేఁచఁగరాదా పన్నైతో నీవు
వెలి విసరిననేమి వెంటనే నీవుందానవు
చలమెల్ల సాదించి జట్టి గొనరాదా

చ. 3: యెగసక్కేలంతవద్దు యింతలోనే ఆతఁడుంటే
జిగిఁ గాఁగిలించరాదా చెలఁగి నీవు
అగపడి శ్రీవేంకటాధిపుఁడు గూడెనిట్టే
మిగులా నీవు రతుల మెప్పించరాదా

రేకు: 0218-3 బౌళి సంపుటం: 08-105

పల్లవి: ఇంకనేఁటివెరపు యిన్నియు మంచివే కాక
సంకెదీర బొమ్మలను సాదించేనా

చ. 1: వట్టిసిగ్గులు నీకేల వద్దనున్నది వనిత
యెట్టుసేసినా నిన్న దేఁటికనేనా
జట్టిగొన్న నీచేఁతకు సమ్మతింతునేకాక
కట్టఁగడవారివలెఁ గాకుసేసేనా

చ. 2: మూసి దాపిరములేల మోవినున్నవి కెంపులు
నీసుద్దులు వాఁడిసేసి నేరమెంచేనా
వేసినట్టేవేసి నీతో వేడుకపడుఁదుఁగాక
మాసటీలవలె నీతో మారుమలసేనా

చ. 3: సెలవుల నవ్వులేల చేతికి లోనాయఁ బని
అలరి కూడితివిఁకనడ్డమాడేనా
మలసి శ్రీవేంకటేశ మాలోనిదే ఆపెగాక
వెలుపటివారివలె వింత సేసేనా

రేకు: 0218-4 ఆహిరి సంపుటం: 08-106

పల్లవి: ఎంతకెంతసేసేవు యెమ్మెలీడను
పంతము చెల్లినమీఁద పాలార్చఁ దగదా

చ. 1: సిగ్గుపడి వున్నాపెను సెలవి నవ్వుదురా
దగ్గరి పైఁ జేయివేయఁదగుఁగాక
కగ్గుదేరీఁ గెమ్మోవి కాటుకకన్నుల మొక్కి
తగ్గక నీ చిత్తములో దయవుట్టదగదా

చ. 2: వనాపతి అయినాపను మన సోదింతురా
ఆనుకొని మెచ్చఁదగవౌఁగాక
నానెఁజెమటల మేను ననలొత్తెఁ బులకలు
తానకమై మతిలోన దయవుట్టదగదా

చ. 3: చేరి కాఁగలించినాపెఁ జిక్కించి కొసరుదురా
కోరికెలు మీరనిట్టె కూడుతగాక
మేరతో శ్రీవేంకటేశ మెలుఁత నిన్నునెనసీ
తారుకాణ నీరీతినే దయవుట్టఁదగదా

రేకు: 0218-5 మలహరి సంపుటం: 08-107

పల్లవి: నీవల్లనే కదవే నీమగఁడు రతికెక్కె
ఆవటించ నీకే కలవంతలేసి బుద్ధులు

చ. 1: హితవుగల సతికి యెరపరికము లేదు
పతిమాటే తనమాటై పరగుఁగాని
సతులెందరుండినాను చంచలము దోఁచదు
అతివరో నీకే కలవంతేసి బుద్ధులు

చ. 2: యిరవెరిఁగినకాంత యెడమాటలాడించదు
సరవి మాటాడుఁ బతిముకానను
పరులవాదుకుఁ బోదు భయములేదేమిటాను
అరయ నీకే కలవంతేసి బుద్ధులు

చ. 3: నేరుపుగల మగువ నెరుసులకుఁ జొరదు
మేరమీరి రతులనే మెప్పించును
యీరీతి శ్రీవేంకటేశునిట్టే నీవు గూడితివి
ఆరితేరి నీకే కలవంతేసి బుద్ధులు

రేకు: 0218-6 శ్రీరాగం సంపుటం: 08-108

పల్లవి: ఏనాఁటికేనాడు యేమనేవు
నీ నాటకములెల్ల నీకేతెలును

చ. 1: దగ్గరి నీగుణములు తలపోయుచుండఁగాను
కగ్గి నీతో నెరుపేటి గర్వమనేవు
సిగ్గుపడి యప్పటిని చెక్కు చేతనుండఁగాను
ఆగ్గలమై చింతించే అలుకలనేవు

చ. 2: పొదిగి నీచేఁతలెల్ల పొగడుతానుండఁగాను
వెదకి వెదకి యాడేవెంగమనేవు
నిదురకన్నులతోడ నిన్నుఁ గొంత చూడఁగాను
గుదిగుచ్చి కుమ్మరించే కోపమనేవు

చ. 3: కలిసి మెలసి నిన్నుఁ గాఁగిలించుకొనఁగాను
నెలి పెనఁగి బిగిసితిననేవు
బలిమి శ్రీవేంకటేశ పైకొని కూడితి నన్ను
మలసి మెచ్చితే నిన్ను మతకమనేవు

రేకు: 0219-1 మంగళకౌశిక సంపుటం: 08-109

పల్లవి: కందము విందము దన కతలెల్లాను
పందెమిదే జూజమిదే పలుమారు నేఁటికే

చ. 1: మగనిముందరనే మాటలాడి నాపెతోను
జగడా లడుతురా సారెసారెకు
తెగువలేమి గల్లాను తెరమరఁగునఁ గాక
మొగము నద్దమునిదే ముందటెత్తు లేఁటికే

చ. 2: ఆతఁడు చూడఁగానే ఆయాలంటి ఆపెమీఁద
చేతులు చాఁపుదురా చెలరేఁగి
నీతులేమి యెంచినాను నిన్నమొన్ననేకాక
జీతమిదే కొలువిదే సిగ్గులిఁక నేఁటికే

చ. 3: శ్రీవేంకటేశుఁ బొత్తుల సేసవెట్టే ఆపెను
కావరించి జంకింతురా కనుసన్నల
యీవేళ నన్నుఁగూడె యీతఁడే నానాయకుఁడు
భావమిదే కాయమిదే పలుచేఁత లేఁటికే

రేకు: 0219-2 లలిత సంపుటం: 08-110

పల్లవి: నీకు నవ్వులు రావటే నెలఁతల దిక్కుచూచి
దాకొని యింతట మమ్ము దయఁజూడరాదా

చ. 1: నిండు రాజసముతోడ నీవాతని వద్దనుండి
యెండకన్ను నీడకన్ను నెరిఁగేవటే
వెండియు పతిఁబాసిన విరహపు సతులకు
దుండగపు తలపోఁత దొమ్మిసేసుఁగాక

చ. 2: మదనరాగముతోడ మగనికాఁగిటనుండి
యెదిటివారినినిన్ను నెరిఁగేవటే
అదనుగాచుక రతికాసపడే యింతులకు
చదురపు తమకము చండిసేసుఁగాక

చ. 3: శ్రీవేంకటేశ్వరుని చేతికి లోను సేసుక
మావంటివారి నీవు మరచేవటే
యీవేళనే మమ్మునిద్దరు మన్నించితిరి
కైవసపుమదములు కాణాచులౌఁగాక

రేకు: 0219-3 దేశా(సా)క్షి సంపుటం: 08-111

పల్లవి: ఉపకారమింతేకాని వొరటుగాదు
కపటాలుమాని సతిఁగాఁగిలించవయ్యా

చ. 1: మంకుగాదు చెలియ నీమనసు చూచేనంటా
వుంకువ సిగ్గులతోడ నూరకున్నది
సంకెగాదు నిన్నుఁ దనచన్నులు నాటించితేను
అంకెఁ గుమ్మెలయ్యీనంటా నట్టె మూసెఁ బయ్యద

చ. 2: తిట్టుగాదు నీగుణము తెలుసుకొనవలసి
బెట్టిమాటలనిన్నుఁ బెదవులను
అట్టుసేయదాపె నిన్నాఁబడిఁ బెనఁగకున్న
దిట్టతనము నేరక దిగేవంటాను

చ. 3: గబ్బితనములుగాదు కాఁగిలించి పట్టినిన్ను
తబ్బిబ్బుగాకుండ రతిఁదనిపేనంటా
అబ్బురపు శ్రీవేంకటాధిప నిన్నుఁగలసె
జొబ్బిలఁ బ్రేమము నీకుఁ జూపేనంటాను

రేకు: 0219-4 నారణి సంపుటం: 08-112

పల్లవి: ఏలగడించుకొనేవు యెక్కడాలేనిసుద్దులు
తాలిమిఁ బానుపుచేరి తమకించరాదా

చ. 1: జంకెనచూపులచేత చలివాపెఁ గాకయింతి
కొంకుఁగొసరుల నిన్నుఁగోపగించునా
వంకల చంద్రుల నించి వాఁడివెట్టెఁగాకనీకు
కంకిగా రతులలో ఘాతసేసునా

చ. 2: నిట్టూర్పు గాలిచేత నిన్ను సేదదేర్చెఁగాక
జట్టిగొని వుంకించి కొసరవచ్చునా
బట్టబయలు మాటలపందిలిగాఁ బెట్టెగాక
నెట్టుకొన్న తిట్లతో నేరమెంచునా

చ. 3: చిగురుఁజేతులచేత జిగిఁగాఁగిలించెఁగాక
వొగరుఁబంతాల నిన్ను వొరయించునా
అగపడి శ్రీవేంకటాధిప కూడితివిట్టే
మొగమోడెఁగాక నీకుమోవిగంటిసేసునా

రేకు: 0219-5 ధన్నాశి సంపుటం: 08-113

పల్లవి: నేనేల కాఁగిలించేను నెలఁతనెవ్వతెనైనా
కానుకలాయమోహము కడుమెచ్చవలదా

చ. 1: మచ్చరములెల్ల మానె మనసొక్కటాయ నాకు
లచ్చనలు నీమోవిపై లలినుండఁగా
చొచ్చి యధరామృతము సొమ్ము పదిలముగాను
పచ్చిముద్రలు వెట్టె నీపని మెచ్చవలదా

చ. 2: చింతలిన్నియునుఁ బాసె సెలవుల నవ్వువచ్చె
పొంతనుండి నీలోనే బుసకొట్టఁగా
దొంతినున్న వలపులు తూరుపెత్తేవేళలకు
అంతలో పొలివారించె నది మెచ్చవలదా

చ. 3: చేతికి లోనాయ రతి సేస పిడికిటనిండె
నీతల నన్ను శ్రీవేంకటేశ కూడఁగా
జాతితో నిద్దరమును చద్దికి వేఁడికిఁగాను
యేతులఁ దోడు గడించె నిది మెచ్చవలదా

రేకు: 0219-6 సాళంగనాట సంపుటం: 08-114

పల్లవి: ఇందరితో నేకతాలు యెందాఁకాను
మందలించి ఆతనికే మచ్చికలుచూపవే

చ. 1: మోహమే నిజమైతే ముచ్చటలు నిజమే
సాహసము నిజమైతే జయమూ నిజమే
వూహ పోహలు సారె వువిదతో నేలే
కూహకములేల పతికొంగు వట్టి తియ్యవే

చ. 2: నయములు గలితేను ననుపులుఁగలవే
ప్రియములు గలిగితే పిలుపులుఁ గలవే
దయపుట్టఁ జెప్పియంపే తగువిన్నపములేలే
నియతి నాతని నీలోనికిఁ దియ్యరాదా

చ. 3: చనవులు దొరకితే సంతసాలు దొరకును
చెనకులు దొరకితే సిగ్గులు దొరకును
యెనసెను శ్రీవేంకటేశుఁడు నిన్నింతలోనే
చనుమొనలనొత్తి బాసలు గొనరాదా

రేకు: 0220-1 శంకరాభరణం సంపుటం: 08-115

పల్లవి: ఏల పెనఁగేవునాతో నిట్టె విన్నవించుమని
వేళలెరఁగక నీతో వివరించఁగాని

చ. 1: ఆయాలు సోఁకిన మాటలవియే యితవుగాక
చాయపాట్లైనవెల్లా చవిపుట్టీనా
నీయడ కోపె నేరుచు నేనూఁగొంతనేరుతు
వేయైనా నీవడుగక వెల్లనాడఁగాని

చ. 2: సొలసి సొలసి చూచే చూపులే వేడుకగాక
అలవోకలవి యెల్లా నాసరేఁచీనా
అలరి నిన్నాపె చూచు నావెనుక నేనుఁజూతు
బలిమి దెలియక నేఁ బచరించఁగాని

చ. 3: గక్కనఁ గూడినయట్టి కలయికే మేలుగాక
తక్కక పెనఁగినవి తమినించీనా
యిక్కువ శ్రీవేంకటేశ యిద్దరము గూడితిమి
చెక్కులు నొక్కక నీపై చెయి చాఁచఁగాని

రేకు: 0220-2 రామక్రియ సంపుటం: 08-116

పల్లవి: మాకేమి బుద్ధి చెప్పేవు మాటి మాటికి
జోకలతో నీవాపెకు చుట్టమవే కావా

చ. 1: మక్కువ గలవాఁడవు మానిని వేఁడుకోరాదా
చెక్కుచేతితోడ లోనఁ జింతించీని
యెక్కువ తక్కువ మాటలిద్దరము నాడుకొంటే
చొక్కముగా నీవాపెకు చుట్టమవే కావా

చ. 2: నగవులవాఁడవు నవ్వించరాదా ఆపెను
వగ విరహానఁ దలవంచు కున్నది
యెగసక్యాలు మాలోనెటువలెనుండినాను
సొగసి నీవాపెకు చుట్టమవే కావా

చ. 3: అట్టె చెనకేవాఁడవాపె చెక్కు నొక్కరాదా
దట్టపు నీరతిఁగూడి దగ్గరున్నది
గుట్టున శ్రీవేంకటేశ కోరినన్నుఁ గూడితివి
చుట్టిచుట్టి తొల్లేపెకు చుట్టమవే కావా

రేకు: 0220-3 ముఖారి సంపుటం: 08-117

పల్లవి: అంతదాననా నేను ఆనవెట్టఁదగుదునా
వింతవలపులు నాపై వేసితివి చాలదా

చ. 1: వద్దనుండి మొక్కించేవు వనితలచే మొక్కులు
బద్దులు నీవి చాలవా పలుమారును
వొద్దికె నప్పటిఁగొన్ని వుపచారాలు వలెనా
తిద్దుబడి నోరుచుకో తిద్దితివి చాలదా

చ. 2: చెలులచే సారెసారె చేయివట్టి తీయించేవు
చలమునీది చాలదా సాదించను
మలసి మావల్లనీకు మందెమేళాలువలెనా
నిలువెల్లాఁ దరితీపే నించితివి చాలదా

చ. 3: అట్టె తెరవేయించేవు అండవారి చేతనెల్ల
రట్టులునివి చాలవా రాఁపుసేయను
దిట్టవై శ్రీవేంకటేశ తిరమై కలసితివి
మెట్టి పట్టుకొని నన్నుమించితివి చాలదా

రేకు: 0220-4 కాంబోది సంపుటం: 08-118

పల్లవి: కొంత వోరచుకోరాదా కోపగించేమా
బంతినున్న మాగోలు బారచాఁచీనా

చ. 1: పంతానకే పెనఁగేము పైపై నూరకే నిన్ను
చెంతనుండి యేమైనాఁ జేయవచ్చేమా
వంతులకే సొలసేము వారివీరివలె మరి
దొంతిఁబెట్టి వలపుల దొమ్మిసేసేమా

చ. 2: ఆలకే పిలిచేము అప్పటి నిన్నిందులోనే
బాసగొని నీకొంగు పట్టుకుండేమా
వాసులకే నవ్వేము వన్నెల నీమేనుచూచి
వేసాలంటా నిన్నునిట్టే వెంగమాడేమా

చ. 3: సిగ్గులకే లోఁగేము చిత్తడి చెమటలను
కగ్గువెట్టికొని నిన్నుఁ గాఁకరేఁచేమా
నిగ్గుల శ్రీవేంకటేశ నీవెనన్నుఁ గూడితివి
దగ్గరి వుండినదాన తడఁబడేనా

రేకు: 0220-5 నాదరామక్రియ సంపుటం: 08-119

పల్లవి: ఆతని భ్రమయించే (చవే?) వే అండనున్నాఁడు
యేతులునెమ్మెలుఁ జూపేవిప్పుడే మాతోనా

చ. 1: చన్నులు ఘనములైతే సాధించవే రమణుని
కన్నులు ఘనములైతే కాఁడి పారఁ జూడవే
యెన్న నీసింగారాలు యెవ్వరికిఁ జూపేవు
పన్నిన సవతినింతే పగటు మాతోనా

చ. 2: వలపు చిత్తాననుంటే వంచుకోవే నీవిభుఁని
పలుకుల నేర్పులుంటేఁ బచరించవే
సొలపుల నీనటన చూచేవారిందెవ్వరే
చెలిమికత్తెలమింతే చేఁతలు మాతోనా

చ. 3: సిగ్గులు సెలవినుంటే శ్రీవేంకటేశు ముంచవే
నిగ్గులు చెక్కులనుంటే నీటు చూపవే
యెగ్గులేక ఆతఁడే యిద్దరినేలెను నేఁడు
వెగ్గళించి మురిసేటి వింతలు మాతోనా

రేకు: 0220-6 సామంతం సంపుటం: 08-120

పల్లవి: ఇంకా నీచిత్తము యేమనే నిన్ను
అంకెకు రావు సిగ్గులు ఆఱడాయ వలపు

చ. 1: చలము సాదించరాదు చనువు మెరయరాదు
పలిచి చన్నులంటేవు ప్రియముతోడ
కలకల నవ్వేవు కప్పురము చల్లేవు
చలివాయవు సిగ్గులు చండిపడె వలపు

చ. 2: పేరుకొని దూరరాదు పెనఁగి మొక్కఁగరాదు
నారువోసేవు నామీఁద నయగారాలు
మేరమీరి చెనకేవు మెచ్చి విడెమిచ్చేవు
తీరవెంతైనా సిగ్గులు దిమ్మురేఁగె వలపు

చ. 3: గక్కన జంకించరాదు కాయము మరవరాదు
యెక్కువ శ్రీవేంకటేశ యిట్టె కూడితి
దక్కి నాకు లోఁగేవు తనువెల్ల నిమిరేవు
తక్కువగావు సిగ్గులు తతిగొనె వలపు

రేకు: 0221-1 ?? సంపుటం: 08-121

పల్లవి: నిన్నటినుండిఁ జూచేను నీసరితలు
యెన్నికె కెక్కేదెట్లో యిందరిలో నేను

చ. 1: చెంతలఁ జేరినవారిని చెక్కులు నొక్కేవు
అంతనింతానుండ వారినాదరించేవు
దొంతులు వెరిగి గొల్లదోమటాయ వలపు
యెంతటి దాననయ్యేనో యిందరిలో నేను

చ. 2: మాటలాడినవారిని మనసులు గరఁచేవు
సూటిఁ జూచినవారినిఁ జొక్కించేవు
వాటమై వరత వచ్చె వనితల కోరికలు
యీటు వెట్టుకొన నేను యెవ్వరిఁ బోలుదును

చ. 3: కూడిన కాఁగిటివారి కొప్పులు దువ్వేవు
మేడెపు రతులవారి మెప్పించేవు
వాడుదేరె జవ్వనాలు వంతుల శ్రీవేంకటేశ
యీడ నన్నుఁ గూడితివి యెంతభాగ్యమోనాది

రేకు: 0221-2 మధ్యమావతి సంపుటం: 08-122

పల్లవి: ఇంకనేఁటి విచారాలు యెందాఁకారా
లంకెపాటు తమకాలు లావుసేసెఁ గదరా

చ. 1: పట్టరాదు నీవయసు పాయరాదు నీపొందు
యెట్టననరాదు నిన్ను నేమి సేతురా
గుట్టువేఁచె మదనుఁడు గుమిగట్టెఁ గోరికలు
అట్టయితి నీచేఁతలాఁడికెక్కెఁ గదరా

చ. 2: చెప్పరాదు నీమనసు చించరాదు నీవలపు
యెప్పుడ నేనొక్కజోడె యేమిసేతురా
చొప్పులెత్తె పువ్వుటమ్ము సోలినిండెఁ బులకలు
దప్పిగొంటి నీసుద్దుల తతి వచ్చెఁగదరా

చ. 3: తుంచరాదు నీమదము దొబ్బరావు దినములు
యించుకంతె నాసిగ్గు యేమిసేతురా
కొంచక శ్రీవేంకటేశ కూడితివి నన్నునిట్టె
పంచల నీమన్ననలు పాటమాయఁ గదరా

రేకు: 0221-3 పాడి సంపుటం: 08-123

పల్లవి: లేలే యెక్కడిసుద్ది లేమమాట వినవయ్య
నాలితో రుక్మిణిఁ దెచ్చేనాఁడు లేదా నీకు

చ. 1: చెలి నిన్నుఁ బిలువఁగ చెయివట్టి తియ్యఁగాను
సెలవి నవ్వులతోడ సిగ్గువడేవు
కొలఁదిమీరనీబుద్ది కొలనిలో గొల్లెతల
నలుగడఁ బైకొనేటినాఁడు లేదా నీకు

చ. 2: పడతి మోవియ్యఁగాను బలిమి గోరనంటఁగ
అడరి తప్పించుకొనేవప్పటి నీవు
కడఁగి పదారువేలు కాఁగలించుకొనఁగాను
నడుమనే యీబుద్ది నాఁడు లేదా నీకు

చ. 3: కొమ్మ నినుఁ గూడఁగాను కుచముల నొత్తఁగాను
దొమ్మి శ్రీవేంకటేశ యిందు నలసేవు
యెమ్మెల భూఁవియు సిరి యిరువంకఁ బెండ్లాడఁగ
నమ్మికతో యీబుద్ది నాఁడు లేదా నీకు

రేకు: 0221-4 వరాళి సంపుటం: 08-124

పల్లవి: ఇందవయ్య వీడెమిఁక నెరవులేవి
సందులేని కూరిమికి జగడములేవి

చ. 1: చిత్తములేకములైతే సిగ్గులెందు వెదకేది
కొత్తవలపులై తేను కొంకఁ జోటేది
పొత్తుల భోగములైతే పొద్దులు దెలియనేది
అత్తిన సంసారఫలమయి వుండుఁగాక

చ. 2: వాడికెలు గలిగితే వంచన సోదించనేది
వేడుకలు మించితేను వెలువలేవి
ఆడుకోలు మాటలకు నవుగాములు మరియేవి
యీడనే జన్మఫలము లీడేరుఁ గాక

చ. 3: కూటములు గలిగితే గురుతులు వెట్టనేది
వాటపు నవ్వులకున వరుసేది
మేటి శ్రీవేంకటేశుఁడ మించి నన్నుఁ గూడితివి
పాటించి జవ్వన భాగ్యఫలమంటుఁ గాక

రేకు: 0221-5 శుద్ధవసంతం సంపుటం: 08-125

పల్లవి: ఇద్దరుఁ గదిసి కొంకనిఁక నేఁటికే
చద్దివేఁడి సరసాలు సరిచూడరాదా

చ. 1: కదలించేవపునవునే గక్కున విభుఁనితోడ
పెదవిమరఁగుననె పెనుమాటలు
వుదుటుఁ దమకమున నోపిక కలిగితేను
యెదుటి మరుసామున కియ్యకొనరాదా

చ. 2: పన్ని వేసే వవునవునే పదరి యాతని మీఁద
కన్నురెప్ప మరఁగల కాముబాణాలు
సన్నల మీలోనింత చనవులు గలిగితే
నున్నతపు రతికేలి నొరయఁగ రాదా

చ. 3: నెట్టన నొత్తేవేమే నీవు శ్రీవేంకటేశ్వరు
పుట్టిన పయ్యదమాటు పూబంతుల
అట్టుగాఁ గూడితివి మీఱఁగ రాజసము మించి
తొట్టిన మదములను దొమ్మిసేయరాదా

రేకు: 0221-6 కన్నడగౌళ సంపుటం: 08-126

పల్లవి: దిట్టనా నేనంత యేమి దేవరవన్నిటా నీవు
యెట్టైనా నెగ్గులెంచక యీడేర్చుమీ

చ. 1: నయగారి మాటలెల్ల నమ్మితిఁ గనక యిట్టే
భయము విడిచినీతోఁ బలికే నేను
దయగలవు గనక తడఁబడక యేపొద్దు
ప్రియములు చెప్పి నిన్నుఁ బిలిచే నేను

చ. 2: ముంచిన నీచేఁతలకు మోహించిన దాననై
పొంచి వూడిగేలు సేసి పొలసే నేను
కంచముపొత్తువాఁడవు గనక నీపాదాలకు
వంచనలేక యేల వడిమొక్కే నేను

చ. 3: కూడిన వాఁడవు గాన కొంకక శ్రీవేంకటేశ
వేడుక నీతో నవ్వి వెలసే నేను
యీడు లేక మన్నించితి వియ్యకొంటి నన్నిటికి
పాడితో నీయిచ్చకానఁ బరగితి నేను

రేకు: 0222-1 కేదారగౌళ సంపుటం: 08-127

పల్లవి: ఏమి నేరుచు కొంటివింతేసి నీవు
కామిను లీసుద్దివింటే కాఁకనిన్ను రేఁచరా

చ. 1: కలసి మెలసి యిట్టే కాంత నిన్ను వేఁడుకోఁగా
అలసి వున్నాఁడనంటా నట్టె వీఁగేవు
వలచిన సతి గాఁగా వడిఁ గిందుపడెఁ గాక
పెలుచు వేరొక్కతయితే పెను అట్టుసేయదా

చ. 2: యిచ్చకములే సేసి యింతి నిన్నుఁ జెనకఁగా
కొచ్చకుమీ మేనంటా గుట్టు సేసేవు
నిచ్చ నీదేవులు గాఁగా నేరమెంచదాయఁ గాక
పచ్చిగా వేరొక్కతైతే బలిమెల్లాఁ జూపదా

చ. 3: కందువకు నిన్నుఁ బిలిచి కలికి నిన్నుఁ గూడఁగా
అందముగాఁ బరవశమైతివనేవు
యిందునె శ్రీవేంకటేశ యీకె నీవు గాఁగాఁ గాక
సందడి వేరొక్కతైతే చనవు మెరయదా

రేకు: 0222-2 ఛాయనాట సంపుటం: 08-128

పల్లవి: ఆఁడుజాతెల్లానొక్కటే అందరికి నొక్కచాలే
వాఁడి తనగోరే అయితే వద్దనేవారెవ్వరు

చ. 1: సిగ్గువడ్డ నిన్నుఁ జూచి చిత్తమెల్లా నీరాయ
అగ్గలమై నిన్ను నాడే యాపె మాటకు
కగ్గుదేర నీవు మున్ను కట్టుకొన్న బయిరూపము
వొగ్గి ఆడక పోవునా వోరుచుకో యిఁకను

చ. 2: తలవంచే నిన్నుఁ జూచి దైలువారె నాచెమట
చెలరేఁగి ఆపె నిన్నుఁ జేసేచేఁతకు
యెలమి నీవేడుకకు యెత్తుకొన్న యెత్తుకోలు
తెలిసిన వాఁడవిఁక దించవచ్చునా

చ. 3: తేలగిలే నిన్నుఁ జూచి తెలివొందె నామొగము
కోలుముందై ఆపె నిన్నుఁ గూడఁగాను
యీలీల శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
వేళకు వచ్చిన మేలు విడువఁగ వచ్చునా

రేకు: 0222-3 పాడి సంపుటం: 08-129

పల్లవి: రారే యింకానతని రవ్వసేతురా
ధీరుఁడైనవానినంత తెమలించవచ్చునా

చ. 1: నయగారి వానికిఁ గా నంటుతోడి సరసాలు
ప్రియునికిఁ గా మంచిప్రేమమెల్లాను
క్రియ గలవానికిఁ గా క్రిందిమీఁది విచారాలు
భయము లేనివానికి పట్టినదే పంతము

చ. 2: ఆసగలవానికిఁ గా అందరితో వినయాలు
బాసగల వానికిఁ గా పాలకూళ్ళు
వేసరని వానికిఁ గా విచ్చనవిడి నవ్వులు
దోసమొల్లవానికి తోఁచినదే హితవు

చ. 3: పనిగల వానికిఁ గా పైపై తమకములు
యెనసిన వానికిఁ గాను యేకాంతాలు
ఘన శ్రీవేంకటేశుఁడు గలసె నన్నింతలోనే
యెనలేక యీతనికి యెక్కినదే వయసు

రేకు: 0222-4 గౌళ సంపుటం: 08-130

పల్లవి: ఏలయ్యు యింతేసి మమ్ము యిటు రట్టుసేసేవు
తాలిమితోడుత నీదయలోనివారము

చ. 1: కనుఁగొన చపులనే కరఁగించితిననేవు
వినయాలు చెప్పనీకు వింతవారమా
పెనఁగి మోవితేనెల పిలిచి విందువేట్టేవు
వెనకా ముందరా నీకు వినయాలవారమా

చ. 2: సరుగ మంచముపై నాసలఁ గూచుండుమనేవు
సరుకు రాను నీసరివారమా
యెరవుసేయక మాతో నేకతములాడేవు
అరసి నీకు బుద్ధిచెప్పేయంతేసివారమా

చ. 3: కలసిన రతులెల్లా ఘనముగాఁ బొగడేవు
తొలుతనే నీకంటె దొడ్డవారమా
చెలఁగి శ్రీవేంకటేశ చేకొని కూడితివిట్టే
పొలసిన నీవంటి పోలికలవారమా

రేకు: 0222-5 సాళంగనాట సంపుటం: 08-131

పల్లవి: పొంచి యేమి సేసినాను పుచ్చకాయలోర్చుఁ గాక
యెంచి వేలఁజూపితేను యితరములోర్చునా

చ. 1: కన్నుల నొకతె నిన్ను కాఁతాళించి తిట్టితేను
వెన్నెలరేకు నవ్వులు వెదచల్లేవు
నిన్నువంటిచేతలు నేఁడు పకు నున్నవా
వెన్నదీసినట్టి చల్ల వేఁడనెట్టివారము (?)

చ. 2: పొలసి సిగ్గునవాపె బొమ్మల నదలించితే
చెలరేఁగి చెలరేఁగి చెక్కునొక్కేవు
తలఁపులో నీవలె తాలిమి మాకున్నదా
వొలిసి యీలకూరకు నుప్పడిగేవారము

చ. 3: కడు వాఁడికుచములఁ గాఁగిలించి వొత్తితేను
జడియక ఆపెకిట్టే సంతసించేవు
కడఁగి శ్రీవేంకటేశ కలసితివిఁకనేము
వడియని మోవితేనె వారవట్టువారము

రేకు: 0222-6 ముఖారి సంపుటం: 08-132

పల్లవి: అడుగరే చెలులాల అంతేసి నేనెరఁగ
బడివాయఁడాసలకో పంతాలకునో

చ. 1: నగవొక్కటేకాని ననిచి రెంటికి వచ్చు
జగడానకో లోలో సరసానకో
తగినట్టి బలుదొర తానేల మొక్కీనే
యెగసక్యాలకో మరి యింపులకునో

చ. 2: పిలుపొకటేకాని పెనఁగ రెంటికి వచ్చు
వలపులకో వట్టి వారకానకో
వెలలేని నేరుపరి వేఁడుకొననింత యాలే
తలఁపు దెలుసుకోనో దంటతనమో

చ. 3: కూడినదొక్కటే కాని గురుతు రెంటికి వచ్చు
వేడుకలకో రతివేసాలకో
యీడనే శ్రీవేంకటేశుఁ డిన్నిటా నన్నునేలె
వాడికలకో నిండువహి కెక్కనో

రేకు: 0223-1 భైరవి సంపుటం: 08-133

పల్లవి: వలపుపచారాల వనితలము
పులుగులిగెత్తఁగాను (?) వోపదువా నీవు

చ. 1: నగవులే తెలుపులు నవ్వులలో సుద్దులయితే
పగటు మీరఁగనట్టే పంచవన్నెలు
చిగురుటధరమున చిందఁజొచ్చె నింతలోనే
వొగరువేసునో యేమో వోపుదువా నీవు

చ. 2: మాటలే తేనెలు మాటలలో తేటలయితే
గాటమైన మిరియాలకంటెఁ గారాలు
వాటమై నాలికమీఁద వడిగొని వచ్చీనవి
వూటలైన యీ యెంగిలికోపుదువా నీవు

చ. 3: కలయికలే చల్లన కలయికలలోపల
వెలలేని రతులెల్లా వేఁడివేఁడ్లు
యెలమి శ్రీవేంకటేశ యెనసితివి మాచేతి
వులివచ్చి చేఁతలకు నోపుదువా నీవు

రేకు: 0223-2 సామంతం సంపుటం: 08-134

పల్లవి: నీకే తెలునాపెకు నీకంటేఁ దెలుసు
వాకు నిష్ఠూరాల మీలో వంతువెట్టేవారమా

చ. 1: సందడించి నీపయినింతి సణఁగులు చల్లఁగాను
విందువలె నీ వాపెను వేఁడుకోఁగాను
కందువచూడఁ గన్నులు గలవారమింతే నేము
చెంది మీతో సాకిర్లు చెప్పేటివారమా

చ. 2: పంతమాడి నీకు చెలి పగటులు చూపఁగాను
యెంతకైనా నీవాపెతో నియ్యకోఁగాను
సంతలోని పనివలె సమ్మతించేవారమింతే
బంతిఁబెట్టి మిమ్ము నొడఁబరచేవారమా

చ. 3: కాయమిచ్చి సతి నిన్ను కాఁగిటఁ గూడఁగాను
నీయంత శ్రీవేంకటేశ నీవు మెచ్చఁగా
పాయపు వలపు తొల్లే పాలువట్టేవారమింతే
నాయములు చెప్పి మిమ్ము నవ్వేటివారమా

రేకు: 0223-3 మాళవిగౌళ సంపుటం: 08-135

పల్లవి: విభుఁడు నీపై భుక్తితో వీఁడె వున్నాఁడు
సభఁలో మాకెల్లా నీవు చనవియ్యవమ్మా

చ. 1: చలము సాదించఁగాను జగడాలు దిద్దరాదు
నలువంకఁ దగవులే నడపవమ్మ
వెలయుచుఁ దిట్టఁగాను విన్నపాలు సేయరాదు
చలువైన శాంతానఁ జక్కఁగావమ్మా

చ. 2: సమ్మతించననఁగాను సందడి మాటాడరాదు
నిమ్మపండందుకొంటే నీవే నేనమ్మా
యెమ్మెలు నెరపఁగాను యియ్యకోలు సేయరాదు
వుమ్మడి మీఁదటెత్తులు వూహించవమ్మా

చ. 3: యింత సిగ్గుపడఁగాను యెరుకలు సేయరాదు
వింతలు సేయక తెర వేయవమ్మ
చెంతలనే నిన్నుఁగూడె శ్రీవేంకటేశుఁడు లోలో
బంతినే మోవితీపులు పచారించవమ్మా

రేకు: 0223-4 లలిత సంపుటం: 08-136

పల్లవి: నాకే కాచుకుంటివా నడుమ నీవు
యీకతలెల్లా నేర్చి యెందు వోతివే

చ. 1: చెంతల నాతనిమాటే చెల్లఁబెట్ట వచ్చేవు
యెంత తగవరివే యేమే నీవు
పంతపురమణుఁడూర బావయై రాఁగాను
యింతేసి బుద్దులు చెప్పకెందు వోతివే

చ. 2: కూడఁగట్టి నాలోనిగుట్లే అడిగేవు
యేడకేడ నీనేర్పులేమే నీవు
నీడనున్న రమణుని నిందలిందరాడఁగాను
యీడ నీవుత్తరాలాడకెందు వోతివే

చ. 3: కందువనాతని నన్నుఁ గాఁగిలించఁ జేసితివి
యిందుకా నీజాణతనాలేమే నీవు
అందపు శ్రీవేంకటేశుఁ డక్కడా నిక్కడా నేఁడు
యిందెను చేసిన చేఁతలెందు వోతివే

రేకు: 0223-5 మంగళకౌశిక సంపుటం: 08-137

పల్లవి: కానవచ్చెఁ గదే మీకు కాంతలాల
నాననిచ్చితేనే కొంత నయము వచ్చీని

చ. 1: మనసులోపలి చింత మాటలోనే కానరాదా
మనసేమి సోదించేవే మగఁడాతఁడు
కొనగొనలనే వద్ద గుట్టుననుండుటే మేలు
పనివడి పిసికితే పవురు వేసీని

చ. 2: ముంచిన వలపుతీపు మోవిమీఁదఁ గానరాదా
యెంచనేలే గుణాలు ప్రాణేశుఁ డాతఁడు
అంచలనిచ్చకమాడి ఆసలనుండుటేమేలు
కంచముపొత్తుకుఁబోతే కారాలు సోఁకీని

చ. 3: కాయము సోఁకినరతి కళలోఁ గానరాదా
యేయెడను శ్రీవేంకటేశుఁడాతఁడు
పాయక కూడెనితఁడు పంతముగొనుటే మేలు
వాయఁబోతే కొనగోరు వాఁటాలు సేసీని (?)

రేకు: 0223-6 హిజ్జిజి సంపుటం: 08-138

పల్లవి: దానికేమి తప్పదింతా తానే నేను
కానుకలు పచరించ కాలమెల్లా వలెనా

చ. 1: మాటలే మూటలాయ మంతనములాడఁగాను
యేఁటివే తనసుద్దులు యెందాఁకానే
పాటించి తా మగఁడైన ఫలమిది చాలదా
కూటమికిఁ గొసరఁగ కొలువులో వలెనా

చ. 2: చూపులే రూపులాయ చూడఁగాఁ జూడఁగాను
యేపునఁ దనయెమ్మెలు యెందాఁకానే
చేపట్టి తాఁ బెండ్లాడేచేఁత యిదే చాలదా
తీపులు పచరించను తెరలోనే వలెనా

చ. 3: నవ్వులే పువ్వులాయ నాపైఁ దనమోహమున
యెవ్వరు నెరఁగనివా యెందాఁకానే
రవ్వగాఁ గూడె శ్రీ వెంకటరాయఁడిది చాలదా
పువ్విళ్ళూర సన్నసేయ వొద్దనిట్టే వలెనా

రేకు: 0224-1 హిందోళవసంతం సంపుటం: 08-139

పల్లవి: చెల్లునయ్య నీవు నాకుఁ జేసే చేఁత
యెల్లవారిలోన నిది యెక్కుడా నాకు

చ. 1: చనవిచ్చితివి నీవు చలము నే మానితి
యెనసి వేఁడుకొనేవు యెక్కుడా నాకు
పెనఁగితివిట్టే నేఁడు బిగువులు సడలితి
యినుమారు పంతమిచ్చేవెక్కుడా నాకు

చ. 2: పయ్యెద నీవంటితివి పనులకు లోనైతి
యియ్యరాని బాసయిచ్చే వెక్కుడా నాకు
నెయ్యము పై వేసితివి నీవే నేనై యుంటి
యెయ్యెడ చూచినా నవ్వేవెక్కుడా నాకు

చ. 3: కందువ దెలిపితివి కాఁగిలించుకొంటెనిన్ను
యిందర మెచ్చ మన్నించే వెక్కుడా నాకు
కందర్పగురుఁడ శ్రీ వెంకటరాయ కూడితివి
యింద నందూనేలితివెక్కుడా నాకు

రేకు: 0224-2 శంకరాభరణం సంపుటం: 08-140

పల్లవి: ఇద్దరూ నిద్దరే మనమేమి చెప్పదే
బద్దుగా దాపెను మెచ్చెఁ బ్రహ్లాదవరదుఁడు

చ. 1: చక్కని మొకముచూసి సారెసారె మాటలాడి
చిక్కించెనాపె తొలుత చేరియాతని
మిక్కిలి మేలుదియ్యై మేను చెమరించఁగాను
పక్కన నాపెను నవ్వెఁ బ్రహ్లాదవరదుఁడు

చ. 2: పీఁటమీఁదఁ గూచుండి ప్రియములు చెప్పి చెప్పి
దూఁటి చన్నులనొ త్తెను తొలుతాతని
పాటించి యాతని మోవిపండు చూచి నోరూరఁగా
బాటగానాపెను నవ్వెఁ బ్రహ్లాదవరదుఁడు

చ. 3: కాఁగిలించుక యిందిర కన్నులవలపు చల్లి
ఆఁగెను శ్రీవేంకటేశు నౌభళానను
చేఁగదేరఁ జొక్కియాపెఁ జూచి ఆతఁడె తానై
పాఁగినరతుల నవ్వెఁ బ్రహ్లాదవరదుఁడు

రేకు: 0224-3 సాళంగనాట సంపుటం: 08-141

పల్లవి: నడుమఁ జెమట భవనాశియేరు మీకునబ్బె
ఆడియాలముగ లోలోనందెఁగా మీవలపు

చ. 1: యెదురుఁ గొండపైనెక్కి యిందిర నీపైఁ గుచము
లెదురుచాఁచి వొత్తెనేడకు నేడ
కదిసి శ్రీ నరసింహ కాఁగలించితి వాపెను
అదన నిందుకు నందు నందెఁగా మీవలపు

చ. 2: యీడనుండి తన పాదమింతి నీతొడపైఁ జాఁచి
యీడుజోడుగాఁ గూచుండెనిచ్చ యెరిఁగి
వేడుక నీమోవినాపె ఇందుగా మోవంటితివి
ఆడానీడా దోఁటిగా నేఁడందెఁగా మీవలపు

చ. 3: నీనీడ ఆపైపైఁ బారి నీపైనాపెనీడవారి
తానకమై రెంటా మీరు తగిలితిరి
పూని యహోబలమునఁ బొంచి శ్రీ వేంకటేశుఁడ
ఆనకమై రెంటాఁ బెండ్లియంటెఁగామీవలపు

రేకు: 0224-4 గౌళ సంపుటం: 08-142

పల్లవి: ఏమందునే వీనిమాయ లెన్నైనాఁ గలవు
కామించి నన్నునేలె కమ్మటీని చూడరే

చ. 1: కొప్పున రాలీ విరులు గురుతులు చూడరే
చిప్పిలీఁ జెమటలివె చేరిచూడరే
వుప్పతిల్లే పులకలనున్నాఁడు చూడరే
కప్పీఁ బడ్చుడము నాకు కమ్మటీనిఁ జూడరే

చ. 2: గందపుఁ బేఁట్లు రాలీఁ గమ్మటీనిఁ జూడరే
చిందీ లేఁతనవ్వులు సెలవులఁ జూడరే
అందమైన బుసకొట్లవి గొన్నిజూడరే
అందుకొనీ నా చన్నులంతలోనే చూడరే

చ. 3: వాడుమోవియును వింతవాసనలఁ జూడరే
వేడుకకాఁడై వచ్చి వేఁడుకొనీఁ జూడరే
వీడెమిచ్చీఁ గోన తిరువెంగళేశుఁడై వచ్చి
కూడెను శ్రీవెంకటాద్రి కొండమీఁదఁ జూడరే

రేకు: 0224-5 లలిత సంపుటం: 08-143

పల్లవి: వినవే విభునిమాట వింతదానవా
చెనకేటి వేళనింత సిగ్గులు వడుదురా

చ. 1: యీసు లేని వాఁడతఁడు యిచ్చకురాలవు నీవు
తాసులవంటివే నీతలఁపు లెల్లా
సేస వెట్టినాఁడతఁడు చేయివట్టితివి నీవు
వాసులకు నీవుతల వంచుకొందురా

చ. 2: సరసపు వాఁడతఁడు చాయకు వత్తువు నీవు
సరిబేసి వంటివే మీచనవులెల్లా
తెరవేసినాఁడతఁడు తిరమై నిలిచితివి
శిరసువంచుక నీవు చెక్కు చేతనుందురా

చ. 3: శ్రీ వెంకటేశుఁడతఁడు శ్రీమహలక్ష్మివి నీవు
పూవు వాసనవంటివే బుద్ధులెల్లాను
భావించి కూడెనతఁడు పైకొంటి విట్టెనీవు
తావున రతుల నిట్టే తమకింతురా

రేకు: 0224-6 కన్నడగౌళ సంపుటం: 08-144

పల్లవి: ఇంతసేసినవాఁడవు యిదినేరవా
కాంత వున్నభావము కందువు రావయ్యా

చ. 1: చెక్కుల లేఁతచిగురు చేతిలోఁ దామరపవ్వు
వొక్కపరేఁ రెండనబ్బెనువిదకును
యెక్కడయేసునో మరుఁడు యెవ్వరి మర్మమంటునో
చొక్కముగ నీతిఁ జూతువు రావయ్యా

చ. 2: ఔప్పల ముత్యాలవాన ఔసులనే మీలయీఁత
అప్పుడే రెండూఁ గలిగెనంగనకును
తప్పులెవ్వరివల్లనో దైవికమెట్టున్నదో
చొప్పులీ వనితవల్లఁ జూతువు రావయ్యా

చ. 3: చిత్తములో నీరూపు చింతలు నీమీఁదను
హత్తెను రెండూ నిట్టే అతివకును
కొత్తగా శ్రీవెంకటేశ కూడితివింతక ముందు
జొత్తుల చెమటచెలిఁ జూతువు రావయ్యా

రేకు: 0225-1 నాట సంపుటం: 08-145

పల్లవి: నీతోను సరి బొంక నేనోపను
కాతరించినట్టి నీకనుసన్నదానను

చ. 1: చెక్కునొక్కి వేఁడుకొంటే సేదలెల్లాఁ దేరిచితి
మొక్కితిఁజామ్మీనీకు మొన్న మొన్ననే
తక్కరివిద్యలుయేమీఁ దలఁచకుమీ అయ్య
చిక్కఁగా వలచిన నీచేతిలోనిదానను

చ. 2: పాదములు పట్టుకొంటి పంతములు నీకిచ్చితి
అదిగొన నే నవ్వితి నప్పుడప్పుడే
కాదుగూడదనకుమీ కాఁకలు సేయకుమయ్య
యేదెసచూచినా నీకునింటిలోనిదానను

చ. 3: యిచ్చకములు సేసితినియ్యకొంటి నన్నిటికి
కొచ్చి శ్రీవెంకటేశ నేఁగూడితి నేఁడే
పచ్చి సేఁతలెల్లాఁ జేసి పదరకుమీ అయ్య
కచ్చుపెట్టుక వుండే నీ కాఁగిటిలోదానను

రేకు: 0225-2 రామక్రియ సంపుటం: 08-146

పల్లవి: ఊరకున్నదంటానేల వొరయఁగ వచ్చేవు
నేరుపుల కెల్లానిది నెపమింతే కాక

చ. 1: పట్టరాదు ముట్టరాదు పడఁతుల మోహము
గుట్టుదెలిసినదాఁకా గురిగాదు
అట్టడివి నిన్నాపె యాఅడిసేయ నోపునా
పట్టిన వ్రతముతోడి బలిమే కాక

చ. 2: చెప్పరాదు చూపరాదు చెలుల కోరికలు
ముప్పిరి మాఁటాడుదాఁకా ముచ్చటాడదు
తప్పనివాఁడవు నీతో తారుకాణ కోపునా
తెప్పగా నీతో నవ్వేతెలివే కాక

చ. 3: పాయరాదు తోయరాదు పడఁతుల సంగములు
చేయి మీఁదయినదాఁకా సిగ్గువడ (వీడ?) దు
యీయెడ శ్రీవేంకటేశ యింతి నీపురాన నిల్చె
వాయకు గర్వించేదా సలిగింతే కాక

రేకు: 0225-3 ఆహిరి సంపుటం: 08-147

పల్లవి: నే నేరుపవలెనా నెలఁతకు నివియల్లా
సానఁ బట్టుకో నేరదా సకియ నీమనసు

చ. 1: నవ్వులనే నీవింత నాలిసేసేవాఁడవౌత
యెవ్వరు నెఱఁగరా యెమ్మెలేఁటికి
నివ్వటిల్లఁ గైలాటాలు నేఁ బెట్టితిననేవింత
జవ్వని యాపెఱఁగదా చల్లని నీగుణము

చ. 2: జంకెననే నీవప్పటి సందుకొనేవాఁడవౌత
పొంకాన వచ్చేదేకాదా పొద్దువొద్దుకు
సంకెదీర నిన్నాపెతో జగడాలు వెట్టితినా
అంకెల నాపెఱఁగదా అచ్చప నీసొజము

చ. 3: కందువనింతులఁ జూచి కలసేటి వాఁడవౌత
చందమయ్యేకాదా (?) సారె సారెకు
పొందితి శ్రీవెంకటేశ పొరుగున మమ్మిద్దరి
ముందర నాపెఱఁగదా ముచ్చట నీవలపు

రేకు: 0225-4 బౌళిరామక్రియ సంపుటం: 08-148

పల్లవి: నేరుపరులకునెల్లా నీవు సేసినదే పాడి
అరయఁ గడపరాయ అంతవాఁడవౌదువు

చ. 1: కందువమాటలనే కంకణాలు గట్టికట్టి
సందడిఁ బెండ్లాడేవు చతురుఁడవు
చందమామగుటుకల సారెనవ్వి వావులెల్లా
అందలానఁ బెట్టుకొంటి వంతవాఁడవౌదువు

చ. 2: పోరచి మోవితేనెలు పాదిగి తోడంటువెట్టి
సారెకు విందవెట్టేవు చతురుఁడవు
కోరి నిన్నుఁ జూచితే నాకొనచూపుల ముత్యాల
హారాలుగా వేసుకొనే వంతవాఁడవౌదువు

చ. 3: వొల్లనే చేతులు చాఁచి వుడివోని వలపులు
చల్లి వుంకువలిచ్చేవు చతురుఁడవు
యెల్లగా శ్రీవెంకటాద్రినెనసి నావిన్నపాలు
అల్లంతనే వింటివంతవాఁడవౌదువు

రేకు: 0225-5 ధన్నాశి సంపుటం: 08-149

పల్లవి: సాము సేతువుగా నీవు సరుస రాముఁడవై
యీమగువనేరువులు యివి చూడరాదా

చ. 1: బొమ్మల విండ్లచేత పూఁచి చూపుల యమ్ముల
కుమ్మరించి చెలి నీపై గురులేసీని
సమ్మతించి యిరువంక చన్నుల కాంతులు సారెఁ
జిమ్ము పయ్యదలోఁ బుట్ట చెండ్లాడీని

చ. 2: గక్కన బిసకాండపు కరముల సన్నలను
అక్కజపు నీతోఁ గోలాటమాడీని
చెక్కుచెమట గోరులఁ జిందకుండా మీఁటుచు
చక్కు బుజ్జుటకొమ్ములు సాధించీని

చ. 3: చిగురుమోవిమాటల చేకత్తుల పంతాలఁ
దగిలి నీపైనాపె దండ వెట్టీని
నగుతా శ్రీవెంకటేశ నంటున నీవు గూడితి
అగపడి నీగరిడినన్నిటా మించీని

రేకు: 0225-6 ఆహిరి సంపుటం: 08-150

పల్లవి: ఏమయ్య యిందుకు నిన్నే మందును
కామించవలదా కైకొని నీవిపుడు

చ. 1: గాలించి గాలించి కలికి మాటలాడఁగా
లాలించవలదా లలనఁ గొంత
పోలించి పోలించి పొగడఁగా నప్పటిని
పాలించవలదా పయికొని నీవిపుడు

చ. 2: సోదించి సోదించి సుద్దుల నిన్ను మెచ్చఁగా
ఆదరించఁగ వద్దా అన్నిటా నీవు
సాదించి సాదించి సరి నీతో నవ్వఁగా
మోదించవలదా మొదల నీవిపుడు

చ. 3: కరఁగించి కరఁగించి కాఁగిట నిన్నుఁ గూడఁగా
పొరయించవలదా పొందుల నేఁడు
సిరులుమించఁగ మించ శ్రీవెంకటేశుఁడుగూడె
యిరువుకోవలదా యిచ్చకములిపుడు

రేకు: 0226-1 మాళవి గౌళ సంపుటం: 08-151

పల్లవి: మాతోనింకానా మజ్జాతాయను వకు (?)
చేతికి లోనై నమీఁదఁ జెప్పవలెనా

చ. 1: జంగిలి సతుల నీవు సారెసారె నమ్మించఁగా
అంగడిఁ బడీనవె నీ అన్నమాటలు
యెంగిలిగా నీమోవి యెవ్వరైనాఁ జేయఁగాను
ముంగిట మెరసెను నీముసిముసి నవ్వులు

చ. 2: చేరి పదారువేలకు సేసలు నీవు వెట్టఁగా
ఆరీతిఁ బడెనవే నీ అన్ని చేఁతలు
కోరికలు మించినట్టి కొలనిసతులచేత
నీరువంక తుంగైనవి నీగుణాలు

చ. 3: యింపుల రాచకూఁతురునెత్తుక నీవు రాఁగానే
సంపద మించినవి నీచతురతలు
ముంపున శ్రీవెంకటేశ ముందె నన్నుఁ గూడితివి
చెంపల నిలిచెను నీసిగ్గులెల్లాను

రేకు: 0226-2 భైరవి సంపుటం: 08-152

పల్లవి: చిత్తము రా సేవలెల్లఁ జేతువుగాక
కొత్తలా మీయిద్దరికిఁ గొంకనేలే యిఁకను

చ. 1: సెలవి నవ్వునిండితే సిగ్గులేల పెంచేవే
నిలువున నవిరెండు నీవొళ్ళివే
వలుపే పూవఁగాను వాసనలు మానునా
కొలువులో పతితోడఁ గొంకనేలే యిఁకను

చ. 2: తనువు చెమరించితే తలయాల దాఁచేవే
నినుపుననవి రెండు నీవొళ్ళివే
మనసు గరఁగఁగాను మచ్చికలు మానునా
కొనితెచ్చేవా బుద్ధి కొంకనేలే యింకను

చ. 3: మఱపు పైకొంటేను మాటలేల కొదికేవే
నెఱతనాలవి రెండ నీవొళ్ళివే
చిఱుతల మేలుమంగ శ్రీవెంకటేశుఁడు గూడె
గుఱియైన పనులకు కొంకనేలే యిఁకను

రేకు: 0226-3 శంకరాభరణం సంపుటం: 08-153

పల్లవి: నేఁడె శుక్కురారము నెలఁతలాల
పోఁడిమి సేవసేయరే పుణుఁగుకాపు

చ. 1: పన్నీటి కాలువలు పారీనిఁజూడరే
అన్నిటాఁ గొండవంటి శ్రీహరిమీఁదను
యెన్ననభిషేకమంత్రాలిదె చెప్పేరు వినరే
తిన్నని పుళుగుకాపు దేవునికి నేఁడు

చ. 2: రాలీని కప్పురరజమిదె చూడరే
నీలమేఘమువంటి యీ నీరజాక్షుపై
తాలమితో జాలువారీ తట్టుపుణుఁగదిగోరే
పోలింపఁ బుణుఁగుకాపు పురుషోత్తమునికి

చ. 3: అలమేలు మంగతోడి హారాలు సేవించరే
వెలయ ధరించెను శ్రీవెంకటేశుఁడు
పలువిందులారగించె బాగాలు యియ్యరే
చెలఁగీ పుణుఁగుకాపు శేషాద్రిపతికి

రేకు: 0226-4 సౌరాష్ట్రం సంపుటం: 08-154

పల్లవి: ఏఁటిదో నీచిత్తము నేమెఱఁగమయ్య
వాఁటమైన వెల్లవిరివారమయ్యా

చ. 1: సిగ్గుపడితిమింతతో సెలవి నీవు నవ్వఁగా
యెగ్గొ తప్పొ యేమంటినో యెరఁగమయ్య
దగ్గరి సేవ సేసితి తగినదొరవు నీవు
నిగ్గులఁ గుచ్చితములు నేరమయ్య

చ. 2: మోరగందితినింతలో వేఁడుకొనే నిన్నుఁజూచి
మొరఁగులిందేమున్నవో మొక్కేమయ్య
మరినీకు లోనయితి మంచిదేవరవు నీవు
మెరసి నీతోఁ బెనఁగ మేము నేరమయ్య

చ. 3: చెమరించితివి నీవు చేరి నన్నుఁ గూడఁగాను
తమకమా తడఁబాటో తలఁచమయ్య
అమర శ్రీవెంకటేశ అలమేల్మంగను నేను
అమరిన రతికడ్డమాడమయ్య

రేకు: 0226-5 మేఁచభౌళి సంపుటం: 08-155

పల్లవి: నీవారమిన్ని టాను నీకంటెనెక్కుడు లేరు
సేవలు సేసేము నీవు చిత్తగించవయ్యా

చ. 1: సేసినచేఁతలు నీవే చెల్లఁబెట్టుదువు గాక
యీసరి మానేరుపులు యేమున్నవి
సేసవెట్టి రాజు వలచినదే దేవులందురు
రాసికెక్క నీసొమ్ము రక్షించుకోవయ్యా

చ. 2: పట్టిన నీపంతమే బలువు సేతువు గాక
యెట్టైన మాగుణములు యేమి చూచేవు
అట్టే పరుసమంటితేనదియే బంగారందురు
పెట్టని చోట్లఁ బెట్టి పెద్ద సెయ్యవయ్యా

చ. 3: కూడిన నీకూటములె గురులు సేతువు గాక
యీడనే మాయసోదాలేమున్నవి
యేడను శ్రీవెంకటేశ యేలితేనే బంటందురు
పాడేటివారము నిన్ను బత్తిచేకోవయ్యా

రేకు: 0226-6 ముఖారి సంపుటం: 08-156

పల్లవి: ఆయలవాటే చూచి అప్పటిమాతో నేఁడు
చాయలనీపనికెంత సాముసేసెనో

చ. 1: వీడెమియ్యఁగలఁ గాక వీడెమిచ్చే చేతుల
తోడఁ దోడఁ బెనఁగఁగా దొబ్బఁగలనా
వోడక ని నిష్ఠూరానకొడిగట్టే సతులనుఁ
గూడి యేమిసేయించుకొని వచ్చెనో

చ. 2: మాటలాడఁగలఁ గాక మంచితనమైన నోట
తేటగా నవ్వేటి తన్నుఁ దిట్టఁగలనా
నీటున రాఁగతనాలు నెరుపేటి కాంతలను
పాటించి కలసి యేమి భ్రమసినాఁడో

చ. 3: కాఁగిలించఁగలఁ గాక కైకొన్న చేతుల గోళ్ళ
చేఁగదేర మొక్కఁగాను చిమ్మఁగలనా
వీఁగక శ్రీవెంకటాద్రి విభుఁడిట్టె నన్నుఁ గూడె
యేఁగి వచ్చి యేయింతులకిట్టె పంతమిచ్చెనో

రేకు: 0227-1 నాదరామక్రియ సంపుటం: 08-157

పల్లవి: ఎప్పుడును నీమనసు యెరఁగని కల్లలేదు
ముప్పిరిగొనేటి యీమోసమేలయ్యా

చ. 1: వలపులు సరివచ్చె వనిత యిందుకు మెచ్చె
వెలినేల లోనికిఁక విచ్చేయరాదా
యెలమి సరిబేసికి యిదె సుద్ది నిన్ననేల
నిలువు నివ్వెరగులు నీకేలయ్యా

చ. 2: మాటలు తారుకాణాయ మగువకుఁ బ్రియమాయ
మాటికి నవ్వఁగనేల మన్నించరాదా
తేటలుగా నీనిజాలే తెలిసెఁ జెలులకెల్ల
యీటుతోడి కుచ్చితాలు యిఁకనేలయ్యా

చ. 3: రతిఁ దమకము నిండె రమణిభాగ్యము పండె
కతలేల పంతములు గైకొనరాదా
యితవై శ్రీవెంకటేశ యింతినిట్టె కూడితివి
మతకరి తరితీపు మరియేలయ్యా

రేకు: 0227-2 కాంబోది సంపుటం: 08-158

పల్లవి: వట్టి పంతములనేల వసివాడువాడ నీకు
నెట్టన నీవాఁడనని నిలుచుండరాదా

చ. 1: కలికిచూపులు నీకుఁ గలువరేకులెకాక
వెలినుండి యింతలోనే వెట్టలయ్యీనా
పొలసిన విరహానఁ బొరలేవు యీడనుండి
వలచి వచ్చితినంటా వద్దికి రారాదా

చ. 2: కామిని నవ్వులు నీకుఁ గప్పురవిడేలే కాక
చే ముంచి మరివేరే చేఁదయ్యీనా
ఆమని యాసలతోడ నసురుసురయ్యేవిట్టే
దోమటిమోవితేనెలు తొడుకఁగరాదా

చ. 3: కాంతమాటలు నీకుఁ గట్టిన ముడుపు గాక
చింతల నింతలోననే చిల్లరయ్యీనా
యింతట శ్రీవెంకటేశ యెనసితి విందుమండే
పొంతకు వచ్చినందుకు పూఁచి మొక్కరాదా

రేకు: 0227-3 లలిత సంపుటం: 08-159

పల్లవి: ఎఱఁగమైతిమయ్య (మమ్మ?) యిన్నాళ్ళును
కఱకరిఁ బెట్టఁగోరే కాతరీఁడా తాను

చ. 1: పొందులిట్టే రేఁచఁగాను పొత్తులు వేడుకలాయ
సందడించఁగా వలపు చవులాయను
యిందాఁకాఁ దనమనసెవ్వరిదై వుండెనే
ముందు వెనక లెంచని మొక్కలీఁడా తాను

చ. 2: కాయము గిలిగించఁగా గక్కన నవ్వులు వుట్టె
చేయి చేతనంటఁగాను చెమరించెను
పాయపుమదమెవ్వతె పంచనుండెనే యిన్నాళ్ళు
చాయలు సన్నెరఁగని జడ్డువాఁడా తాను

చ. 3: గక్కున నేఁగూడఁగాను కళలు మోమున నిండె
నొక్కుచు మోవియ్యఁగాను నోరూరెను
యిక్కువ శ్రీవెంకటేశుఁడెంత భ్రమసి వుండెనే
యెక్కువ నాతోరమించె నిచ్చకుఁడా తాను

రేకు: 0227-4 నాగవరాళి సంపుటం: 08-160

పల్లవి: ఇంటికి రావయ్యా యింకనేఁటికి
కంటగించఁ దొల్లింటికతలెన్నిలేవు

చ. 1: కావరించి యెట్టుండినాఁ గడు మంచివాఁడవే
నీవేమేమాడినాను నిజమరిచే
కైవసపు వనితలు కల్లలు గారులు నిన్ను
ఆవటించి వూరకైనా నాడుదురుగాని

చ. 2: సేసేటి నీచేఁతలెల్లా చేరువపుణ్యాలే
నీ సుద్దులు విన్నవల్లా నీతితోడివే
పాసినట్టి మగువలు పట్టలేక వయసులు
వేసరి నిన్నుఁ దిట్టుతా వీఁగుదురు గాని

చ. 3: కలసిన నీరతులు కందువ వుచితములే
సులభాన నీవు నాకుఁ జుట్టమవే
యెలమి శ్రీవెంకటేశ యెరవుల వనితలు
చలమరివని నిన్ను సాదింతురు గాని

రేకు: 0227-5 మెఁచభౌళి సంపుటం: 08-161

పల్లవి: ఎప్పుడు నీవు వచ్చినా నేమాయను చన
విప్పించుకొనేఁగాక యేమాయను

చ. 1: నీకు సెలవైనదాన నీచేతిలోనిదాన
యేకడ నేనే నుండినాను యేమాయను
ఆకు మడిచిచ్చేదాన ఆయాలు సోఁకినదాన
యేకొలఁది నుండినాను యేమాయను

చ. 2: వంతువరుసల దాన వలచివుండిన దాన
యెంత విరహాన నున్నా నేమాయను
చింత నీకెక్కినదాన చిగురుఁగోరికదాన
యింత నీవు పెనఁగితే నేమాయను

చ. 3: మనసు నమ్మినదాన మానము నీకై నదాన
యెనసి నిన్ను మెచ్చితే నేమాయను
తనిసితి నీకూటమిఁ దగు శ్రీ వేంకటేశ్వర
యినుమడించి నవ్వితేనేమాయను

రేకు: 0227-6 ముఖారి సంపుటం: 08-162

పల్లవి: మిక్కిలి కళదేరేవు మేలుగా నీవు
చక్కని సరసానకు జాణవుగా నీవు

చ. 1: యెప్పుడూను వింతలేదు యేసతుల యడాటాన
మెప్పించుకోనేర్తువు మేలుగా నీవు
చిప్పిల నవ్వు నవ్వితేను సిగ్గుపడవేమిటాను
చెప్పరాని మహిమలు సేతువుగా నీవు

చ. 2: అంగళ్ళ ముంగిళ్ళ నల్లారుముద్దు చూపేవు
మెంగతనాలు నీసొమ్ము మేలుగా నీవు
సంగడి నేఁ జెనకితే సమ్మతించే వెందుకైనా
జంగిలి రతులకు వేసరవుగా నీవు

చ. 3: పిలిచితేఁ బలికేవు భేదము లేదేమిటాను
మెలకువగల వింత మేలుగా నీవు
అలరి శ్రీవెంకటేశ అంటితేనే కూడితివి
కలపుకోలన్నిటాను కలవుగా నీవు

రేకు: 0228-1 శ్రీరాగం సంపుటం: 08-163

పల్లవి: బంగారువంటిదాన పచ్చివిటుఁడవు నీవు
యెంగిలి నీమాటవింటి నేమి సేతురా

చ. 1: కందువగు నీమేను కాఁగిలించఁగానె నామ్మై
చందముగ నీమేనిలచ్చనలంటెను
చిందరవందరలైన జీడివంటిది వలపు
యిందులోనే కొనవచ్చె నేమిసేతురా

చ. 2: మొక్కితి నీపాదాలకు ముందర మొక్కినవారి
యెక్కడో కస్తూరిబొట్టు యిదె నన్నంటె
మొక్కలాన ముయికిని ముయివంటిది వలపు
యిక్కడనే కానవచ్చె నేమిసేతురా

చ. 3: బాగాలు నీకిచ్చితేను పాఁగిన నీతమ్ములము
పోగులై తోడుత నాపుక్కిలి నిండె
బాగుగా శ్రీవెంకటేశ పంటవంటిది వలపు
యీగతినే కానవచ్చెనేమిసేతురా

రేకు: 0228-2 దేసాళం సంపుటం: 08-164

పల్లవి: నీకు బాఁతే చెలులము నీగుణ మిట్టిది గాక
యీకొలఁది నీభావాలేమని నుతింతును

చ. 1: చెప్పినట్టే చేసేవు చేరి నేనెంత నీ వెంత
అప్పసము నీ వలుపేమని నుతింతు
చిప్పిలఁ గొంగు వట్టితే చేతికి లోనై వచ్చేవు
యెప్పుడూ నీ కృపారసమేమని నుతింతును

చ. 2: అడినట్టే ఆడేవు ఆతుమ నన్నుఁ జేసుక
ఆడిన నీ సౌలభ్యమేమని నుతింతు
వీడెము చేతికిచ్చితే వేడుక నందుకొనేవు
యీాడ నీ మంచితనము యేమని నుతింతును

చ. 3: కోరినట్టెల్లాఁ గూడేవు కొసరుకు గొసరెల్లా మాని
ఆరీతిఁ జుట్టరికమేమని నుతింతు
సారపు శ్రీవేంకటేశ చనవిచ్చి కలసితి
యేరా నీ రతికేలి నేమని నుతింతును

రేకు: 0228-3 భైరవి సంపుటం: 08-165

పల్లవి: కానవచ్చీ నన్నియును గలసుద్దులపుడు
నీ నేరుపులేర్పడీ లోనికి నేఁగరాదా

చ. 1: చలము నీతోనేల సారె సారెనాపెకు
పలుకు బెంబడినే పచ్చిసేసీని
అలవోకమాటలా పెనాడితివి దానికేమి
నెలవుల రతికి లోనికి నేఁగరావా

చ. 2: కోపగించ నీతోనేల కొసరుచునాపెకు
తీపుల బెంబడినే దిమ్మురేఁచీని
చూపులనే రాజము చూపితివందుకేమి
నీపనులు దెలిసి లోనికి నేఁగరాదా

చ. 3: విచ్చిచెప్ప నీతోనేల వేరేవేరే యాపెకు
మెచ్చుల కాఁగిటిలోనే మెప్పించీని
కొచ్చి శ్రీ వేంకటేశుఁడ కూడితివి అందుకేమి
నిచ్చఁబెండ్లాయను లోనికి నేఁగరాదా

రేకు: 0228-4 భూపాళం సంపుటం: 08-166

పల్లవి: చవులుసేక నీవు సారెసారెకు
అవరములతోడ నారగించవయ్యా

చ. 1: మాటలమూటల చద్ది మనసులో చిలుపాలు
యేఁటిసేసి విందువెట్టీ నింతి నీకును
పాటలపంచదారలు పచ్చిమోవితేనెలు నీ
యాటలాయ నేఁడిట్టే ఆరగించవయ్యా

చ. 2: జంకెనల కారాలు చవుల సాకములు
లంకెల విందులు వెట్టీ లలన నీరు
పొంకపుఁ జూపులంబళ్ళు పొరినవ్వుల పచ్చళ్ళు
అంకెలాయ నేఁడిట్టే ఆరగించవయ్యా

చ. 3: కరజపు వినయాలు కాఁగిటి రతిబువ్వాలు
సిరులతో విందువెట్టీ శ్రీ సతి నీకు
గరిమ శ్రీ వెంకటేశ కలసితి రిద్దరును
అరుదాయ నేఁడిట్టే ఆరగించవయ్యా

రేకు: 0228-5 కాంబోది సంపుటం: 08-167

పల్లవి: ఎరవుగా నీవు నన్ను ఇందరివలెఁ జూచేవు
దొరతనమే కాక దొమ్మిసేసేనా

చ. 1: వలపు నీపైఁ జల్లి వానికిఁ బెనగేఁ గాక
చెలులతో జగడాలు సేసేదాననా
పలుకుల బువ్వాలబంతికి వచ్చేఁ గాక
అలుకలు మీద మాటలాడేదాననా

చ. 2: యింగితమెరిఁగి నిన్ను నింటికిఁ బిలిచేఁ గాక
కొంగువట్టి తీసి యింత కొచ్చేదాననా
పొంగుచు నీవద్దనుండి బుద్ది చెప్పేదానఁ గాక
సంగతి దెలియకింత సాదించేదాననా

చ. 3: కప్పురము నోరికిచ్చి కారాలు రేఁచితిఁ గాక
చిప్పిల నీమోవి గంటిసేసేదాననా
ముప్పిరి శ్రీవెంకటేశ ముంచి నన్నుఁ గూడితివి
అప్పసపుదానఁగాక అటువంటిదాననా

రేకు: 0228-6 సాళంగనాట సంపుటం: 08-168

పల్లవి: పేరు కుచ్చి యాతనితో పిలిపించుకోవలెనా
చేరి వీడెమియ్యఁగదే సిగ్గులింకా నేఁటికి

చ. 1: సరి నీవు నవ్వితేనే సరసానఁ బైకొంట
యిరవుగాఁ జూచితేనే యియ్యకొనుట
గరిమ మాటాడితేనే కంకణము గట్టుకొంట
సరుగ రావే యేల జాగులు సేసేవు

చ. 2: చేరి తిట్టినపుడే చేఁతలకు లోనౌట
సారెఁ బయ్యద మూయుటే చవి రేఁచుట
కోరఁగా నానవెట్టుట గోరికొనకు లోనౌట
కూరిమి చేకొని రావే గుట్టింతచూపక

చ. 3: యెదురెదురనుంటేనే యిచ్చల సేసవెట్టుట
యిదె చెక్కుచేయంటితే నింపు చల్లుట
అదిన శ్రీవేంకటేశుఁడాతఁడు తా నిన్నుఁగూడె
చెదరకిట్ల రావే చెప్పించుకొనక

రేకు: 0229-1 దేవగాంధారి సంపుటం: 08-169

పల్లవి: ఆయమంటి మోవితీపులానఁగ రాదా
వోయమ్మ వద్దనున్నాఁడు వూరకుండ నేఁటికే

చ. 1: చెక్కు నొక్కఁ బొద్దులేదో సేదదేరఁ బొద్దులేదొ
గుక్కక పతిఁ గాఁగిటఁ గూడఁగ రాదా
వెక్కసపు విరహాన విసిగితివిందాఁక
యిక్కడికే పతి వచ్చె నిఁకనేలే కొసరు

చ. 2: నవ్వు నవ్వ వేళలేదొ నమ్మికకు వేళలేదో
పువ్వువలెఁ గాఁగిటను పొదుగరాదా
దవ్వుల నున్నాఁడంటా తమకించితివిందాఁక
యివ్వల నీ గుబ్బలంటె నిఁక జాగువలెనా

చ. 3: మాటాడఁ దతిలేదొ మనసియ్యఁ దతిలేదొ
గాఁటముగ దెరవేసి కలయరాదా
యేఁట వెట్టి శ్రీ వెంకటేశుఁడిదె నిన్నుఁగూడె
యీటుగానే మన్నించె నిఁక నెదురేదే

రేకు: 0229-2 దేశా(సా)క్షి సంపుటం: 08-170

పల్లవి: మర్మము నీవె యెఱిఁగి మన్నింతువుగాక నన్ను
ధర్మమా నీకునాకుఁ దారుకాణలయ్యా

చ. 1: పల్లదపు నామాటకు భావించేఅర్థము నీవు
చల్లని నామనసుకు సాక్షివి నీవు
తెల్లముగా నామోములో తేటలకళలు నీవు
చెల్లఁబో యింకా విచ్చెచెప్పనేఁటికయ్యా

చ. 2: చెప్పరాని నాచేఁతకు సెలవినవ్వులు నీవు
వొప్పు నావయసునించే వొడివి నీవు
ముప్పిరి నాచక్కఁదనమున కద్దమవు నీవు
చిప్పిల నింకా విచ్చిచెప్పనేఁటికయ్యా

చ. 3: గట్టి నాచన్నులమీఁది ఘనహారమవు నీవు
పట్టిన నావ్రతానకు ఫలము నీవు
యిట్టె శ్రీవెంకటేశ యెనసితివింత నన్ను
చిట్టకాననిఁక వచ్చిచెప్పనేఁటికయ్యా

రేకు: 0229-3 వరాళి సంపుటం: 08-171

పల్లవి: శిరసుండ మోకాలికి సేసలు చల్లిన యట్లు
మురిపేన చెలికత్తె మొగమేమి చూచేవే

చ. 1: చెంతలఁ బిలువఁగాను చెలి వూరకుందానవు
పంతము దప్పిన యట్టే పలుకఁగాను
వంతుతో నీ రమణుఁడు వద్ద నిట్టే వుండఁగాను
మంతనానఁ జెలులచే మాటలాడించేవే

చ. 2: కొనగోరఁ జెనకఁగాను గుట్టుసేకొనేవీడ
ననుపున నాఁటినట్టే నవ్వఁగాను
యెనసి యాతఁడు నీయెదటనే వుండగాఁను
చనవిచ్చి చెలులను సాకిరి గోరేవే

చ. 3: వున్నతిఁ గాఁగిలించితే నొంటినే సిగ్గువడేవు
చన్నులు గుంగినట్టే సరినొత్తఁగా
అన్నిటా శ్రీ వేంకటేశుఁడాదరించి నిన్నుఁగూడె
చెన్నుఁడంటానితనిఁ జెలితో మెచ్చేవే

రేకు: 0229-4 వరాళి సంపుటం: 08-172

పల్లవి: కక్కూరితితనమేల కడదాఁకాను
అక్కరతో నింత నిజమాడి బదుకరాదా

చ. 1: శిరసుపై తలఁబాలు చెలిచేతితోనున్నవి
యెరవుగ నాతో నీవు యేలబొంకేవు
నిరతినిందుకుఁ గాను నీతోనేల అలిగేను
అరుదుగ నీవు నిజమాడి బదుకరాదా

చ. 2: నిన్నునొత్తిన చన్నులు నెలఁతరొమ్మునవే
యిన్నిటా నీవు నాతోనేల బొంకేవు
సన్నల నిన్నుఁదిట్టుచు సాదించేనా నేనేమి
అన్నిటాను యిట్టే నిజమాడి బదుకరాదా

చ. 3: నీయధరముపై తేనె నెలఁతపుక్కిలి నిండె
యీయెడనెవ్వరున్నారు యేల బొంకేవు
చేయిచ్చి యలమేల్మంగ శ్రీవేంకటేశుఁడ కూడే
వాయింతినే నేను నిజమాడి బదుకరాదా

రేకు: 0229-5 శుద్ధదేశి సంపుటం: 08-173

పల్లవి: ఎప్పుడూను నీవోజలిటువంటివి
తప్పక ఆసతి నీకుఁ దక్కువా యేమైనాను

చ. 1: పడఁతి లోలోసిగ్గు పచ్చినవ్వే మోళ్ళుఁగాక
అడిగితేఁ జెప్పునా అదియేఁటిది
కడలేని మగవాని కాతరము జాడిట్టిదే
గడుసుఁ దనాననింతఁ గాకుసేయఁ జూచును

చ. 2: చెలియతమకమెల్లా చెమటలై కారుఁగాక
వెలిఁబెట్టవచ్చునా వేఁడుకొనేవు
మలసేటి జాణని మతకములిట్టివే
చలివాపి సతులనాలురేఁచఁ జూచును

చ. 3: అంగనరతులచొక్కు ఆతుమలో నుండుఁగాక
సంగడించితేనంటునా సారె నీకును
యింగితాన శ్రీవేంకటేశ నీకూటమిగల్గె
రంగుగ నీబోఁటిమేలు రచ్చఁబెట్టఁ జూచును

రేకు: 0229-6 మాళవశ్రీ సంపుటం: 08-174

పల్లవి: మఱియేఁటి సుద్దులు మమ్మేమడిగేవు నీవు
మెఱసి మీయిక్కువలు మించెను దోమట్లె

చ. 1: యింతిని నీవు చూచితే నింగితాకారమెరిఁగి
చింతతోడఁ దలవంచి సిగ్గువడెను
వింతగానందుకు నీవు వెడనవ్వు నవ్వితివి
పొంతనే కమ్మర నాకె బొమ్మల జంకించెను

చ. 2: పడఁతిని దగ్గరితే భావమెల్లాఁ దెలుసుక
చిడుముడి తమకానఁ జెమరించెను
బడినే అందుకుఁ బూవుబంతి నీవు వేసితివి
వొడిఁ బెట్టుకొని యాకె వుద్దండాన మొక్కెను

చ. 3: అంగనఁ గాఁగిలించితే ఆయములట్టే కరఁగె
సంగతిగాఁ బవళించె శయ్యమీఁదను
అంగవించి శ్రీవెంకటాధిప నీవు గూడితివి
వుంగరములా కెవేళ(ళ్ళ?) నొగి మార్పులాడెను

రేకు: 0230-1 సామంతం సంపుటం: 08-175

పల్లవి: ఏమని భావింతు నిన్ను నెంతని సంతోసింతు
శ్రీమంతుఁడ నన్నుదిద్దే చేఁతోయిది

చ. 1: కాంతుఁడ నేనెంతాడినా గక్కదలవు నీవు
యెంత రాతిగుండెవాఁడ వేమి చెప్పేది
శాంతుఁడవో గట్టువాయిజాణతనమో యిట్టె
మంతుకెక్కించే నామీఁది మన్ననో యిద

చ. 2: దిట్టనై నేజంక్కించితే తెమలవేమిటా నీవు
యెట్టి చలపాదివాఁడ వేమి చెప్పేది
గుట్టు నీకింతగలదో గుణము చండిపడెనో
గట్టిగా నన్నీడేర్చే కరుణో యిది

చ. 3: బిగ్గె నేఁగాఁగిలించితే బెగడవేమిటా నీవు
యెగ్గులెంతెంచనివాఁడ వేమి చెప్పేది
సిగ్గరితనమో నేఁడు శ్రీవేంకటేశ నీనవ్వో
కగ్గులేకేలితివి నాకన్నవరమో యిది

రేకు: 0230-2 శుద్ధవసంతం సంపుటం: 08-176

పల్లవి: చెప్పకున్న దోసము చేఁతలెరిఁగినవారు
కప్పిన సంతోసాలఁ గందువలెరఁగరు

చ. 1: కన్నెలాల మీరిద్దరు కాఁగిలించేరు చుట్టాలై
పిన్నలు చన్నులొత్తినే పెరిగేపొద్దు
మున్నాడి యొక్కరొక్కరు మొక్కలాడేరప్పటిని
కన్నచో గోళ్ళుదాఁకినే కడువాఁడిపొద్దు

చ. 2: దిట్టలై ముచ్చటలుగా తీపులు మాటలాడేరు
యిట్టె తేనెగారీ నిప్పలెర్లించే (?) పొద్దు
చెట్టపట్టాలు వట్టేరు చేరి పిరుఁదులురాయ
బట్టబయలయ్యీ మరుబండ్లు వారేపొద్దు

చ. 3: బంతినే మీరిద్దరును పాదుగాఁ గూచుండేరు
గుంతలయ్యీఁ బరపల్లాఁ గూడేటిపొద్దు
యింతలో శ్రీవేంకటేశుఁడెనసె నిన్నునూ నన్నూ
రంతుగా మాచేనాడించే రాజసమీపొద్దు

రేకు: 0230-3 కాంబోది సంపుటం: 08-177

పల్లవి: ఎట్టుసేసినాఁ జేయుమిక నాతఁడల్లవాడే
పట్టరాని వ్రతములో పానువుపైనే

చ. 1: కప్పురపుమోవి నీవు కాంతునికిఁ జూపఁగాను
దప్పిదేరీ నాతఁడదే దవ్వులనుండే
చెప్పరానిచేఁతలు చేరి నీవు సేయఁగాను
చిప్పిలీ నీరతులను చిత్తములోనే

చ. 2: చన్నులఁ బయ్యద నీవు జారఁదోయఁగా నతఁడు
కన్నుల పండుగసేసీఁ గడనుండే
వెన్నెలనవ్వులు నీవు వెదచల్లఁగాఁ జూచి
మిన్నక మోమునసెల్లా మించీని కళలు

చ. 3: చివ్వన దగ్గరి నీవు శ్రీ వేంకటేశుఁ గూడఁగా
జవ్వనాన ఫలమంది సరుసనుండె
రవ్వగా సరసము నీరపముగా నాడఁగాను
బువ్వపువిందులు చేత భోగించే నిపుడు

రేకు: 0230-4 పాడి సంపుటం: 08-178

పల్లవి: చూడ నిట్టున్నాఁడవు సోదించి చూచితేను
మాడకు వేగురిఁదెచ్చే మతకమెరఁగను

చ. 1: తగిలి యెవ్వతెయైనాఁ దప్పక నిన్నుఁ జూచితే
జిగురంటినట్టేకాక చేరి పాసీనా
మగువ భ్రమయించును మగవాని నందురు
మగువల మించితివి మహిమలెరఁగను

చ. 2: నీఁటుకత్తె యెవ్వతైనా నీతోను మాటాడితే
వేఁటమేకమౌఁగాక వేరె పాసీనా
మాఁటల పందిలివెట్టు మానిని యందురుగాని
మాఁటల గుళ్ళుగట్టి మము నింతసేసేవు

చ. 3: పొలసితే నీ ముందరఁ బోరాక యెవ్వతైనా
వలలకు లోనేకాక వడిఁ దాసీనా
యిల లక్ష్మి శ్రీవేంకటేశ నీ వురమెక్కెను
మలసి నా వురమెక్కి మన్నించు టెరఁగను

రేకు: 0230-5 సాళంగం సంపుటం: 08-179

పల్లవి: మొగమోటమున నీకు మొక్కే నేను
తగవులఁబెట్టుకొని దగ్గర నున్నాఁడవు

చ. 1: నేరుపుగల మగువ నిన్నుఁ బిలిపించితేను
వోరుపుగలిగినాపె వొద్దఁ గూచుండె
మేర పరి నవ్వరాదు మెలుఁతను దూరరాదు
నీరువంకతుంగవలె నీవున్నాఁడవు

చ. 2: కన్నులు గొప్పలైనాపె గక్కన సన్నసేసితే
చన్నులు పిన్నలైనాపె చల్లె వలపు
నిన్నుఁ గైకొనఁగరాదు నెలఁతఁ బొమ్మనరాదు
అన్నిటా రొంపికంబమవై నీవున్నాఁడవు

చ. 3: ఆయాలు సోఁకించినాపె అట్టె నిన్నుఁ గూడితేను
మాయలు నేరిచినాపె మరిఁ గూడెను
యీయెడ శ్రీవేంకటేశ యిద్దరి మిమ్మనరాదు
పాయక నా వురముపై పంతాననున్నాఁడవు

రేకు: 0230-6 మెంచభౌళి సంపుటం: 08-180

పల్లవి: ఎవ్వరు బుద్ధిచెప్పేరు యిద్దరికి మీకు నిఁక
అవ్వల నివ్వల నీవే ఆదరించు మీపెను

చ. 1: మచ్చరపు సతులతో మారుమలతువుగాక
యిచ్చకపు సతితోడ నింతగలదా
తచ్చి నీకు కుంచవేసి తలవంచుకున్నదాపె
గుచ్చి నీవైతే మోనాన గుట్టుననున్నాఁడవు

చ. 2: పంతపు వనితలనె పైపై సాదింతువుగాక
చింతించే నీవద్దిచెలిఁ జిమ్మిరేఁతురా
మంతనాన విడెమిచ్చి మానాన మణిఁగీనాపె
రంతుల నీవైతేను రాజముచూపేవు

చ. 3: వేసాల మగువలతో విఱ్ఱవీఁగుదువుగాక
ఆసపడ్డకాంత నింత అలయింతురా
పాసిన కాఁకలుదీర పాదములొత్తీనాపె
శ్రీ సతీశ కూడితివి శ్రీ వెంకటేశుఁడవు

రేకు: 0231-1 కన్నడగౌళ సంపుటం: 08-181

పల్లవి: ఎవ్వరి నేమడిగేవు యేమని చెప్పేము నేము
జవ్వనపు నీ పంతము సంగడినేవున్నది

చ. 1: పడఁతి మాటలలోని భావము దెలుసుకొంటే
అడరిన నీ మోహమందేవున్నది
తడఁబడే మతిలోని తలఁపు దెలుసుకొంటే
విడువని నీ నేర్పు వెనకనేవున్నది

చ. 2: అంగన నవ్వునవ్విన ఆయము దెలుసుకొంటే
అంగవించే నీ భోగ మందేవున్నది
సంగడినాడే సరసములే తెలుసుకొంటే
చెంగటి జాణతనాలు నీ చేతిలోనేవున్నవి

చ. 3: యింతి కాఁగిలించుకొన్న యితవు దెలుసుకొంటే
అంతటివేడుక నీ యాత్మనున్నది
వంతుల శ్రీవెంకటేశ వనితఁ గూడితివిట్టే
మంతనాలన్నియు నీ మర్మములోనున్నవి

రేకు: 0231-2 రామక్రియ సంపుటం: 08-182

పల్లవి: ఇంక నేమిసేయఁగల మింతకంటే రావయ్య
అంకెల మా యింటిలోని కాసపడ్డవారము

చ. 1: అంగన లేమిటివారు ఆయము నీ చేనున్నది
సంగతెరిఁగి నడుపే సరవి నీది
వుంగిటిగాఁ గోపగింతు మొకమారు నవ్వుదుము
యెంగిలిమోవి బత్తేల నేలుకొన్నవారము

చ. 2: పడఁతు లెంతటివారు భావము నీ నేర్చినది
విడువక భోగించే వేడుక నీది
చిడుముడి జంకింతుము చెక్కు లట్టెనొక్కుదుము
తొడసోఁకిన జీతాలదొమ్మిపాఁజువారము

చ. 3: వనిత లెందలివారు వలపు నీ వసముది
ననుపుగాఁగూడిన యీ నటన నీది
కొనగోరంటింతుము మొక్కుదుము శ్రీ వెంకటేశ
వొనరిన నీ రతుల వూడిగపువారము

రేకు: 0231-2 ఆహిరి సంపుటం: 08-183

పల్లవి: మానినినింతే నేను మన్నించవలదా
యేనాట నావల్ల గుణమీపాటి చాలదా

చ. 1: తనువు నీకప్పగించి తమకాన భోగించఁగా
మనసేమి సోదించేవు మరియూనన్ను
ఘనులకు నిమ్మపండు కానుకగాఁ బెట్టితేనే
తనివొంది పదవులు తామే యొసఁగుదురు

చ. 2: చూపులు నీపైనిలిపి సుద్దులు నేఁ జెప్పఁగాను
తీపు లేమి వెదకేవు దిష్టించి నన్ను
యేపుమీరిన దొరలు యేపాటినుతించినాను
పైపై నందుకులోనై పమ్మి కరఁగుదురు

చ. 3: అన్నిరతులకులోనై అట్టే చొక్కించఁగాను
చన్నులేల గోరూఁదేవు సారెకు నన్ను
యిన్నిటా శ్రీవెంకటేశ యీకతలు నీచెలుల
కెన్నికతో నానతిమ్మా యిట్టే నిన్నుమెత్తురు

రేకు: 0231-3 మధ్యమావతి సంపుటం: 08-184

పల్లవి: ఇట్టె (నే?) సీసవెట్టి నీవు యేమరేనా నీపనులు
బట్టగుత్తలైనవారు ఫలమందుకుందురా

చ. 1: యేలుకొన్నవాఁడవు నన్నేల దిగవిడిచేవు
చేలకొంగువట్టి యింతసేతువుగాక
బాలకిపై యెంత సిగ్గుపడినాను నీకేమి
కూలిచ్చినవారు పనిగొనక విడుతురా

చ. 2: మాటలాడినవాఁడవు మన్నించ నేలపాయ్యేవు
వాటముగా నీ యిచ్చకకు వత్తువుగాక
నీఁటుతోడ వేడుకకు నిదించితే నీకేమి
గూంటనున్నపక్షి చేతవేఁటాడ లోఁగేరా

చ. 3: కూడినవాఁడవు నామై గోరూఁదకేల చిక్కేవు
మేడెపురతిఁ జొక్కించి మింతువుగాక
నీడనె శ్రీ వెంకటేశ నే నలసితే నీకేమి
వాడుఁజేన వానగురిసి వరదచాలించునా

రేకు: 0231-4 కన్నడగౌళ సంపుటం: 08-185

పల్లవి: హత్తి రాజసపువాఁడ వయినాఁగాని
చిత్తమువచ్చినయట్టు సేతువుగాని

చ. 1: చనవు గలిగేనంటా సారె సారె మాటలాడె
విని విని నీవేమి వేరకుమీ
మనసునఁ గలదెల్లా మరిదాఁచనే నీకు
మునుకొన్న సతులకు ముచ్చట స్వభావము

చ. 2: నిండిన మందెమేళాన నీతో సరసమాడేను
అండనే అందుకు లోనై అలయకుమీ
వుండిన దున్నట్టేకాని వూరకే కల్పించనోప
నిండు గరితెలాడితే నిజమునిష్టూరము

చ. 3: కాతరాన నిన్ను నిట్టే కాఁగిలించుక కూడితి
నాతమకములుచూచి నవ్వేవు సుమ్మీ
ఘాతల శ్రీవెంకటేశ కైకొంటివి నిన్ను దూర
రాతిరిఁబగలునుండి రతులఁ జొక్కితివి

రేకు: 0231-5 దేసాళం సంపుటం: 08-186

పల్లవి: అవునే యింతేసి సేసేవపుడే నీవు
చవులుసేసి యిచ్చేది జవ్వనమేకాదా

చ. 1: సిగ్గువడ్డవారికిని చెక్కిటి చేయేమరఁగు
దగ్గరి రాఁగదవే ఆతఁడు విల్చీని
కగ్గులేక నీవంటి కన్నెలేకారా పతిని
యెగ్గులుఁ దప్పులుసోఁక నెలయించేవారు

చ. 2: సెలవి నవ్వేవారికి చేతిమొక్కులే మరఁగు
తలఁగకుండఁగదే ఆతఁడు ముట్టీని
మొలచిన నీవంటి ముగ్ధలేకారా పతిని
తెలిపి రతికిఁదీసి తెమలీఁచేవారు

చ. 3: కాఁగిటఁగూడేవారికి కనురెప్పలే మరఁగు
వీఁగకువే కూడెను శ్రీవెంకటేశుఁడు
మాఁగినమోవి నీవంటి మానాపతులేకారా
రాఁగలై యీతనిఁ బొంది రవ్వకెక్కినారు

రేకు: 0232-1 సాళంగనాట సంపుటం: 08-187

పల్లవి: ఇన్నాళ్ళు నెరఁగమైతి మిదివో తాను
పన్నుక వూరక వొడఁబరచీఁ దాను

చ. 1: తలఁపే తెలిసితేను తాఁదానే కదవే
నలువంక నూరకే నవ్వీఁ దాను
వెలియల్లాఁ జూచితేను వెల్లవిరి గదవే
పిలిచి నాతో నానపెట్టుకొనీఁ దాను

చ. 2: అడుగఁబోతే సుద్దులు అంతా మేలేకదవే
కొడిమె లెంచేనంటేఁ గొంకీఁ దాను
చిడుముడి మొక్కితేను సిగ్గురేఁగీఁ గదవే
బడిబడి మీఁదటికి బాసచేసీఁ దాను

చ. 3: కన్నుల నేఁ జూచితేనే గట్టియాయ గదవే
యిన్నిటా శ్రీవెంకటేశుఁ డెనసెఁ దాను
విన్న వినికెల్లా నేఁడు వేడుకలే కదవే
మన్ననలు నాకిచ్చి మచ్చికాయఁ దాను

రేకు: 0232-2 ముఖారి సంపుటం: 08-188

పల్లవి: ఇందుకుఁగాఁ బ్రతివాదాలేలే విభుఁనితోడ
పందెమువలె గెలుపు పైపైనేవుండును

చ. 1: మచ్చికసేసీ నతఁడు మారుమాటాడకువే
కుచ్చిపట్టి కాఁగిలించికూడె నిన్నును
వచ్చిరాని పందెమువంటిదే యీవలపెల్లా
కొచ్చి లోలోఁ దలఁపంచుకొంటాఁ దానుండును

చ. 2: చెక్కులునొక్కీ నతఁడు చెమరించీ తిట్టకువే
పక్కన నిట్టేకాఁగిటఁబట్టీ నిన్నును
చక్కెరబొమ్మవంటిది చవిగొంటే నీవలపు
యెక్కడఁ జిక్కించుకొన్నా నింతాఁ దీపైవుండును

చ. 3: యేలెను శ్రీవెంకటేశుఁ డెగ్గులేమీ నెంచకువే
లాలించె రతులఁ బెక్కులాగుల నిన్ను
పాలజలధివంటిది పచరించిన వలపు
వేళ నెంతవాడినాను వెలితిగాకుండును

రేకు: 0232-3 రామక్రియ సంపుటం: 08-189

పల్లవి: ఏమనునో దగ్గరఁబో యీవేళ నేఁ జెనకితే
కామించి కామాంధకారాననున్నాఁడు

చ. 1: నవ్వు నవ్వనోప నానాలికాఁడు రమణుఁడు
అవ్వల నేమనునో యనీకాక
దివ్వెత్తుఁ బొద్దుదాఁకా తిరిగివచ్చి యింటిలో
వువ్విళ్ళూరుచు నసురుసురై వున్నాఁడు

చ. 2: పంతమాడనేర నాపల్లటీఁడు నాయకుఁడు
అంతరంగము దెలిసె ననీకాక
బంతుల చుట్టాలకెల్లా పనులెల్లా జేసివచ్చి
అంతటఁ బానుపుమీఁద నలసివున్నాఁడు

చ. 3: కమ్మి చూడనోప నాగబ్బిశ్రీవెంకటేశుఁడు
అమ్మలాల నన్నుఁ గూడె ననీకాక
సమ్మతించి సతులతో సాములుసేసివచ్చి
కుమ్మరింపు సిగ్గులతో గుట్టుననున్నాఁడు

రేకు: 0232-4 సౌరాష్ట్రం సంపుటం: 08-190

పల్లవి: నామర్మమిట్టిది యిఁక నీమర్మమానతీరా
యీమేరఁజూచినవారి కెంతబంటోయిఁకను

చ. 1: మక్కువ నీతో నేను మాటలాడినంతలోనే
పుక్కిటిబంటె (టా?) యరా పూఁచి వలపు
చెక్కుల చెమటలెల్లా చెరువుల వానలాయ
యిక్కడ నన్నుఁ జూచి నీకెంతబంటో యిఁకను

చ. 2: కన్నుల నీరూపుచూచి కరఁగి గుండెలుమోఁచి
చన్నులబంటె(టా?)యరా సరివలపు
వున్నతిఁ మోవితేనియ లుప్పిళ్లూరఁగఁ జొచ్చె
యిన్నిటా నా జోడైతి వెంతబంటోయిఁకను

చ. 3: కలసి నీవద్ద నేను గట్టిపీఁటపై గూచుండి
మొలబంటియాయరా యిమ్ములవలపు
కులికి శ్రీవెంకటేశ కూడితివి వయోమద
మెలిమి మడుగులుబ్బె నెంతబంటోయిఁకను

రేకు: 0232-5 కొండమలహరి సంపుటం: 08-191

పల్లవి: ఇన్నాళ్లునెఱఁగమైతి మింతేసిసుద్దులు
విన్నవి రాఁగారాఁగా వెల్లవిరులాయను

చ. 1: మంతనాన నీతోను మాటలు నేనాడినని
యింతులెల్లా నాడుకొనే రిదేమయ్యా
చెంతల నీవింతేసి సిగ్గులు విడిచితేను
కాంతలు నీతో పొందుగావించుటే నేరమి

చ. 2: రతివేళ నామేనరచించిన నీచేఁతలు
సతులెల్లా సోదించేరు సారెసారెకు
యితవై నీవాడికకు యింతేసి వెరవకున్న
హితులూడిగాలు సేయనేఁటికి నీయెడకు

చ. 3: ననుపున నీవు నేను నవ్వినవ్వులకును
వనితలెల్లా మెచ్చేరు వద్దనున్నట్టే
యెనసితివి శ్రీవెంకటేశ నన్నింతేసిగాను
చనవరులకును మజ్జాతియాయ నిపుడు

రేకు: 0232-6 ముఖారి సంపుటం: 08-192

పల్లవి: జిగురువంటివాఁడవు చెలులంగటే విడువవు
అగపడి యింటివారు అన్నంతాఁ గలిగెను

చ. 1: చిక్కని నీమాటలకే చెమరించె మే నెల్లా
తక్కిన చేఁతలు వింటే తలఁపెట్టౌనో
అక్కజపు నీవినయ మాయనాయఁ దనిసితి
మొక్కేనన్నా విడువవు మొలవట్టేవిపుడు

చ. 2: వెడ నీ నవ్వులకే వెరగందె నిలువెల్లా
అడరి నీవద్దనుంటే నాస యెంతౌనో
మిడిమాలపు నీమెచ్చు మేలుమేలు కైకొంటి
వడి నోపనన్నాఁబోవు వచ్చి కాఁగిలించేవు

చ. 3: కన్నుల నీచూపులకే గరివడఁ బులకించె
చన్నుల నిన్నొత్తితేను చవి యేరీతో
పన్నిన శ్రీ వెంకటేశ బాపు బాపు కూడితిమి
సన్నసేసినాఁ గొంకవు సారె మన్నించేవు

రేకు: 0233-1 శంకరాభరణం సంపుటం: 08-193

పల్లవి: నేరుపరి విన్నిటాను నీకు నే లోను
కారముగాదు కప్రము కానీవయ్యా

చ. 1: పలుకనేరిచితేను బయలెల్లాఁ బందిలి
చలము సాదించితే శశియేరవి
యెలమి నీమాటలకు నెదురాడగలనా
కలసి కాఁగిలించేవు కానీవయ్యాయిఁకను

చ. 2: వేసరక నిలిచితే వేఁగైనఁ జలువే
రాసి దంచదొరకొంటే రాయేపండి
ఆసపడి నీ వున్నందు కడ్డయీడఁగలనా
కై సేసుక నన్నంటేవు కానీవయ్యా

చ. 3: గారవించి కూడితేను కాఁగిలే చెమటనీరు
గోర గీరఁబోతేను గుంతేయేరు
సారపు శ్రీవెంకటేశ సన్న సేయఁగలనా
కారణానఁ గూడితివి కానీవయ్యా

రేకు: 0233-2 నాట సంపుటం: 08-194

పల్లవి: ఏఁటికి దగ్గరేవయ్యా యిదేమి నీవు
మోఁటుననుందానఁ జన్ను మొనలు దాఁకీని

చ. 1: పచ్చని చీరగట్టిన బలుదొరనంటానే
కుచ్చుల పీలిచుంగుల కొంగువట్టేవు
దిచ్చరి చెంచువారికి దేవరకు నేమిపని
ముచ్చట లాడఁగఁ జన్నుమొనలు నాఁటీని

చ. 2: రొమ్మునఁ బూసగల వురుటు నాయఁడనంటానే
బమ్మరపోవుచు మాపై నొరగేవు
దొమ్ముల మేసువారికి దొడ్డవారి నేఁటిమాట
ముమ్మాటికి విను చన్నుమొనలు దాఁకీని

చ. 3: వెక్కసపుకొండపై శ్రీ వెంకటేశుఁడనంటానే
కక్కసించికూడి మమ్ముఁ గాఁగిలించేవు
తక్కక మంకువారికిఁ దగు గొల్లఁడ నీపొందు
మొక్కలీఁడ నాచన్ను మొనలు దాఁకీని

రేకు: 0233-3 భైరవి సంపుటం: 08-195

పల్లవి: మఱి యేమి సేసునే మంచివే యన్నిపనులు
వెఱపులెల్లాఁ దీర వేఁడుకొనీఁగాక

చ. 1: ఆసగలిగినవాఁడు ఆతఁడు నీయడకును
వేసరునా మీఁద మీఁద వేడుకేకాక
రాసికెక్క నంతేసి రతి నలయింతువట
మోసపోయీనా నీకు మొక్కేఁగాక

చ. 2: పైపై వలచినవాఁడు పంతపు నీచేతలకు
కోపగించునా మరిఁ గోరేదేకాక
తీపుమోవితేనెలిచ్చి తెలిపి చొక్కింతువట
వోపననినా నిన్ను వొడఁబరచీఁగాక

చ. 3: కాఁగిటఁ గూడినవాఁడు కడు నీచెనకులకు
లోఁగీనా యెంతైనా లోఁగొనీఁగాక
చేఁగదేరఁ గూడితివి శ్రీ వెంకటేశ్వరునట
దాఁగీనా నీ యింపులకుఁ దమకించీఁగాక

రేకు: 0233-4 శ్రీరాగం సంపుటం: 08-196

పల్లవి: అలయఁగఁ బొద్దులేదా అప్పటినీకు
చలివానె లేవయ్య జాగులెందాఁకాను

చ. 1: అంగమెల్లఁ జెమరించె నట్టే గందము గరఁగె
సింగారించుకొన్న కొప్పు చీఁదరరేఁగె
యెంగిలి వాయఁగ నీకు నిదే జలకమువట్టె
సంగతిగా లేవయ్య జాగులెందాఁకాను

చ. 2: పులకలు గడునిండె బుసకొట్లు చెలఁగె
తెలుపెక్కి కనుచూపు తేటవారెను
బలుపుసత్తువరాను పాలునేయిఁదెచ్చితిని
సళుపక లేవయ్య జాగులెందాఁకాను

చ. 3: మోమునఁ గళలుముంచె మోవిపై చేఁతలురాఁగె
నామితో శ్రీ వెంకటేశ నన్నుఁ గూడితి
చేముట్టిచ్చే మాటుమందు చెనకుల నాతోపొందు
జామాయను లేవయ్య జాగులెందాఁకాను

రేకు: 0233-5 సామంతం సంపుటం: 08-197

పల్లవి: ఆసతి మరఁగువాఁడ వన్నిటా నీవు
మోసపోక నీవాపె ముదులదేరాదా

చ. 1: చేపట్టేవు నీకు నేఁ జెప్పినట్టు సేసేఁగాని
ఆపె నడిగి రారాదా ఆమాటే
దూపిలేవు నీచేఁతకుఁ దొరలకుందాననంటా
చాపలాన నీవాపెను సమ్మతింపించరాదా

చ. 2: పైకొనేవు నీకు నేఁ బనులుసేసేఁగాని
ఆకాంతఁ దోడితేరాదా అప్పణగాను
కాకరివై దూరేవు గక్కన విడెమీనంటా
పోకులఁబోక నీవాపెఁ బూఁటవెట్టరాదా

చ. 3: పూవులవేసేవు నీకు పొందైవుండేఁగాని
ఆవనితఁ గూడరాదా అప్పుడే ముందే
శ్రీ వెంకటేశ నన్నుఁ జెందితివి ఆలనంటా
కావించే(చా?) పెకుఁ జెల్లెలిఁగా నన్నుఁ జేయరాదా

రేకు: 0233-6 గౌళ సంపుటం: 08-198

పల్లవి: ఎవ్వరికిఁ గలదయ్య యిటువంటి నేరుపు
దవ్వులనుండఁగా నీవు తావులిచ్చేవు

చ. 1: వెలఁదు లెవ్వరిఁగన్నా వింతలేదుగాన నీకు
సులభాననే దొరకుఁ జుట్టరికము
మలసి చల్లలమ్మక మందనుండిరాఁగానే
కలపుకోలుఁదనానఁ గాఁగిలించేవు

చ. 2: అంగనలఁ గంటే వావులట్టే నీకు దొరకుఁగా
చెంగటనే చెట్టడువఁ జేటఁడేసి
ముంగిటనే పాలుగాఁచి మూలఁ దోడంటువెట్టఁగా
సంగతిగా నప్పుడే మంచమువంచేవు

చ. 3: పొరుగు సతులుండితే పొరచి వేడకలౌఁగా
దొరకొలుదాసికిఁ బొందులు దాఁతే
యిరవై శ్రీవెంకటేశ యిటు నన్నుఁ గూడితివి
తెరవేసి వలపుల తీపుచల్లేవు

రేకు: 0234-1 కేదారగౌళ సంపుటం: 08-199

పల్లవి: ఎందువోయితి విందాఁకా యెక్కడనుండె నీనేర్పు
బందెకు నప్పుడాతని పట్టుకుండవలదా

చ. 1: నేనాతనితో నవ్వితే నీకేలే చింత
నాననిచ్చి నీవూఁ గొంత నవ్వరాదా
సానఁబెట్టె(ట్ట?)తఁడు చూపు జళిపించేయపుడు
మానుపరాదా నీమగని సన్నలను

చ. 2: చెక్కాతని నేనొక్కితే చిమిడేవదేమే
చిక్కనిచ్చి నీవూఁ జేఁత సేయరాదా
మక్కువ నాతఁడు నామర్మమంటేయపుడు
నిక్కి కోపగించరాదా నీపతినెమ్మెలను

చ. 3: కలసితే నీవితని గద్దించే వెవ్వతవే
వలసినప్పుడు నీవూ వంచుకోరాదా
యెలమి శ్రీవెంకటేశుఁ డెలయించేయపుడు
వలపించి నీవిభుని వంకలొత్తరాదా

రేకు: 0234-2 సాళంగం సంపుటం: 08-200

పల్లవి: నీయితవు దెలియక నే వేగిరపడరాదు
యీయెడ నీయాలనై యింటనే వుందానను

చ. 1: సారె నేనవ్విన నవ్వు చలువో వేఁడో
ఆరీతి నీమతిఁ గలట్టానఁ లేవయ్యా
నీరుకొద్ది తామరనై నీతోఁ బొందుసేసేను
పేరబెట్టితేవలపు పిండంతేనిప్పటి

చ. 2: పలికేటి నామాట పలచనో చిక్కనో
అలరి నీకుఁ దోఁచినట్టానతీవయ్యా
బలిమికొది పంతానఁ బట్టి నిన్నుఁ బెనఁగేను
వలచినవలపులు వచ్చినంతేలాభము

చ. 3: కూడినట్టి నాకూటమి కొసరో పిసరో
ఆడినంతా నియ్యకొనే నానతీవయ్యా
వేడుక శ్రీవెంకటేశ వెన్నకొద్దేనెయ్యీ
తోడరాఁగా వలపులు తరినంతేవాకిలి

రేకు: 0234-3 సామంతం సంపుటం: 08-201

పల్లవి: వలెగా యివిగొన్ని వట్టివేసాలు
అలసితివన్నిటాను ఆయనాయలేవే

చ. 1: చిక్కని చెమటలకే సిగ్గులు వడేవు నీవు
యెక్కువనిట్టూర్పులకు నేమి సేసేవే
నెక్కొన్న రతిచిన్నలు నీతలనే వేగనటే
ముక్కునబంటి భోగించే ముగుదువా నీవు

చ. 2: అలకల చెదరకు నట్టే సిరసు వంచేవు
యెలమిఁ గన్నులతేట లెందుఁబెట్టేవే
నెలకొన్న యీవన్నెలు నీవల్లనే వచ్చెనటే
కలగంపగాఁ గలసే కన్నెవానీవు

చ. 3: బొట్టు చెదరినందుకు పొంచి తెరలు వేసేవు
యిట్టె నీమోము కళలెట్టు దాఁచేవే
నెట్టన శ్రీవెంకటేశు నీవేకూడితివటే
పటము గట్టక పొందే చాలవా నీవు

రేకు: 0234-4 ఆహిరి సంపుటం: 08-202

పల్లవి: తప్పులెంచవని నిన్ను దగ్గరితి నిటుగాక
వొప్పగించే బీరాల కోపుదునా నేను

చ. 1: చిక్కని నీనవ్వులకు చేసేటి చేతలకు
యెక్కువగా నింతేసి మోహించితిఁగాక
తక్కుల నీగుట్లకు తచ్చన సన్నలకు
వొక్కమాఁటే యీపనులకోపుదునా నేను

చ. 2: కన్నుల నీమొక్కులకు కరుణారసానకు
కన్నెనయ్యే నీకు తాళి గట్టితిఁగాక
మిన్నక నీమేకులకు మేరలు మీరుటకు
వున్నతి నీరాఁపులకు నోపుదునా నేను

చ. 3: కలిసితివి రతికిఁ గడలేని మన్ననకు
పిలిచి నీకే సేస వెట్టితిఁగాక
యెలమి శ్రీవెంకటేశ యిట్టి నీవినయాలకు
వొళవుగా సిగ్గువడ నోపుదునా నేను

రేకు: 0234-5 మాళవిగౌళ సంపుటం: 08-203

పల్లవి: ఇంక నెంతగాఁగలదో యింతివల్ల నీకు
సంకుఁజక్రాలచేతుల సరుసకువచ్చెను

చ. 1: నల్లగలువలవంటి నాతిచూపు నీమైనంటి
నల్లనాయ నిలువెల్లా నాథుఁడ నీకు
వెల్లువైన వలపులు వేడుకల నీపైసోఁకె
వెల్లియేరు పాదముతోఁవిభుడవు నైతివి

చ. 2: బంగారువంటి రూపుపడఁతి పొందు సేయఁగ
బంగరుదట్టిగురుతుపతివైతివి
సంగతిగాఁ దామరలసరవిపాలుమోఁచి
అంగజగురుఁడ జలజాక్షుఁడవైతివి

చ. 3: వేవేలుమాటలనేర్పువెలఁది కాఁగిటఁగూడి
వేవేలు పేళ్ళు గలిగె వెన్నుఁడ నీకు
భావించఁ గొండలవంటి బలు కుచములునాఁటి
శ్రీ వెంకటేశుఁడవై సిరుల మించితివి

రేకు: 0234-6 భైరవి సంపుటం: 08-204

పల్లవి: సంగతి గానిపనికి సాకిరున్నారా
అంగవించి విడెమీఁగా నదేమంటిఁగాక

చ. 1: సమ్మతించినమాటకు జగడములున్నావా
దొమ్మిసేసి యంటఁగానె దూరేఁగాక
యిమ్ముల నేరమంటే యిప్పుడే లేదనేనా
అమ్మరో యిల్లుచొరఁగా నదేమంటిఁగాక

చ. 2: చుట్టరికము గలితే సూడువట్ట వచ్చేనా
వెట్టికఁ బైకొనఁగాను వేసరేఁగాక
గట్టిగానె నవ్వితేను కాదని తొలఁగేనా
అట్టె సందుకొనగాను అదేమంటిఁగాక

చ. 3: తొలుతనె చెప్పితేను తొలమని తోసేనా
బలిమిఁ బెనఁగఁగాను పదరేఁగాక
యెలిమి శ్రీ వెంకటేశుఁ డిన్నిటా నన్నుఁగూడెను
అలయించఁగా రతుల నదేమంటిఁగాక

రేకు: 0235-1 బౌళిరామక్రియ సంపుటం: 08-205

పల్లవి: కూరిమి సిగ్గులు తెగీ కొంకనేఁటికి
యేరీతికైనా నీవు యియ్యకొనవయ్యా

చ. 1: పట్టినదే వ్రతము పడఁతులకుఁ జలము
అట్టె పతులకుఁ జేయకపోరాదు
అట్టడి యాపె మోవిచూఅలకు నాసపడేవు
యెట్లైనఁ జేయనీ నీవియ్యకొనవయ్యా

చ. 2: ఆడినదేమాటా అంగనలు పంతమున
నాడోడికయినా వినకపోరాదు
తోడనే మేలుది యాపె తొలఁగలేవు నీవు
యేడసుద్దికైనా నీవియ్యకొనవయ్యా

చ. 3: తలఁచినదే పొద్దు తరుణుల కాఁగిటికి
వలపులు ముదిరెను వద్దనరాదు
బలువాపెది శ్రీ వెంకటపతివి నిన్నుఁ గూడె
యెలమి నన్నిటికి నీవియ్యకొనవయ్యా

రేకు: 0235-2 పాడి సంపుటం: 08-206

పల్లవి: ఒట్టువెట్టుకొంటే నేమి వొద్దు దోసములేదనె
వట్టిచింతఁ బొరలక వద్దికి రారాదా

చ. 1: మలసేయప్పటివేళ మాటమాటజగడాల
అలిగి లేచిపోయితే నందుకేమి
వెలినుండి నీవేల విరహనఁ బొరలేవు
చలమొద్దు నావద్దికి సరుగ రారాదా

చ. 2: నినుఁ జూచి నవ్వితేను నిజము నెరపెనంటా
గునిసి యల్లంతనే కూచుంటివి
మనసు పట్టగలేక మరియేల పొరలేవు
చనవుసేక నామంచానకు రారాదా

చ. 3: వేడుక యీరతి నీవె వేళమె ముందుగరఁగి
తోడనె సిగ్గులఁబొంది దూరుకొనేవు
యీడకేతెంచి శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
మాడమాడ పంతములా మరియు రారాదా

రేకు: 0235-3 భైరవి సంపుటం: 08-207

పల్లవి: మూసినముత్యాలవంటి ముద్దరాండ్లము
యీసరిబేసికి నీతో నెదురాడఁగలమా

చ. 1: బలిమేలసేయను పలుకకుండినవారి
అలిగేటివారులేరా ఆఁడువారు
చలపట్టి మాటలాడ జాణలులేరా వూరిలో
యెలమి నీతో నేము యెదురాడఁగలమా

చ. 2: సిరసేలయెత్తను సిగ్గువడివున్నవారి
జరసేటివారులేరా సారెనింతులు
దొరవై పనులుగొన తొత్తులు బంట్లులేరా
యిరవై నీతో నేము యెదురాడఁగలమా

చ. 3: కొంగులేలపట్టను గుట్టుననుండినవారి
కంగివున్నవారులేరా కామినులు
రంగుగ శ్రీవెంకటేశ రతి నన్నుఁగూడితివి
యింగితాన నీతో నేము యెదురాడఁగలమా

రేకు: 0235-4 కాంబోది సంపుటం: 08-208

పల్లవి: పుట్టుభోగిజవరాలు పొలఁతి యిది
పట్టెమంచముమీఁదటఁ బవళించేదెపుడు

చ. 1: కందువ నీకిందాఁకా గతులు చెప్పనేపట్టె
యెందాఁకా వేగించు నింతి నీతోను
అందముగ నిలుచుండి ఆకుమడిచియ్యఁబట్టె
కుందణపు గద్దెమీఁదఁ గూచుండేదెపుడు

చ. 2: వూడిగాలుసేసి నీవొద్దనుండనేపట్టె
యేడగాఁ గొలువుసేసు నెదుట నీకు
పాడితోఁ బందెమువేసి పగడసాలాడఁబట్టె
ఆడనే పరపుమీఁద నలపారే దెపుడు

చ. 3: గక్కన నీవు గూడఁగా కన్నుల జంకించఁబట్టె
యెక్కడగా సన్నసేసు నింతేసి నీకు
చక్కని శ్రీవెంకటేశ సమ్మతించుకొనఁబట్టె
వొక్క మలగుపై నొరగుండి నవ్వేదెపుడు

రేకు: 0235-5 సామంతం సంపుటం: 08-209

పల్లవి: అట్టె కానీవయ్య నేము నట్లానె సేసేము
గట్టియైన సతులకుగాని నీవు లోఁగవు

చ. 1: కామించి నీవాకిలి గాచుక నేనుండఁగాను
నామొగము చూచి నీకు నగవురాదా
వేమరుఁ బంతములాడి వెసఁ బసులఁ గాపించే
గామిడి గొల్లెతలకుఁగాని నీవు లోఁగవు

చ. 2: యేపొద్దును నీరూపే యెగదిగఁజూడఁగాను
నాపొంతనేవుండి నీకు నగవురాదా
చేపట్టి మానాలుచూడ చెట్టెక్కించి వేళలు
కాపించే గొల్లెతలకుఁగాని నీవులోఁగవు

చ. 3: యెనసి నీకాఁగిటిలో యేపొద్దూ నేనుండఁగాను
ననుపైతే నీకింతేసి నగవురాదా
మును శ్రీవెంకటేశ యమునలోనాటలాడించే
ఘనమై గొల్లెతలకుఁగాని నీవు లోఁగవు

రేకు: 0235-6 గుజ్జరి సంపుటం: 08-210

పల్లవి: అప్పుడే గెలిచితివా ఆపె వూరకుండితేనే
తప్పులు నీమీదివెల్లా దాఁచుకిట్టేవున్నది

చ. 1: పలుకనేరదుగాని భావములోనిచేఁత
బెళకకుండా నట్టె పెట్టుకున్నది
అలుగకున్నదిగాని అనువువచ్చినదాఁకా
చలములు యేకతాన సాదించనున్నది

చ. 2: జంకించకున్నదిగాని జగడాలు కొనగోళ్ళ
యింకనెప్పుడోయని మీఁదెత్తుకున్నది
కొంకి తిట్టదేకాని గురియైన రతిదాఁకా
పొంకపు బూతుమాటలఁ బూఁచుకున్నది

చ. 3: గుట్టువిడవదుగాని కొసరుల మొక్కులెల్లా
దట్టమై నీపాదాలకు దాఁచుకున్నది
యిట్టె శ్రీవెంకటేశ యెనసితివిందాఁకా
అట్టెవున్నది నీతలపుఁ లడుగఁగనున్నది

రేకు: 0236-1 పాడి సంపుటం: 08-211

పల్లవి: ఇందుకుఁగా నెవ్వర మరేమిసేసేరు
మందెమేళమోపకున్న మరియూ మొక్కేను

చ. 1: చనవు గలుగఁగానె చవిగాక వలపులు
మనసు లెరవులైతే మరిచప్పనే
యెనసితివంటా నిన్ను నిట్టె తిట్టితిఁగాక
పెనచి యెగ్గుపట్టితే బెరసి మొక్కేను

చ. 2: నగఁగానె సరసాన నయమెక్కుఁ దీపులు
సొగయకుండితేఁ దమచూపులేవెట్ట
తగిలితివంటా నీముందల నేముట్టితిఁగాక
బిగువంతగలిగితే పిలిచి మొక్కేను

చ. 3: మెఱసి కూచుండగానె మేకొను కూటములు
గుఱుతులు సోఁకకున్న కూడదువాని
నెఱి శ్రీవెంకటేశ మన్నించఁగా గూడితిఁగాక
తఱి నలసితినంటే దగ్గరి మొక్కేను

రేకు: 0236-2 శ్రీరాగం సంపుటం: 08-212

పల్లవి: మిక్కుటపు సరసాలు మించి మొగచాటయ్యా
దక్కినట్టి కాఁపురానఁ దనిసివున్నారము

చ. 1: కొలువుపతిమెలెల్లా గోడచేరువులెకాక
కలయిక రతులకుఁ గారణమేమి
వల దేల గొంగువట్టీ వద్దనరే రమణుని
తలఁగక కన్నులనే తనిసివున్నారము

చ. 2: తోడునీడ సతులెల్లా తోలుబొమ్మలెకాక
వేడుక కూటములకు వెలవెట్టేరా
చూడకు మనరె వొత్తి సొలపులనాయకుని
తాడుపడ్డ ఆసలనే తనిసివున్నారాము

చ. 3: సిగ్గుపడ్డ కాంతలెల్లా చిత్తరురూపులెకాక
దగ్గరి చేతలు సేయ దమయాటలా
అగ్గమై శ్రీ వెంకటేశు నన్నిటా మీరుమెచ్చరే
తగ్గక నేఁడిట్టెకూడె తనిసివున్నారము

రేకు: 0236-3 లలిత సంపుటం: 08-213

పల్లవి: ఏలపంతాలాడేవు యింతితోను
ఊలు గరగించే నిన్ను ఊట్టుసేయవచ్చునా

చ. 1: మాటల దూరఁగలేక మగువ గోర నొత్తితే
నాఁటెనంటా నీవేల సన్నలఁ దిట్టేవు
చాటిచెప్పె నింతేకాక సాదుఁగొయ్యతనమున
జూటుఁ దనమున నిన్నుసూడువట్టవచ్చెనా

చ. 2: బొమ్మల జంకించలేక పువ్వుల వేసితేను
తమ్మిమోము దాఁకెనంటాఁ దట్టేవు రొమ్ము
చిమ్మి నవ్వితేనె మాయసిగ్గుతోడి చిత్తమున
అమ్మరో నీతోడి చయ్యాటలకువచ్చెనా

చ. 3: వేసరింపించఁగలేక వెసనిన్నుఁగూడితేను
సేసకొప్పు జారెనంటాఁ జెలరేఁగేవు
ఆసల శ్రీ వెంకటేశ ఆపె నీవు నొక్కటే
బాసలు నీవిచ్చినవి విచారించవచ్చెనా

రేకు: 0236-4 రీతిగౌళ సంపుటం: 08-214

పల్లవి: కతలు పూవకపూచె కావకకాచె
రతుల మెప్పించేఁగాని రారాదా లోనికి

చ. 1: చింతలేదు వింతలేదు చెక్కుచేతితో నేను
పొంత నీరూప తలపోసేనదే
మంతనాన నీవేల మాటలనే తనిసేవు
రంతులుసేయక యింక రారాదా లోనికి

చ. 2: వాడాలేదు పీడాలేదు వచ్చేవంటా నీరాకకు
తోడనే యెదురుచూచే తొలఁగకిదే
యేడగా నాకు నిట్టె యిచ్చకాలాడేవు నీ
రాడువచ్చి ముంతచొచ్చె రారాదా లోనికి

చ. 3: యీసులేదు రేసులేదు యిపుడునీవుగూడఁగా
ఆసల నలపుదేరే నన్నిటానిదే
సేసవెట్టేదెందాఁకా శ్రీ వెంకటేశ నీవు
రాసికెక్కితివిన్నిటా రారాదా లోనికి

రేకు: 0236-5 ఆహిరి సంపుటం: 08-215

పల్లవి: ఏమిసేసినాఁ జేయనీ యియ్యకొనవే
వేమరు నింతగలదా విభునితోను

చ. 1: వచ్చినట్టె వచ్చితేను వలుపేపో సుఖము
హెచ్చి మాటలాడితే నెరఁగఁగాని
కుచ్చిపట్టి నాయకుఁడు కొంగువట్టి తియ్యఁగాను
పచ్చిగానుఁ బెనఁగేవు పాసివుండఁ గలవా

చ. 2: చెప్పినట్టు సేసితేను చిత్తమేపో చుట్టము
యెప్పుడూ నొడ్డారమైతే నెరఁగఁగాని
వొప్పుగా నాయకుఁడు వొడఁబరచఁగా నీవు
తప్పులెంచే వప్పుటిని తాలిమికిఁ గలవా

చ. 3: మెట్టినట్టె మెట్టితేను మీకు మీకేపెండ్లి
యిట్టె సిగ్గులు వడితే నెరఁగఁగాని
వొట్టుక శ్రీవెంకటేశుఁ డొనగూడె నిన్నును
గుట్టుతోడ నవ్వేవు గురిసేయఁ గలవా

రేకు: 0236-6 శుద్దవసంతం సంపుటం: 08-216

పల్లవి: సవతి మచ్చరమున సతులదూరితి నేను
పవళించనేల నీకుఁ బంతమిచ్చేమయ్యా

చ. 1: నిన్నునంటినట్టివారు నీయంతవారు
యెన్నియైనా నేము వెంగే లేలాడేము
చిన్నఁబోవ నీకేల చిత్తమురాకున్నఁ గన
పన్నివారిమారు నీకుఁ బంతమిచ్చేమయ్యా

చ. 2: నీవూడిగములవారు నీకంటె ఘనులు
వేవేలకు వారినేల వేసరించేము
నీవు వాడనేలందుకు నేఁడుగావలసితేను
భావించి వారికి నీకు బంతమిచ్చేమయ్యా

చ. 3: నీసరిభోగపువారు నీవారు మాకును
వీసమంత పనికేల వేరు సేసేము
యీసుదీర శ్రీ వెంకటేశ మమ్ముఁగూడితివి
బాసతో నీ కింతైతే పంతమిచ్చేమయ్యా

రేకు: 0237-1 నాదరామక్రియ సంపుటం: 08-217

పల్లవి: ఎచటనుండివచ్చితి వెదురుచూచితి నీకు
రచనమన్నించి నన్ను రవ్వగాఁజేసితివి

చ. 1: కొండలరాయఁడ నన్నుఁ గోరి వలపంచితివి
నిండు నాతలపోఁతలు నీకె శలవు
దండి విరహము రేఁచి తడవేలసేసితివి
అండనే నాచిరుఁజెమటది నీకె శలవు

చ. 2: కోనేటివిభుఁడ నన్ను గురుతుగానేలితివి
నేనెట్లనుండినాను నీకె శలవు
ఆనుకొని యింతేసి ఆసలనె పెట్టితివి
పూనిన పులకమోపులు నీకె శలవు

చ. 3: శ్రీవెంకటేశుఁడ నన్ను సేసవెట్టి కూడితివి
నీవద్ద నలసినది నీకె శలవు
కైవసము చేసుకొని కందువఁ జొక్కితివి
యీవిధాల నేభోగించే దిది నీకె శలవు

రేకు: 0237-2 ముఖారి సంపుటం: 08-218

పల్లవి: కప్పురవిడెమియ్యఁగాఁ గాదనరాదు
తప్పులేదు నీయందు తగిలితి నిన్నును

చ. 1: చెచ్చెర నీవు చేసినచేఁతలు వింటి నీవిందు
వచ్చెనని చెప్పగా వద్దనరాదు
యిచ్చకములాడేవారి నిటు రమ్మందురుగాన
విచ్చేయుమా యింటికిట్టె వింటిమి నీమాఁటలు

చ. 2: చెంగట నీసతిఁగంటి సిగ్గువడి అంతలో నా
కొంగువట్టగా నిన్నుఁ గోపించరాదు
ముంగిట వేఁడుకొంటేను మొగమోడుదురుగాన
అంగవించె రావయ్య అలుకలు దేరెను

చ. 3: యెంచుకొంటి నీగుణాలు యిందరఁజూడఁగా నా
కంచముపొత్తుకు రాఁగాఁ గాదనరాదు
అంచెల శ్రీవెంకటేశ అట్టె నన్నేలితిగాన
యించుకించుకె నవ్వేను యియ్యకొంటిసుద్దులు

రేకు: 0237-3 రామక్రియ సంపుటం: 08-219

పల్లవి: ఏఁటికి విచారమిఁక నాకు
కూటములే నను గురిసేసీని

చ. 1: యేపున నేనేమి నెఱఁగకుండినా
నీపయి తలఁపులు నేర్పీని
మాపుదాఁక మైమఱచివుండినా
దాపగు వలపులు తలపించీని

చ. 2: అసురుసురయి నేనటు కనుచొక్కిన
కొసరి కలలు మేల్కొలిపీని
ముసరుసిగ్గులె మోనాననుండిన
పస నీపదములె పాడించీని

చ. 3: అలమితి రతి నేనలసినాను నీ
తెలిమోవి దప్పిదేర్చీని
యెలిమిని శ్రీవెంకటేశ నాకడమ
గలిగినా నీదయగాచీ నన్నును

రేకు: 0237-4 శ్రీరాగం సంపుటం: 08-220

పల్లవి: ఊడిగాలు సేసుకొంటా నుండనీవయ్యా
దాడివెట్టినిన్నుఁ బట్టేదాన నీకుఁబ్రియమా

చ. 1: చెప్పినట్టె యెపనైనాఁ జేయఁగాఁ గొంగు వట్టేవు
వుప్పటించె యీపనైతే నోపఁగలనా
ముప్పిరిగొన్నసతులు ముయ్యేడువారున్నారు
తప్పులు నిన్నుఁ బట్టేటి దానను నేఁబ్రియమా

చ. 2: లోనైనీకు నుండఁగాను లోనింటికిఁ బిలిచేవు
కోనల నిందుకు నియ్యకొనఁగలనా
రానిపోని మూలలను రాణివాసాలున్నవారు
తానకమై మారుకొనేదాన నీకుఁబ్రియమా

చ. 3: గందము నీకుఁ బూయఁగాఁ గాఁగిలించి కూడితివి
అందుకొని యింత అలయఁగఁ గలనా
యిందుకే శ్రీ వెంకటేశ యిదే గోపికలున్నారు
దందువంటి రాజపుదాన నీకుఁ బ్రియమా

రేకు: 0237-5 ముఖారి సంపుటం: 08-221

పల్లవి: సిగ్గువడ నీకేల చింతలేలా
తగ్గు మొగ్గులేలా నీకు తలవంచ నేఁటికి

చ. 1: విన్న కన్న సుద్దులెల్లా వెల్లవిరి సేసేనంటే
కన్నుల జంకించి చూచి కాఁతాళించేవు
అన్నినీమొకదాకిరి నాతుమలోఁ బెట్టుకొంటే
చిన్ని సెలవుల నాకు చిరునవ్వయి ముంచెను

చ. 2: నానాటికి నీగుణాలు నానించి కడిగేనంటే
కోనల ముంజేయివట్టి గోరనొత్తేవు
పాని నీపై మచ్చరము పండ్లఁ బెట్టుకుండితేను
మోనాన వాండ్లెక్కి నీమోవిమీఁద నిండెను

చ. 3: సారిది నీమనసిది సోదించి మెచ్చేనంటే
కరఁగి కరఁగి యట్టే గారవించేవు
గరిమ శ్రీవెంకటేశ కలసితి మొక్కేనంటే
తరితీపులై చేతికి తలఁబాలై నిండెను

రేకు: 0237-6 దేసాళం సంపుటం: 08-222

పల్లవి: చిఱుత నవ్వులేల సిగ్గులు వడఁగనేల
గుటిఁ దలరాయి సేసుకొంద మిఁకలేవయ్యా

చ. 1: చెప్పఁబోతేఁ బసలేవు చేసిన నీచేఁతలివి
యిప్పటి చీఁకటితప్పులివియేకాని
వుప్పటించి యాడకుండా వూరివారికెల్లాను
చప్పుడుజాగంటవేసి చాటుదములేవయ్యా

చ. 2: నవ్వఁబోతేఁ బసలేదు నడవడి లోననెల్లా
పువ్వుల కురపిదానిఁ బొందుటేకాని
రవ్వ నిన్నుఁ జేయకుండా రచ్చలోని వారికెల్లా
అవ్వల లేకలువ్రాసి అంపుదము లేవయ్యా

చ. 3: పట్టఁబోతేఁ బసలేదు పైపై నీనేరమి
వొట్టి చీరలుదీసిన దొక్క టేకాని
నెట్టన శ్రీ వెంకటేశ నీవు నన్నేలితివి నీ
చుట్టాలకు గురిసేసి చూపుదములేవయ్యా

రేకు: 0238-1 బౌళి సంపుటం: 08-223

పల్లవి: నీతోనేల దూతికకు నిష్ఠూరము
ఆతరుణి వచ్చి మరి అన్నిఁజూచుకొనీని

చ. 1: యిప్పుడేలకోపించేవు యింతితో నొకమాఁటు
చెప్పుమన్న మాఁటలాపె చెప్పెఁగాక
తప్పులేదు నీయందనీ దానికైనా సంతోసించు
ముప్పిరిగాఁ గలవెల్లా ముందరనయ్యీని

చ. 2: గద్దించనేల నీకు కామినిని వేళచూడ
వద్దికిఁ బొమ్మనగాఁను వచ్చెఁగాక
సుద్దుల నీకులోనయ్యీ చుట్టము జేసుకోయిఁక
తిద్దుకొనేవారు గల్తే తేరీఁ దగవులు

చ. 3: వాదులాటలేల నీకు వనిత నీగుణమిట్టె
సోదించి రమ్మనఁగాను సోదించెఁగాక
యీదెసఁ గూడితివి నీవింతలో శ్రీవెంకటేశ
పోదిగా నాపెఁగూడె పొసఁగె నీపొందులు

రేకు: 0238-2 పాడి సంపుటం: 08-224

పల్లవి: వట్టి వలపులుచల్లి వనితలఁ గొసరేవు
పట్టకు నీవంతేసి బలిమేల వొట్టేవు

చ. 1: చిక్కని తేనెలవంటి చెలియమాటలె నీకు
చెక్కుచేతి చింతలకు జిగురైయంటె
యెక్కడ నెవ్వతెయైనా నేల నీమనసు వచ్చీ
చక్క నూరకుండవయ్య సటలేల సేసేవు

చ. 2: పల్లెతాడువంటి వనితచూపులు నీకు
వుల్లముకోరికలకు నురులైనిల్చె
యెల్లకాంతలుండినాను యేల నీవు మెచ్చేవు
బెల్లించకువయ్య లేనిప్రియాలేల చెప్పేవు

చ. 3: కందువ చక్కెరవంటి కాంతకెమ్మోవి నీకు
మందులై నీకాఁగిటికి మరులుగొల్పె
యిందరి శ్రీవెంకటేశ యిటు నన్నూఁగూడితివి
చందాలు సేయకువయ్య చవులేల చూపేవు

రేకు: 0238-3 కన్నడగౌళ సంపుటం: 08-225

పల్లవి: మంచివాఁడె నావిభుఁడు మగువలాల
వంచుకోవలసి తానె వలపంచెఁగాకా

చ. 1: మొగముచూచినవాఁడు మొదలఁ దానె కదవె
నగవురాఁగా వెనక నవ్వితిఁగాని
యెగసక్యపుదానవా యిందరు నెరఁగకుండ
అగడు సేయవలసి అనీనింతెకాకా

చ. 2: కాఁగిలించుకొన్నవాఁడు గట్టిగఁ దానె కదవె
పాఁగిన మచ్చాలు మరి పట్టితిఁగాని
రాఁగతనముదాననా రాసికెక్కిన్నాళ్లాయ
వేఁగుసేసి మోచిదించ వింతసేసీఁగాకా

చ. 3: చేరి కూడినట్టివాఁడు శ్రీవెంకటేశుఁడె కదె
ఆరయ నేనిపుడు నంటితిఁగాని
బీరములదాననా పెడ్లి నేఁడెఆయ
సారెసారెవేఁడుకొంటా చనవిచ్చీఁగాక

రేకు: 0238-4 వరాళి సంపుటం: 08-226

పల్లవి: వేడుకకాఁడవు నీకు వెరుపలయ్యా
పాడిదప్పక యిచ్చేవు పంతాలేలయ్యా

చ. 1: కావరించి వేగినంతా కలిగిన పనులెల్లా
వేవేలుఁ జేసివచ్చి వెరుపేలయ్యా
వోవరిలో నాచేతికి వొంటిఁజిక్కి యిప్పుడిట్టె
వోపలబెట్టెనంటా వొట్లేలయ్యా

చ. 2: అంది పొంది వాడలోన అందరి యిండ్లనెల్లా
విందులారగించి వచ్చి వెరుపేలయ్యా
బందెఁజిక్కినట్టు మాపరువుపైఁ బవళించి
సందడిలో వారి వీరి సాకిరులేలయ్యా

చ. 3: అచ్చముగా నన్నుఁ గూడి అన్నిటా శ్రీవెంకటేశ
విచ్చనవిడాయ నింక వెరుపేలయ్యా
మచ్చెము చిక్కెను నీమనసు నామీఁదను
వొచ్చెములెల్లాఁ దీరె నొడఁబాట్లేలయ్యా

రేకు: 0238-5 దేసాళం సంపుటం: 08-227

పల్లవి: ఆడుకోకు నీకునీవే అంతేసి పంతాలు
జాడతోడ మరినవె చాలునయ్య యిఁకను

చ. 1: నిగమములై తేను నిలువఁ బెట్టేవాడవు
మగువలతోఁ గల్ల మాటలాడేవా
అగడై అసురకాంతలందుకు సాకిరున్నారు
జగతి సత్యము లవె చాలునయ్యా యిఁకను

చ. 2: పెరిమ యజ్ఞభాగాలు పెద్దవై ఆరగించేవు
అరిది వెన్నలు ముచ్చి లారగించేవా
యిరవై గొల్లెతలెల్లా నిందుకు సాకిరున్నారు
సరి నట్టి విశ్వాసాలె చాలునయ్య యిఁకను

చ. 3: జమళి నవ్వుతా నాకు చాఁచె హస్తాలు నీవి
కొమరెలనంటి యెత్తుకొని వచ్చేవా
సమరతి రుకుమిణి సాకిరి శ్రీవెంకటేశ
సముకమైతిమి బొంకుచాలునయ్య యిఁకను

రేకు: 0238-6 దేవగాంధారి సంపుటం: 08-228

పల్లవి: ఎట్టున్నదో నీచిత్తము యెరఁగ విన్నవించేను
గుట్టున నేనుండితేను కోపముగాదుసుమ్మీ

చ. 1: యెగ్గులేక పతితోడ నెటువంటి వేళనైనా
సిగ్గె మూలధనము చెలులకును
వొగ్గి నీవు సారె సారె నొడివట్టి తియ్యఁగాను
దగ్గర రానైతి నిది తప్పుగాదుసుమ్మీ

చ. 2: యివ్వల మగవారితోనె మాటలాడినాను
నవ్వె మూలధనము నాతులకును
మవ్వపు సరసమున మానము సోఁకనాడఁగా
రవ్వగాఁ గేరితి నిది రాఁపుగాదుసుమ్మీ

చ. 3: సారెఁ గొప్పంటిన ప్రాణసఖునితోఁ జెనకఁగ
వోరుపె మూలధనము వువిదలకు
కోరిక శ్రీవెంకటేశ కూడి నన్ను మెచ్చఁగాను
ధీరతనుండితి నంతదిట్టఁగాను సుమ్మీ

రేకు: 0239-1 హిందోళవసంతం సంపుటం: 08-229

పల్లవి: ఆయనాయ నుండవయ్య అన్నియుఁగంటిమి నేము
చేయి చేతఁ బట్టియ్యఁగా సిగ్గువడవలదా

చ. 1: నిగ్గుల నీవంటివారు నిజమాడి బతుకఁగా
కగ్గినవేళల నేము కల్లలాడేమా
బగ్గన నంటివి నీవు బమ్మచారి నంటాను
వెగ్గళించి పదారువేలు సతులుండఁగా

చ. 2: పలుమారు నీవె యింత పంతము లాడుకోఁగా
కెలన నేమిఁక మరి కిందుపడేమా
పొలసి విఱ్ఱవీఁగేవు పరుషుఁత్తముఁడనంటా
వొలిసి లకిమమ్మ నీవురమెక్కివుండఁగా

చ. 3: పైపై శ్రీవెంకటేశ పాదము నీవు చాఁచఁగా
యేపున మొక్కేవారమిప్పుడు నేమా
దాపుగ నన్నుఁగూడి ధర్మాలు బోధించేవు
రూపై యెత్తుకవచ్చిన రుకుమిణివుండఁగా

రేకు: 0239-2 భైరవి సంపుటం: 08-230

పల్లవి: ఊరకే గడించుకొని వొక్కటొక్కటే తాను
మారుకొంటినంటాఁ దానే మతకానఁ జూచీనే

చ. 1: తనివిదీరక వెనుతగిలితే నాయకుఁడు
యెనసి నే నమ్మనంటా నెగ్గుపట్టీనే
చనవు చేసుక మరి సరిఁ గొంగువట్టితేను
పెనఁగి పోనియ్యనంటా పెక్కులాడీనే

చ. 2: చుట్టముఁజేసుక తన్ను సుద్దులెల్లా నడిగితే
పెట్టుకుండె నెపాలంటా బీరాలెంచీనే
వొట్టిన యాసలతోడ వొళ్ళు గాఁగిలించుకొంటే
అట్టె బలిమి సేసితినంటా దూరీనే

చ. 3: కందువ రతికేళికి గడియ నేఁ బెట్టితేను
యిందరి నంటసీవంటా నింత సేసీనే
అందపు శ్రీవెంకటేశుఁ డప్పటిఁ దన్నుఁగూడితె
పొందుల భ్రమించెనంటా పూఁచి నవ్వీనే

రేకు: 0239-3 సామంతం సంపుటం: 08-231

పల్లవి: మీలోనే కలిముదిరి మేడి దాయను
జాలిదీర నెటువలె సరసమాడేవే

చ. 1: కప్పురమువంటి నవ్వు కారీని సెలవుల
గొప్పగొప్పకన్నులను కోపమేఁటికే
కుప్పె సవరపుపతిఁ గొప్పువట్టి తీసితివి
దెప్పరపు చేఁతెల్లాఁ దీరుచుకొనేవే

చ. 2: పుట్టి తేనెవంటి మాటలూరీని పెదవుల
తిట్టులు నాలికె నెట్టు దీకొలిపేవే
పట్టి బంగారుపాదుక బలిమి మేననూఁడితి
యిట్టి పంతమాతనికి నెట్టుదిద్దేవే

చ. 3: రీతి జిరుగువంటిది రేకలు నీమేన నివే
జాతిచన్నులనెట్టొత్తి అట్టుసేసేవే
యీతల శ్రీవెంకటేశు నెనసితి వింతలోనే
నీతితో యిప్పుడెట్లా నీవుమొక్కేవే

రేకు: 0239-4 సౌరాష్ట్రం సంపుటం: 08-232

పల్లవి: ఇదివో నీదొరతన మేఁటిదయ్యా
అదనాయ నేనేమైనా నాడఁజెల్లునయ్యా

చ. 1: నాదిక్కుఁజూచీ నాపె నవ్వి తలవంచేవు
యీదెస నీ జాణతన మేఁటిదయ్యా
ఆదిగో నాపె దూతికనై వచ్చితి నీవద్దికి
పాదుగా నన్నింతసేసి పరాకై తివేమయ్యా

చ. 2: మచ్చాలువేసీ నాపె మాటలాడేవు నీవైతే
యిచ్చట నీ జాణతన మేఁటిదయ్యా
నెచ్చెలింటికి రమ్మంటే నీవు నన్ను ముట్టితివి
అచ్చలాన గుట్టుసేసేవదేమయ్యా

చ. 3: వెల్లవిరిసేసీ నాపె వింత నీ జాణతనాలు
యిల్లిదె శ్రీవెంకటేశ యేఁటిదయ్యా
తొల్లె యాపెఁగూడి జెల్లెల నన్నూఁగూడితి
వుల్లసాన మెచ్చేవు నీ వుపమిదేమయ్యా

రేకు: 0239-5 రామక్రియ సంపుటం: 08-233

పల్లవి: చలము రేఁగేదెల్లా సవతుల కింతేకాక
నెలకొనె నాతఁడితే నెరవేరెనే

చ. 1: ఘాతల నందరితోడ కడు నవ్వులు నవ్వేవు
చేతికి లోనాయఁ బతి చెల్లులేవే
పోతరించి యప్పటి నిప్పుడు మారుమలసేవు
నీతితో నాతఁడుమేలు నీకె మేలే

చ. 2: చెనకుచుఁ బగటుతో చెలరేఁగి వుందానవు
అనువాయ నీ బొగట (డ?) లౌలేవే
కనుసన్నఁ జెలులతో కమ్మర మాటాడేవు
చనవు నీకాతఁడిచ్చె జయము చేకొంటివే

చ. 3: తావున నాకును మంచితనములు నెరుపేవు
శ్రీ వెంకటేశుఁడే బుద్ధిచెప్పిలేవే
వేవేలకు రాజసాన విఱ్ఱవీఁగే వన్నిటాను
కైవసమాయ నాతఁడె ఘనురాలవౌదువే

రేకు: 0239-6 నాదరామక్రియ సంపుటం: 08-234

పల్లవి: నిచ్చలు సేవలుసేసి నేనే వేసరితి
అచ్చలానఁ దనకంటే అలసితిని

చ. 1: కన్నుల కాఁకలుదీర కప్పురము చరమవే
యెన్నిక నెవ్వతెకో యెదురుచూచె
సన్నలుచేసిన చేయి సకియరో పిసుకవే
పన్ని సారె వంచి వంచి బడలినాఁడు

చ. 2: పెదవికిఁ బదనురాఁ బిలిచి పన్నీరివే
కదిసి యెవ్వతెకో కతలు చెప్పి
పొదిగినమేనఁ దట్టుపునుఁగయినాఁ బూయవే
మదనగరిడి సదమదమైనాఁడు

చ. 3: వురముమీఁదికి నిట్టె వుపచారాలు సేయవే
మొరసి చన్ను మోపు మోఁచినాఁడు
యిరవై శ్రీవెంకటేశుఁ డెనసె నాకాఁగిట
మరిగించి నన్నిట్లా మన్నించినాఁడు

రేకు: 0240-1 దేశా(సా)క్షి సంపుటం: 08-235

పల్లవి: కానీవయ్య దానికేమి కర్తవు నీవు
తానకమైతిమి యింకా దండనుండేమయ్యా

చ. 1: చతురుఁడ వన్నిటాను సముకాన నున్నదాన
రతికిఁ బిలువవంటా రవ్వసేసేనా
గతి నీమో మాకు మరి కాఁతాళించి సేసేదేమి
తతివచ్చినందాఁక దండనుండేమయ్యా

చ. 2: నేరుపరి వన్నిటాను నీకుఁ గట్టితి నేఁ దాళి
చేరి మాటాడకున్నాఁ జెచ్చెరఁ దిట్టేనా
కోరినకోరిక నీవు గుంపించి సేసేదేమి
తారుకాణైనదాఁకా నీదండనుండేమయ్యా

చ. 3: బలువుఁడ వన్నిటాను పట్టితి వ్రతము నీకు
అలయఁ గూడితి విఁక నొఁగాదనేనా
యిల శ్రీ వెంకటేశుఁడ మెప్పుడూఁ జేసేదేమి
తలఁపు నిలుపు దాఁకా దండనుండేమయ్యా

రేకు: 0240-2 నారాయణి సంపుటం: 08-236

పల్లవి: ఇల్లాండ్లెరిఁగిరా యింతేసి సోదించ
కల్లలు నిజాలుసేయఁ గడకూ నేరుతువు

చ. 1: చెప్పరాని కూరిమితో చేరి నావద్దనుందువు
యెప్పుడో ఆపె యింటికి నేఁగి వత్తువు
చొప్పులు నీమేన నవె చూపి చెప్పరాదు మాయ
నెప్పున నీవొళ్లి కల్ల నీవె యెరుఁగుదువు

చ. 2: అరిది నాపొత్తున నీవారగించె వుండుదువు
సరినాపె విందెప్పుడో చవి చూతువు
సరవులె అట్టున్నవి చాటిచెప్ప గురిలేదు
నిరతపు నీసుద్దులు నీవె యెరుఁగుదువు

చ. 3: శ్రీ వెంకటేశ నన్నె చేకొని కూడుండుదువు
యేవేళనో కాఁగి లాపె కెరవిత్తువు
భావనలె యింతెకాని పచారించరాదు మరి
నీవిధములన్నియును నీవె యెరుఁగుదువు

రేకు: 0240-3 లలిత సంపుటం: 08-237

పల్లవి: ఏడఁజూచినా నీకు నేమి బాఁతి
ఆడానీడాఁ దిరుగఁగా నగ్గువాయ వలపు

చ. 1: చెంగావిమోవి నీది సెలవి నవ్వులు నావి
యెంగిలి పొత్తులపతి వేమనేమయ్య
కొంగు వట్టేవేల నీవు కొనవేలు నేఁ బట్టగా
జంగిలి సతులకెల్లా చవుకాయ వలపు

చ. 2: చెక్కుల రేకలు నీవి సిగ్గుల రాసులు నావి
యెక్కిరింత పతివైతి వేమనేమయ్య
కక్కసించేవు రతికి కడుఁదమకించే నేను
చక్కని యింతుల మీఁద జాజరాయ వలపు

చ. 3: గుట్టుతో నలపు నీది కూడిన కాఁగిలి నాది
యిట్టి శ్రీవెంకటపతి వేమనేమయ్య
పట్టేవు నాకుచములు పయ్యద నేఁగప్పఁగాను
జట్టిగొన్న మొక్కులకు సందేఁడాయ వలపు

రేకు: 0240-4 కేదారగౌళ సంపుటం: 08-238

పల్లవి: నీకంటె వేగిరము నిండు నావేడుకలివి
కైకొనేఁగాని పయ్యద గప్పనియ్యవయ్యా

చ. 1: చెప్పినట్టు సేసేఁగాని చెక్కు నొక్కనియ్యవయ్య
ఆ(అ?)ప్పుడె నవ్వేఁగాని మోవాననీవయ్య
దప్పులు దేరిచేఁగాని తమ్ముల మిడనీవయ్య
గుప్పేగాఁని వలపులు గోరొత్తనీవయ్య

చ. 2: సమ్మతించి వుండేఁగాని చన్నుల నొత్తనీవయ్య
తెమ్మగా మొక్కేఁగాని తిట్టనీవయ్య
కుమ్మరించేఁగాని మేలు కొప్పువట్టనీవయ్య
చిమ్మేఁగాని సిగ్గులెల్లాఁ జెనకనీవయ్య

చ. 3: యెదురు మాటాడఁగాని యేకతము వినవయ్య
అదను చెప్పేఁగాని అంటనీవయ్య
పాదిగేఁగాని అలసి బుసకొట్టనీవయ్య
యిదివో శ్రీవెంకటేశ యెనసితివయ్యా

రేకు: 0240-5 కాంబోది సంపుటం: 08-239

పల్లవి: ఇంతేసి సేసేదెల్లా నిందు కొరకా
పంతము నెరపఁబోయి భ్రమసేవు నీవును

చ. 1: చనుఁగవ దాఁకించేవు సారెఁ బాదపువేలను
గునుకుచు నీపల్లికి గొలిచిరాఁగా
తనువెల్ల జెమరించి తప్పక నిన్నుఁ జూచితే
కనుఁగొనలతేటలఁ గరగేవు నీవును

చ. 2: కుచ్చులపై నుమిసేవు కోరి నీతమ్మరసము
నెచ్చెలిచేకాళాఁజి నేఁబట్టఁగా
ముచ్చటతో సిగ్గువడి మోవ నిన్నుఁ దిట్టితే
అచ్చుమోవఁ బరవస మందేవు నీవును

చ. 3: చెక్కు మోవినంటించేవు చేవదేరిన యాసతో
కక్కసించి నీవూడిగాలు సేయఁగా
అక్కుపై శ్రీవెంకటేశ అలమేల్మంగను నేను
గక్కననే యలసేవు కలయుచు నీవును

రేకు: 0240-6 బౌళి సంపుటం: 08-240

పల్లవి: కప్పురమిచ్చితే నీకుఁ గారమాయనా
యిప్పుడు నీభాగ్యానకు నేమిసేసునే

చ. 1: చెలిమిచేసేవేళ చెక్కునొక్కి వేఁడుకొంటే
అలిగి విభుఁనిఁ దిట్టే వదేమె నీవు
కొలఁదిమీరి తప్పి కొనగోరు దాఁకితేను
యెలమి నింతలో నితఁడేమి సేసునే

చ. 2: చేరి బుద్ధిచెప్పేవేళ చెవిలో మాటాడితేను
ఆరయఁ దప్పక చూచే వదేమె నీవు
మారులేక అవియె నీమర్మములు సోఁకితేను
యీరీతి నింకా నితఁడేమి సేసునె

చ. 3: మోవితేనె విందువేళ మొనపల్లు సోఁకితేను
ఆవల చూచి నవ్వేవు అదేమె నీవు
నీవె అలమేల్మంగవు నిన్నేలె శ్రీవెంకటేశుఁ
డీవేళను ఆయ నాతఁడేమి సేసునే

రేకు: 0241-1 సామంతం సంపుటం: 08-241

పల్లవి: వింత లాపెవద్దనుండి వినీఁ గాని
యింతయు మాతో నానతియ్యవయ్య నీవు

చ. 1: చెప్పినట్టె సేసి తెలిసిగ్గువడి వున్నదింతె
అప్పుడె మెచ్చేఁజుమ్మీ ఆపె నిన్ను
కుప్పరగంధి మతిలోఁగలమాట నేమాడేము
చెప్పేమాటలు మాతోనె చెప్పవయ్య నీవు

చ. 2: మన్నించితి వన్నిటాను మనసు వచ్చెవున్నది
కన్నులనె మొక్కెఁజుమ్మీ కాంతనీకు
సన్నలు సేసినమోల్లా సరినేము దెలిపేము
యిన్నియు మాకుత్తరము లియ్యవయ్య నీవు

చ. 3: కాఁగిటఁ గూడితి విదె కైకొనె నలమేల్‌మంగ
ఆఁగి వురమెక్కెఁజుమ్మీ ఆపె నిన్నంటి
వీఁగము శ్రీవెంకటేశ విన్నవించే మిఁక నీతో
పోఁగు వోఁగుఁ బొంద మమ్ముఁ బొందించుమీనీవు

రేకు: 0241-2 పాడి సంపుటం: 08-242

పల్లవి: దేవుఁడు దేవియు నదె తెరదియ్యరె
పూవులదండలు దీసి పువ్వులియ్యవే

చ. 1: కన్నుల నిద్దురదేర గక్కన మేలుకొని
వున్నతి మొకాలు చూచే రొకరొకరు
పన్నీ రందియ్యరె పావడలు నందియ్యరె
గన్నునఁ గాళాంజి దగ్గరఁ బట్టరే

చ. 2: నగవులు నగుకొంటా నంటున లేచి కూచిండి
వొగిఁ గురులు దిద్దే రొకరొకరు
తగ నద్దాలు చూపరె తతితో బాగాలియ్యరె
వొగరుదేరఁ గస్తూరి వుండ లియ్యరే

చ. 3: బిగ్గిఁ గాఁగిలించుకొంటా ప్రియములె ఆడుకొంటా
వొగ్గిరి రతులకును వొకరొకరు
అగ్గమై శ్రీవెంకటేశుఁ డలమేలుమంగాఁ గూడి
వెగ్గళించే రలపార విసరరే యిపుడు

రేకు: 0241-3 రామక్రియ సంపుటం: 08-243

పల్లవి: గడుసుఁదన మేఁటికి కలికి మోనమటే
తడవకున్న దిట్టతన మిదియనఁడా

చ. 1: పంతమాడరాదుగాక పతితోడ సతికిని
అంతరంగమైనఁ గొంత ఆనతీరాదా
మంతుకెక్కి వద్దనుండి మారుత్తరాలియ్య విదే
కాంతుఁడు నీకిదియెల్లా గర్వముగాఁ జూడఁడా

చ. 2: తిట్టరాదుగా కతనిఁ దేరిచూచి నీకింతేసి
తెట్టెలుగా మొక్కఁగాను దీవించరాదా
చెట్టవట్టి పెనఁగఁగాఁ జెప్పఁగదే వినయాలు
గుట్టుతోడ నుండితేను కుచ్చిత మిదనఁడా

చ. 3: బాధించరాదుగాక బడి శ్రీవెంకటేశ్వరుఁ
బాదుగాను మెచ్చి మెచ్చి పాడరాదా
యీదెస నలమేల్మంగ వెనసితి వితని
పోదితో నిటుగాకున్న పొరపొచ్చ మెంచఁడా

రేకు: 0241-4 దేసాళం సంపుటం: 08-244

పల్లవి: అన్నిటికిఁ గలవట అందుకులేవా నీవు
నిన్ను నీవె యెంచుకొంటే నేరవా యీపనులు

చ. 1: నవ్వులకు నొకమాట నంటున నీతో నాడితే
యివ్వల నందుకుఁగాను యెగ్గుపట్టేవు
రవ్వనవాఁడవుగావా రాజవుగావా మున్నే
అవ్వల నెంచిచూచితే నందుకునుఁ దగవా

చ. 2: చెలిమితో నొకమాఁట చెక్కుచేత నూఁదితేను
కలఁగి నీలోనీవే కాఁతాళించేవు
వలపు నీసొమ్ముగాదా వాడికవాఁడవుగావా
అలవాటు నీకులేదా అందుకునుఁ దగవా

చ. 3: చనవుల నొకమాఁటు చన్నుల నేనొత్తితేను
కొనచూపులనే చూచి కూడితి విట్టే
విను శ్రీ వెంకటాద్రి గోవిందుఁడవు నీవుగావా
అనిపించుకో మాచే నందుకునుఁ దగవా

రేకు: 0241-5 శుద్ధదేశి సంపుటం: 08-245

పల్లవి: కాఁతాళించి వున్నది నీకడ సుద్దులెల్లా విని
చేఁతలేమిఁ జూపక చేరి వూరకుండుమీ

చ. 1: వనిత నీచిత్తము రావలసి యిందాఁకాను
వొనర నన్నిమాఁటలు నోరిచెఁగాని
చెనకి నీవె యిఁక చేతులెత్తి మొక్కినాను
కొనచూపులలుగులఁ గుచ్చి యెత్తుఁ జుమ్మీ

చ. 2: అతివ నిన్ను మెప్పించె అందుకొర కిందాఁకాను
చతురత మోనములు జరపెఁగాని
యితవుగా నీవె యిఁక నిచ్చకము లాడినాను
రతిరాజు గుఱ్ఱాల నోరనే తోలుఁజుమ్మీ

చ. 3: చెలి నీవు గూడిన యీసిగ్గున నిందాఁకాను
మొలకనవ్వులు లోలో మొరఁగెఁగాని
నెలవై శ్రీ వెంకటేశ నీవె యెంతవేఁడుకొన్నా
తలిరు మోవిపైని ముద్రలు వెట్టుఁజుమ్మీ

రేకు: 0241-6 సాళంగం సంపుటం: 08-246

పల్లవి: మేమొక జాడవారము మీరలేము మీమాటలు
ఆమాటలు నెరపితే నందరికి సమ్మతా

చ. 1: పోఁడిమి నాశాంతాలు పొగడేవు సారె సారె
నాఁడె నీవిచ్చిన బుద్ధి నాకుఁ గద్దుగా
కోఁడి నన్ను లోనుసేసుకొని నీయిచ్చఁ దిరిగి
ఆఁడుజాతి కిదేచాలు అంటె వారోరుతురా

చ. 2: పిలిచి నన్నిందరిలో పెద్దరికము సేసేవు
తొలుతె చేపట్టితిగా తూరి రక్షించ
యిల నన్నొడఁ బరచి యిందరినిఁ బెండ్లాడి
పొలమెల్లా నిట్టె చుట్టుకొంటె వారోరుతురా

చ. 3: కూడి నన్ను నారతులె గురుతులు సేసాడేవు
జోడు గద్దుగా నిన్నుఁ జూపి చెప్పను
యీడనె శ్రీవెంకటేశ యేలితివి నన్ని (న్ను?) సూటి
వాడకెల్లా నేర్పెనంటె వారిందు కోరుతురా

రేకు: 0242-1 సాళంగనాట సంపుటం: 08-247

పల్లవి: ఆడ నీడ నుండఁగా నిన్ననేఁగాక
కూడి యిట్టె వుండితేను కోపగించేనా

చ. 1: నామొగము చూడుమా నగితేనె కానవచ్చీ
నీ మనసులోననున్న నిజముఁ గల్లా
యేమతకములు నేల యింతేసి ఆనలేల
నామంచముమీఁద నుంటే నమ్మ నే ననేనా

చ. 2: ముమ్మారునాడుమామాట మొదలనే తెలిసెను
కమ్మిన నీచేఁతల కపటాలెల్లా
సమ్మతించు మననేల చలము సాధించనేల
యిమ్ముల మాయిచ్చనుంటే యీాసడించేనా

చ. 3: కాఁగిలించుకుండుమాకాఁక లోనెముంచుకొని
ఆఁగి పెదవి దడిపె ఆసలెల్లాను
వీఁగనేల యిఁకను శ్రీవెంకటేశ కూడితివి
పాఁగి యిట్టె నెలకొంటె బాసలాడిగేనా

రేకు: 0242-2 వరాళి సంపుటం: 08-248

పల్లవి: ఆసపడ్డవారికి నలమట సేయకిఁక
రాసికెక్క మన్నించి రక్షించవయ్యా

చ. 1: నీమొగము చూచి చెలి నిట్టూర్పు నిగుడించె
యేమో అడుగవయ్య యేకతానను
సాముహార సెలవినె నవ్వులు లోలోనదాఁచీ
దీమసాన తలఁపెల్లాఁ దెలుసుకోవయ్య

చ. 2: చేతికి విడెమిచ్చి చెమరించీ మేనెల్లా
యేతున నేమడిగెనో యియ్యవయ్య
ఆతుమలోఁ గోరి కోరి అట్టె నివ్వెరగందీ
కాతరాన నట్లానె కానిమ్మనవయ్య

చ. 3: దగ్గరఁ గూచుండి యదె తలవంచీ సిగ్గుపడి
వెగ్గళించ కిఁకఁ దెరవేయవయ్య
కగ్గక శ్రీవెంకటేశ కాఁగిట నిన్నింతి గూడె
వొగ్గినరతులకు నీ వొడిగట్టవయ్యా

రేకు: 0242-3 ఆహిరి సంపుటం: 08-249
పల్లవి: విచ్చి చెప్పె నిదె నీకు వివరముగా నేఁడు
నెచ్చెలి నిన్నిటికిని నేనేగురి సుమ్మీ
చ. 1: అంగవించి నీతో మాటలాడక యిట్టెవున్నది
అంగన చిత్తము దెలియఁగఁ గలవా
యెంగిలిమోవితోడ నేమిమాటలాడినాను
పంగించె యెంతైనా నంటుపాయదంటాఁ జుమ్మీ
చ. 2: తరుణి యెదుటనె తలవంచుక వున్నది
వెరవున నీపెను నవ్వించఁ గలవా
సరసము లాడితేను జంగిలి కడుపులోనఁ
దొరలితేనది గడుదోసమనీ సుమ్మీ
చ. 3: కామిని శ్రీవెంకటేశ కాఁగిటఁ గలసె నేఁడు
చేముంచి ఆకారణము చెప్పఁగలవా
వాములై యెవ్వతెకైనా వయసు మీఁదువోతేను
దీమసాన నిన్నే నిందింతురంటాఁ జుమ్మీ

రేకు: 0242-4 శుద్ధవసంతం సంపుటం: 08-250

పల్లవి: అందుకెపో నిన్ననేది అన్నిటా నేను
యెందుకైనా వెరవవు యెప్పుడూ నీవూ

చ. 1: నివ్వటిల్ల నాకైతె నిన్నుఁ జూచినప్పుడెల్లా
నవ్వులె గనమాయ నానాటికి
జవ్వనపువాఁడవు సవరనివాఁడవు
రవ్వలకు వెరవవు రచ్చలనెల్లాను

చ. 2: తాటించి నిన్ను నేను దగ్గరిన యప్పుడెల్లా
మాటలె గనమాయ మరి నోరికి
నీటుతోడివాఁడవు నేరుపరివాఁడవు
యేటికైనా వెరవవు యీడా నాడను

చ. 3: అంకెల నిన్నుఁ గాఁగిట నలమిన యప్పుడెల్లా
జంకెనలె మిగిలెను సారె సారెకు
పొంకపు శ్రీవెంకటేశ పురుషోత్తముఁడవు
లంకెలకు వెరవవు లలనలయెడను

రేకు: 0242-5 నాదరామక్రియ సంపుటం: 08-251

పల్లవి: ఇంకా నేమిగావలె నిట్టె ఆనతివయ్య
జంకించఁగాని నీసలిగె చూపెను

చ. 1: మతకము నేరఁగాని మంతనాన నీతోను
చతురతమిగులఁ గొర నేరుతు
బతిమాలనోపఁగాని పంతపు నీరతివేళ
నితవై నీచెప్పినట్టు యేమైనాఁ జేసేను

చ. 2: వాదించరాఁగాని వన్నెలుమెరసి నీతో
ఆదిగొని సరసము లాడవచ్చేను
సాదించవద్దుగాని చల్లని నీకాఁగిటిలో
సాదువలె నీకతలు సమ్మతించేను

చ. 3: కోపగించఁగాని నిన్నుఁ గూరిమి శ్రీవెంకటేశ
కాఁపురము సేసి నీపక్కనె వుండేను
యేపున బింకము లేల యిట్టె నన్నుఁ గూడితివి
తీపుల మోవిమాటలఁ దేనె వూసేను

రేకు: 0242-6 ముఖారి సంపుటం: 08-252

పల్లవి: పదరకువె యింకాఁ బనిగలదు
కదియుట నిన్ను నాపై కాఁతాళముగాదా

చ. 1: కన్నుల నవ్వితే నేమె కాఁకలు చల్లితే నేమె
వన్నెల మాయింటికి రావలెఁగా తానూ
యెన్నిలేవు వానియెమ్మె లెవ్వరుండిరో వద్దను
నిన్ను నాతఁడేమనినా నన్ను నంటగాదా

చ. 2: సేలు వెట్టితే నేమె చేతులు ముట్టితే నేమె
వాసుల నామోము చూడవలెఁగా తాను
వేసాలు నెరపనీవె వీడెపు మదమో యేమో
బాసికము నీకిచ్చిన పని నాకేకాదా

చ. 3: ఆడ నిన్నంటితే నేమె అట్టె తావచ్చితే నేమె
వాడుమోము నాకుఁ జూపవలెఁగా తాన
యీడనె శ్రీవెంకటేశుఁ డెనసెఁ గదవె నన్ను
వేడుకలక్కడివి నాతోడి తమేకాదా

రేకు: 0243-1 శ్రీరాగం సంపుటం: 08-253

పల్లవి: తొల్లిటి సుద్దులకుఁగా దూర నేఁటికి
పల్లదా లన్నియునాడి పంతమిచ్చేఁ జాలును

చ. 1: చెక్కునబెట్టిన చేయి సేపట్టినట్టి చేయి
వొక్క టెకాదా మన సొందు రెండాయ
నిక్కి తానేమి సేసునె నేఁడు నాభాగ్యముగాక
మొక్కితి ననవె తానె మొకమోడె నాకును

చ. 2: అప్పుడు నవ్విన మోము అలిగిన మారుమోము
యెప్పటిదెకాదా యించుముంచాయ
తప్పులు తనందునేవె దైవము చేఁతలుగాక
కప్పురము గానుకీవె కరుణించె నన్నును

చ. 3: కొంచి పెనఁగిన మేను గొబ్బనఁ గూడిన మేను
యెంచఁగ నిదియెకాదా యీడుజోడాయ
వంచనేలె శ్రీవెంకటేశ్వరుఁడు తా ననుఁ గూడె
మంచివె పనులనవె మన్నించె నన్నును

రేకు: 0243-2 పాడి సంపుటం: 08-254

పల్లవి: తాఁకనేల వంగనేల తలఁచుకో యిఁకనైనా
సోఁకోరిచితేఁ బనులు చొప్పణఁగుఁగా

చ. 1: పల్లదము లాడఁగానె పంతము లియ్యవలనె
అల్లదివో విభుఁడ నేఁ డాఁడు వారికి
మొల్లమి నీపాటిబుద్ధి మునుపనె కలిగితె
వొల్లనె దొరతనాన నుండవచ్చుఁగా

చ. 2: చేతులు పైఁజాఁచఁగాను సిగ్గులు వడవల
యేతువ లెత్తా దించుక యిందరిలోన
నీతి విచారించుకొని నెమ్మది గుట్టుననుంటె
రీతితోఁ బెద్దరికము రేఁచుకొనవచ్చుఁగా

చ. 3: కాఁగిలించుకొనఁగానె కైవము గావలసె
మాగిన మోవితేనెల మముబోఁటికి
చేఁగదేరఁ గూడితివి శ్రీవెంకటేశ నేఁడు
నాఁగువార్ల మీఁద మీఁద నవ్వువచ్చుఁగా

రేకు: 0243-3 సామంతం సంపుటం: 08-255

పల్లవి: రాఁగదె పాయము రచ్చలఁ బెట్టక
కాఁగక మీఁగడ గట్టి నటవే

చ. 1: వలచిన రమణికి వడిఁ బతితోడుత
యెలమిని పంతము లేమిటికే
కలయికలకె మరి కాచుకుండఁగా
చెలరేఁగీ యతని చిత్తముగాకా

చ. 2: వొగ్గి ననుపుతో నుండిన కాంతకు
యెగ్గులు దప్పులు నేమిటికే
సిగ్గుతోఁ బ్రియము చెప్పఁగఁ జెప్పఁగ
నిగ్గునఁ దా మన్నించీగాకా

చ. 3: కదిసెను శ్రీవెంకటపతితో నీకు
యెదురు మాటలిఁక నేమిటికే
పదరక వురమున బలుసుకుండఁగా
ముదములు పైపై ముంచీఁగాకా

రేకు: 0243-4 శంకరాభరణం సంపుటం: 08-256

పల్లవి: పడఁతులు సేసినట్టి భాగ్యముకొద్ది
వుడివోనియట్టి యెన్నో వుద్యోగాలవాఁడవూ

చ. 1: కొత్త కొత్త సింగారాల కానబుకాఁడవు నీవు
బత్తి వొకరిమీఁదనె పాటించేవా
యిత్తల గొల్లెతలు నాఁడెట్టు వేగించిరో నీతో
మత్తలి నీవైతే వేయి మనసులవాఁడవు

చ. 2: పొద్దు వొద్దు వేడుకల బూమెలవాఁడవు నీవు
సుద్దు లింతెకాక వొక్కచోటనుండేవా
వుద్దండాలు రాచకూఁతు లోరించి యెట్టుండిరో
గద్దరివై వూరరి కాఁపురాలవాఁడవు

చ. 3: నిచ్చ నిచ్చఁ బోదిసేసె నేరుపువాఁడవు నీవు
యిచ్చకుఁడవై వొక్క రింటనుండేవా
మచ్చిక శ్రీవెంకటేశ మన్నించి నన్నఁ గూడితి
ముచ్చటతో నందరికి మోహించేవాఁడవు

రేకు: 0243-5 మధ్యమావతి సంపుటం: 08-257

పల్లవి: తమకించి రమణుఁడు తరిగాచుకున్నవాఁడు
సమరతి వుపరతి సాము సేసేదెవుడే

చ. 1: చెనకిన చెనకులు సిగ్గులకె కొలఁదాయ
మనసిచ్చి మీలోని మాటలెపుడే
కొనచూపు లన్నియును కోరికకె మొదలాయ
చనవిచ్చ మోవితేనె చవిగొనేదెవుడే

చ. 2: నగినట్టి నగవులు ననుపులకెపట్టె
పొగరువలపు గడఁబోసేదెవుడే
జిగిమించు వేడుకలు సింగారించనేపట్టె
అగపడ్డ కాఁగిటికి ఆయమిఁకనెపుడే

చ. 3: కూడిన మీకూటములు గురుతు మేనులనిండె
సూడుఁబాడుఁ బంతాల నించుటయెపుడే
యీడ శ్రీ వెంకటేశు మీ యిచ్చకములె నిండీ
వీడెపుమెచ్చులు మెచ్చేవేళయెపుడే

రేకు: 0243-6 ఆహిరి సంపుటం: 08-258

పల్లవి: ఆనతీవయ్యా యింకా ననుమానా లేఁటికి
యేనెపాల లేకున్న నిటువలెఁ జేసునా

చ. 1: వసివాఁడు జూపులు వంచి నిన్నుఁ గొసరుచు
నసురుసురయ్యీఁ జెలి అది యేఁటికి
యెఁసగి యిందాఁకా మీరు యేకతానవె వుంటిరి
కనుగాటు రతులలోఁ గడమ యేమాయనో

చ. 2: తలవంచుకొని నీతో తమకపు మాటలాడి
సొలయుచు నింతి మొక్కి పొలగిలీని
చలివాయ నిందాఁకా సరసము లాడితిరి
చలముతో మతికేమి సమ్మతిగాదాయనో

చ. 3: సన్నలనే జంకించి జవ్వనపు మదమున
చన్ను మొన లటుచూపి సాదించీని
యిన్నిటా శ్రీవెంకటేశ యెనసితి రిద్దరును
పన్నిన మీపంతముల బలిమి యెంతాయనో

రేకు: 0244-1 దేశా(సా)క్షి సంపుటం: 08-259

పల్లవి: ఇద్దరికిఁ దగు తగు నిఁక నెన్నఁడూ
కొద్దిలేని పొంతనాలు గూడె మీకు నిపుడు

చ. 1: పచ్చని మోవిచిగురు పందిలివెట్టె మాటల
దిచ్చరి సిగ్గుల నింతి తెరగట్టెను
పెచ్చువలపులఁ దానె పెండ్లికూతురై వున్నది
రచ్చసేసే వెందాఁకా రావయ్య్య లోనికి

చ. 2: పెలుచుఁ దమకమున పెండ్లిపీఁట వెట్టుకొని
సెలవి నవ్వుల నించె సేసపాలు
కలికి కన్నుల నెగడె కుడు (కాటు?) కవెట్టెను
చలువగా నీకరుణ చల్లవయ్య సతికి

చ. 3: పానుపు మీఁదికిఁ దీసె పాణిగ్రహణమున
నానారతులఁ జేసె నాగవెల్లి
మోనాన శ్రీవెంకటేశ మోవిబువ్వాలు దొడికె
ఆనిన వేడుకలనె అందవయ్య వియ్యము

రేకు: 0244-2 సాళంగనాట సంపుటం: 08-260

పల్లవి: పొద్దువోని వానికిట్టె బుద్ధి చెప్పవే
వుద్దండాలు చూప మోవి వూరడించేనే

చ. 1: చదురులాడి యాతఁడు సారెకు నేరుతునంటా
వదరుఁదనములనె వాదించెనే
పరది యందుకు నేను పైకొని కొంగుపట్టితే
సదరము సేసుకొని సాదించెనే

చ. 2: చలివాపి యింతలోనె సంగడి నిలువఁబెట్టి
పొలతులఁ దెచ్చి నాతోఁ బోలించీనే
తెలిసి అప్పటి నేను దీకొని నిలిచితేను
సొలపుల సొక్కించి సోలించీనే

చ. 3: ఆరయ శ్రీ వెంకటేశుఁ డాయములంటి నన్ను
కోరి తన కాఁగిటిలోఁ గూడించీనే
తేరిచూచి యీవేళ తేనెమోవి యానితేను
ఆరితేరి మారుమాట లాడించీనే

రేకు: 0244-3 సామంతం సంపుటం: 08-261

పల్లవి: అడుగరే విభుఁ నివె య్యైతేఁ గనక
విడువక మాయింటికి విచ్చేయు మనవే

చ. 1: పెలుచుమాటలలోని ప్రియములు
యెలమి నెవ్వరికైనా యితవవునా
కలదింతె మావొళ్ళి కపురులు
పలుమారు తనకేవి బాఁతియయ్యీనా

చ. 2: బిగువురాజసముల పిలుపులు
జగముల దొరలకు చవిపుట్టీనా
తగు ధన మిదియె దాఁపురమూ
అగపడె యిదినేఁడు అనువయ్యీనా

చ. 3: బింకపురతులలోని పెనఁగులు
మంకుచందాలవారికి మర్మమంటీనా
పొంకాన నన్నుఁ గూడె శ్రీవెంకటేశుఁడు
లంకెలాయ తనకిది లావయ్యీనా

రేకు: 0244-4 ధన్నాశి సంపుటం: 08-262

పల్లవి: ఎప్పుడు నీవారమే నేమిదె వద్దనున్నారము
అప్పగించే నందరిని అన్నిటా మన్నించుమీ

చ. 1: వరుసకు వంతుకును వచ్చినవారె యిందరు
సరుస బెట్టుకో నీవు చల్లఁగా నేఁడు
తరవాతి పనులకు తగు గొల్లెతలు వారె
మరుగకు మింకా నీ మనసునను

చ. 2: ఆసల బాసలవారు అదె పెండ్లికూఁతురులు
సేసుకో యింకా నీవు చేయి మీఁదుగా
రాసికి మీఁదమిక్కిలి రాకాసి సతులున్నారు
మోసమోక యేలుకో నీ మోహమునను

చ. 3: వాడికె వేడుకవారె వలచివున్నా రిందరు
కూడవయ్య కాఁగిటను గురుతులుగా
యీడనె శ్రీవెంకటేశ యెనసితి నిదె నేను
యీడువెట్టి మెరయించు మిన్నిటా నీవు

రేకు: 0244-5 తెలుఁగుఁగాంబోది సంపుటం: 08-263

పల్లవి: ఇంకా నింకా రమణుఁడు యేమనీనె
వంక లొత్తఁబోతేను వాసివుట్టీ నాకు

చ. 1: చనవు తానిచ్చినది చలముతో మాఁటాడితి
పెనఁగఁ బోయితే మరి పిరివీకులె
తనమాఁట నామాఁట తరుణు లెరుఁగుదురు
ననిచి తడవఁబోతే నవ్వువచ్చీ నాకు

చ. 2: సమ్మతించినదె తాను సరసము నేనాడితి
కమ్మరఁ గమ్మర నయితే కసిగాట్లె
నెమ్మనము లిద్దరివి నిండుక అట్టె వున్నవి
పమ్మి కొసరఁగఁబోతే పచ్చిదోఁచీ నాకు

చ. 3: నేరిపె నన్నియుఁ దా నెయ్యమున నేఁగూడితి
తారుకాణించఁగఁ బోతే తగులాయమె
యీరీతి శ్రీవెంకటేశుఁ డిన్నిటాను నన్నునేలె
చేరి చెనకఁగఁబోతే సిగ్గువచ్చీ నాకు

రేకు: 0244-6 కేదారగౌళ సంపుటం: 08-264

పల్లవి: ఎనసిన యాకెతో నీకింత యేఁటికి
వెనుకొని నావెంటనె విచ్చేయవయ్యా

చ. 1: పలికినట్టనెపో పంతము
చలిమి బలిమిగల సతులకు
తలఁచినయట్లనె తగులము
వలపులు నెలకొన్నవారికెల్లాను

చ. 2: చేసినవెల్లాఁ జెల్లు చేఁతలు
బాలు నమ్మినయట్టి పడఁతులకు
ఆసపడిన కోరిక లబ్బునపుడె
సేసవట్టుకుండినట్టి చెలులకును

చ. 3: చూచినట్లనెవచ్చు సూటులు
యేచి కూడిన మీవంటిద్దరికిని
చేచేత శ్రీవెంకటేశ చెలి యలమేల్మంగ
లాచి నట్లనె మించె లావణ్యాలు

రేకు: 0245-1 శ్రీరాగం సంపుటం: 08-265

పల్లవి: చెప్పినట్టు సేయకున్న చిన్నఁబోరాదు
కప్పురగందులకెల్లాఁ గల దిదె చాలు

చ. 1: చనవు లేనిచోటి జగడాలు
పెనఁగఁబోతే వట్టి పిరివీకులు
కనుకొని మాటాడరె కాంతలు
వనితల కిందరికి వాసితోడి బతుకు

చ. 2: అందియు నందనిచోటి యాసలు
సందడిఁ బెనఁగఁబోతే సటవటలు
పొందులు దెలుసుకోరె పొలఁతులు
చెందిన యింతుల కెల్ల సిగ్గు మూలధనము

చ. 3: అలసిన రతిలోని యలుకలు
చలపట్టఁబోతేను సదమదము
కలసె సన్నిదె శ్రీవెంకటవిభుఁడు
లలనలకెల్లా నీలాగులెపో లంకెలు

రేకు: 0245-2 కాంబోది సంపుటం: 08-266

పల్లవి: ఏమయ్యా నే మంతేసి యెఱఁగనివారమా
కామించితే నీమాట కాదనఁగఁ దరమా

చ. 1: సలిగెంత గలిగినా సరస మాడుటెకాక
మెలఁగి నీకంటె మితిమీరవచ్చునా
వలపు మిక్కిలియైతె వసమై చొక్కుటగాక
కలఁచి కలఁచి నిన్నుఁ గక్కసించఁదగునా

చ. 2: నగవెంత దఱచైన ననుపై యుండుటగాక
మిగులా మందెమేళాల మించనగునా
మొగమెంత చూచినా మొక్కులె మొక్కుటగాక
యెగసక్యాలకు నిన్ను యేపఁదీరునా

చ. 3: నీవెంత మన్నించినా నిన్నిట్టె కూడుటగాక
చేవదేర నిన్నుఁ బచ్చి సేయఁగూడునా
యీవేళ శ్రీవెంకటేశ యేలితి విటు నన్ను
ఆవటించి నిన్ను రతి నలయించఁజెల్లునా

రేకు: 0245-3 సామంతం సంపుటం: 08-267

పల్లవి: అప్పటి కాఁతాళాన నందుముగాక
తిప్పఁబోతే నీగుణాలు తీరౌనా మాకు

చ. 1: నేరుపుననాడె కల్ల నిజమువలెనెవుండు
యేరుపరచేమంటె యెటువచ్చును
నీరచనల నీవును నిలువునూరువండు
తారుకాణించే మంటె తరమా మాకు

చ. 2: దరిచేరి దండాలు తనవద్దనెవుండు
సరవికి దిద్దేమంటె చాయకురావు
వెరసి మెయిగురుతులు వేయిసే నొక్కొక్కటి
వొరసి వెలవెట్టఁగ నోపికేది మాకు

చ. 3: ప్రేమపు మోవితేనెలు పెదవిమీఁదనెవుండు
చేముట్టి వడ్డించఁబోతె చిరునవ్వులు
గామిడి శ్రీవెంకటేశ కలసితి విటు నన్ను
దోమటి దొడికేమంటె దొడ్డా మాకు

రేకు: 0245-4 మాళవిగౌళ సంపుటం: 08-268

పల్లవి: విన్నపము లింత విన్నవించవలెనా
సన్నకు మేలే నీవు జరపఁగవలదా

చ. 1: మాటలకు గురియ మనసులో మర్మములు
తేటల తెల్లములాయ తెలిఁగన్నులు
యేఁటికి జాగులు సేసే విచ్చుట నచ్చుటనుండి
ఆఁటదాని అసురురంత నీకువలెనా

చ. 2: చెక్కుమీఁది చేయాయ చిప్పిలుఁ దమకమెల్ల
మొక్కులాయ విరహము ముంచిన యాస
తక్కులఁ బెట్టఁగనేల తరితీపు నేరుచుక
చక్కని కోమలాంగిజాలి నీకు వలెనా

చ. 3: నవ్వులకు మొదలాయ ననుపులోపలిసిగ్గు
రవ్వలకుఁ జోటాయ రతి చిహ్నాలు
యివ్వల శ్రీవెంకటేశ యింతి నిట్టె కూడితివి
జవ్వని నలయించి (చనీకు?)న చలమింతవలెనా

రేకు: 0245-5 వరాళి సంపుటం: 08-269

పల్లవి: వలపు నీరువంటిది వాడరాదు
తలఁపు మాకిద్దరికె తారుకాణైవుండును

చ. 1: మలసి ఆతఁడాడిన మాటలు నాతోఁ జెప్పి
చలము రేఁచకురె సతులాల
తెలిసితి నేఁ దొల్లె తేనె(లె?) పాన్పాకుమీఁ దిదె
మెలఁగి నేఁడు గొత్తలు మీకింతె కాని

చ. 2: యిదివో విభుఁని నన్ను నెదురుకట్లఁజూపి
మదము వెంచకురె మగువలాల
పదరి పండిదేరెనుఁ బంటిలోని రసములు
అదనెరఁగక మీరు అలసేరుగాని

చ. 3: గక్కన శ్రీవెంకటేశ కాఁగిటిలో నన్నుఁగూర్చి
పక్కన నవ్వకురె పడఁతులాల
చిక్కెను నాకుఁ దొల్లె చెరకుపండినపండు
పెక్కుమారులు మీరు పెనఁగేరుగాని

రేకు: 0245-6 దేసాళం సంపుటం: 08-270

పల్లవి: బుద్ధిమంతుఁడ వౌదువు పూఁచి బతుకఁ గలవు
వొద్దికతో నాకిపు డొక్క మనసాయను

చ. 1: యేతులు నెరపవచ్చు నెమ్మెలాడుకొనవచ్చు
నాతోడి నవ్వులె నయమా నీకు
ఆతలివారైతె నిన్ను నన్నిటాఁ గాకు సేతురు
చేతికి లోనయినవారిఁ జెనకితే మేలుగా

చ. 2: బాలు సేయంగవచ్చు పలుమారు బొంకవచ్చు
ఆసలు మాతోడిపొందు అనువా నీకు
పోసవోని వారయితె మొయికి మయి సేతురు
వాసి మానాపతులనె వంచుకొంటేఁ జెల్లునా

చ. 3: గుట్టుసేసుకొనవచ్చు కూరిమి గొరవచ్చు
యిట్టి మాకూటములె యితవా నీకు
అట్టుసేతు రిందరు నాఅడి శ్రీవెంకటేశ
మట్టుతోడి వారినె మన్నించితేఁ దగుఁగా

రేకు: 0246-1 శంకరాభరణం సంపుటం: 08-271

పల్లవి: విచారించు కొమ్మనవే వేడుక నింకాఁ దానె
పచారించి మాతో నేల పలుక వచ్చీనే

చ. 1: విరసాలె రసాలు వేగిరపడకవుంటె
తెరమరఁగె బయలు తెలిసితేను
సరవులె వెరవులు చనవు గలిగితేను
యిరవాయఁదా నాకు నేమి బోధించీనె

చ. 2: పంతనాలె పొంతనాలు పనులెల్లా నియ్యకొంటె
చింతలే మనోరథాలు సేసుకొంటేను
వింతలే నసుపు లవును వేసినట్టె వేసితేను
యెంతసేసి నన్నుఁదాను యేమిబోధించీనే

చ. 3: వెగటులే పగటులు మోరపులులేకున్న
తెగువలే నగవులు దిద్దుకొంటేను
తగు శ్రీ వెంకటేశుఁడు తమకించి నన్నుఁగూడె
యెగసక్కే లిఁకలేవు యేమి బోధించీనే

రేకు: 0246-2 వరాళి సంపుటం: 08-272

పల్లవి: గుట్టుతోడిదాన నేను కొసరనేల
దిట్టతనమె నాది తెలుకొనవయ్యా

చ. 1: పెక్కుమాట లాడఁగాను ప్రియుఁడ నీతో నేను
వొక్కటి హితవౌను వేరొక్కటిగాదు
చక్కటులు నీవాఁడితే సారెకు వినేఁగాని
అక్కరతో మారుమాట లడుగకువయ్యా

చ. 2: సారె నీతో నవ్వఁగాను చప్పనవునో వుప్పనవునో
తేరకొనని మనసు తిద్దుకోరాదు
కేరి నీవు నవ్వితేను కిమ్ములఁ జూచేఁగాని
ఆరయ నన్నుఁ గలుపే వంతయేఁటికయ్యా

చ. 3: నిన్ను బాసగొనఁగాను నిలుపుదువోమరి
సన్నలఁ దోతువో అంతసాధించనేల
యెన్నఁగ నన్నుఁ గూడితి విదిగో శ్రీవెంకటేశ
వెన్నవంటి నయముతో వేఁడుకోనేలయ్యా

రేకు: 0246-3 ముఖారి సంపుటం: 08-273

పల్లవి: ఎవ్వరి కెవ్వరి చుట్టా లేమి బూమెలు సేసేవు
రవ్వల నాఁడు బుద్ధులు రండూ రెండే

చ. 1: కన్నెల అలుక దీర్చి కాఁగిలించఁ బెట్టఁగాను
చన్నులుఁ జన్నులుఁ దాఁకి చప్పుడాయను
యెన్నికఁ గపటములు యెదలోనివి మాన్పేవా
సన్నల సవతులైతే జాతివైరాలు

చ. 2: మానినుల నిద్దరిని మాటలాడించఁగాను
తేనెలుఁ దేనెలు సోఁకి తియ్య నాయను
నానిన వెంగేల వాఁడినాఁటినవి మానిపేవా
పూనిన వరుసవంతు పొరపొచ్చాలు

చ. 3: కూడిన నీసతులనుఁ గూచుండఁ బెట్టుకోఁగా
తోడులు నీడలు నొక్క దోమటాయను
వాడిక పిన్నపెద్దల వావి నీవు వద్దనేవా
యీడుతో శ్రీవెంకటేశ కుందులు

రేకు: 0246-4 శ్రీరాగం సంపుటం: 08-274

పల్లవి: ఎరుఁగుదుము నీ నాయా లేల చెప్పేవు
వొరిమె గలవాఁడవు వూరకుఁడ రాదా

చ. 1: మొగమోట గలవారు మోహించిన సతులకు
తగవు చెప్పేరా తప్పకుండాను
మగఁడ వై తేనేమి మచ్చికగలచోటికి
తెగెవా పరులకైతే దీకొందువుగాక

చ. 2: చుట్టపుఁ బొందైనవారు చూచి చూచి సవతుల
యెట్టయినా వున్నట్టే యేలాడేరు
దిట్ట వైతేనేమి నీతీరుకు వచ్చేవారిఁ జే
పట్టవా వింతవారైతే భ్రమయింతువుగాక

చ. 3: కడు వేడుకకాండ్లు గలిగినట్టె ధర్మము
నడుపేరా శ్రీవెంకటనాయక నేఁడు
అడరి నన్నుఁ గూడితి వాపెనుఁ గొంతమాత్రము
విడిచేవా యిది నీ వేసా లింతేకాక

రేకు: 0246-5 సాళంగనాట సంపుటం: 08-275

పల్లవి: ఇంకాఁ జదువవయ్య యిటువంటివి
లంకెలాయ నీవిద్య లావరివి నైతివి

చ. 1: పెదవిపై సుద్దులు ప్రియములు బద్దులు
యెదుగాఁ జదివితివి యిపుడు నీవు
వదరు సతులు నీతో(నీతో)వాదించే వారెవ్వరు
తుదకెక్కె నీవిద్య దొడ్డవాఁడ వైతివి

చ. 2: మంతనపు మంత్రాలు మంకుగోరి యంత్రాలు
యింతగా నేరుచుకొంటి విపుడు నీవు
జంతల సతుల నిన్ను సాధించే వారెవ్వరు
దొంతినున్నది నీవిద్య దొడ్డవాఁడ వైతివి

చ. 3: ఱట్టయిన సత్యా లాఱడి జోలినిత్యాలు
యిట్టివె నేరుచుకొంటి విపుడు నీవు
గట్టిగా శ్రీవెంకటేశ కాఁగిలించితివి నన్ను
తొట్టెను నీవిద్యలె దొడ్డవాడవైతివి

రేకు: 0246-6 దేసాళం సంపుటం: 08-276

పల్లవి: మావంటివారి దీవెన మరి యేకాలము గద్దు
భావించి విచ్చనవిడి బతుకఁగదయ్యా

చ. 1: వెలలేని వలపులు వేమారు గొనఁగాను
లలియెత్తితమకము లాభమాయను
పలచని వద్ది(ట్టి?)శిగ్గు పదారువేలకుఁ దారె
బలిమి నీకఁ గోటికిఁ బడిగెత్తవయ్యా

చ. 2: చదరపు సరసాలు చాలుమూలనడవఁగా
గుదిగొన్న నగవు లగ్గువ లాయను
అదిగో పట్టపుదేవు లారడి పంతముచేరె
పదరక సవరాజ్యపట్ట మేలవయ్యా

చ. 3: పాయపు తరితీపుల పంటలెల్లఁ బండఁగాను
చాయల రతిభోగాలు సదరమాయ
యీయెడ శ్రీవెంకటేశ యిటు నన్నుఁ గూడితివి
లాయపుటింతుల పొఁజులనుఁ గూర్చవయ్యా

రేకు: 0247-1 నాదరామక్రియ సంపుటం: 08-277

పల్లవి: ఊరకుండవయ్యా వుడివోవు వలపులు
కోరుకొంటా వున్నదాన గొప్పలు నీకన్నులు

చ. 1: చనవు నీవిచ్చితివి చలము లన్నియుఁ దేరె
మనసొక్కటాయ నీతో మారుమాటేల
ననిచివుందాన నిదె నన్ను నేల రేఁచేవు
వినుకొంటానున్నదాన వింతలు నీసుద్దులు

చ. 2: ప్రియములు చెప్పితివి పెనఁగితివిందాఁక
నయమాయ సరసాలు నవ్వులంతేల
క్రియ నే నెఱుఁగుదును కెరలించ కిఁక నీవు
జయము చేకొంటి నిదె చక్కనె నీమాటలు

చ. 3: తెలిపితివి బుద్దులు దిష్టముగాఁ గూడితివి
వెలసె నీమోములు వెరపు లేల
యెలమి శ్రీ వెంకటేశ యెచ్చరించకు గోరను
తలపోయుచున్నదాన తగు నీగుణములు

రేకు: 0247-2 మధ్యమావతి సంపుటం: 08-278

పల్లవి: దానికేమి యిప్పుడేమి తప్పిపోయీనా
వూని యెదురుకట్లనె వున్నాఁడుగా

చ. 1: అలసిన రతివేళ ఆడినట్టి యీమాటలు
తలఁచుకొమ్మనమో తనుఁ దానె
పిలిపించి నాతోఁ దాను పెనఁగిన పెనఁగులు
తెలిపే లేవె యింకా తెరమరఁగుననె

చ. 2: చిడుముడి మంచముపై చెనకిన చెనకులు
తడవి చూచుకొమ్మనవె తన మేననె
వుడివోక తారుమారై వునిచిన వుంగరాలు
తడఁబడీ వేళ్లను తానెరఁగఁడా

చ. 3: కొత్తగా నాకాఁగిటిలో కూడినట్టి కూటములు
యెత్తి యిమ్మనవె యీవేళనె
హత్తెను శ్రీ వెంకటేశుఁ డట్టె తానన్ను
తత్తరపు దమకము తనివి నొందీనా

రేకు: 0247-3 శ్రీరాగం సంపుటం: 08-279

పల్లవి: చిన్నఁబోయివుందాననా చేరి నీతో నలిగేనా
సన్నల నిన్నుఁ జింతించే జాడ లింతేకాక

చ. 1: నెక్కొన్న వేడుకలకు నీవు గలవు మాకు
చెక్కు చేతితోడుతను చింత మాకేల
వక్కణతోఁ గన్నుఁ గలువలు గలమోముతోడ
గుక్కక తామెర చేయిఁ గూర్చితిఁగాక

చ. 2: దట్టమై నామతిలోన తగు నీరూపెడయదు
వట్టి విరహాన వసివాడనేల
పట్టి తనువల్లిగాన పన్నీరు గంద మందుకు
పెట్టి పొరలించె మెత్తి పెద్దసేసేఁగాక

చ. 3: కాఁగిట నీవుగలవు కమ్మఁజెమటల రతి
నాఁగి యాఁగి సారె సారె నలయనేలా
కాఁగిటఁ గూడితి శ్రీవెంకటేశ నీ యలపార్చ
వేఁగక నిట్టూరుపుల విసరేఁగాక

రేకు: 0247-4 రామక్రియ సంపుటం: 08-280

పల్లవి: అటుగాన యెంచనేల ఆవలివారి భాగ్యము
యెటులైనా నీపట్టు కెప్పుడును మంచిదే

చ. 1: తప్పు నీయందున్నదా తగవరి వన్నిటాను
చొప్పు లెత్త బోతేను సూటికిరాదు
కప్పురపు చవిలోన కారములుండునా
కప్పిన విరహులకే కాఁక లౌఁగాదో

చ. 2: సరవి నీవెరుఁగవా సర్వజ్ఞుఁడవు నీవు
కెరలించఁ బోతేను కిందుపడును
వరుసలఁ బూవులకు వాఁడి తొల్లివున్నదా
విరసపువేళనే వెల్లివి రౌఁగాదో

చ. 3: చేకొననివాఁడవా శ్రీ వెంకటేశుఁడవు
కాకుసేయఁ బోతేను గరివడును
యీాకడ చంద్రుడు వెట్టా యేలితివి నన్ను నిట్టే
పైకొని అలిగేవారి పాలిటికి అవుఁగాదో

రేకు: 0247-5 ముఖారి సంపుటం: 08-281

పల్లవి: ఏఁటిమాఁట లిటువంటి వేలాడేవు
గాఁటమై యేకతమైతేఁ గాదనేనా

చ. 1: చెప్పినట్టు సేతుఁగాక చిత్తములోపలి సిగ్గు
వొప్పగించి నీముందర నూరకుండేనా
కుప్పలైన కుచములు కొండలవలె నుండఁగా
తప్పక నాపయ్యదను దాఁచుకుందునా

చ. 2: సమ్మతించి వుందుఁగాక జవ్వనపు నాగుట్టు
కుమ్మరించి నాకు నాకె కొనవేతునా
తెమ్మలైన పిరుఁదు మరుతేరువలె నుండఁగాను
నెమ్మది నీకెదురుగా నిలుచుందునా

చ. 3: కూడితివి మెత్తుఁగాక కొనగోరి చేఁతలను
వేడుకకాని తనమును వెలివేతునా
యీడనె శ్రీ వెంకటేశ యెనసితి మిద్దరము
వాడిక వలపు లింక వడియఁ గట్టుదునా

రేకు: 0247-6 ఆహిరి సంపుటం: 08-282

పల్లవి: నెలఁతఁ బాసితే నీకు నిమిష మేఁడవును
యెలమి దగ్గరివుంటే నేఁడు నిమిషమవును

చ. 1: కన్నులఁ బెట్టినయట్టి కాటుకచూపులు నీపై
పన్ని చెలి చల్లితేనె పగలు రేయౌ
వున్నతి పద్మరాగాల వుంగరాలచేతినిన్ను
తిన్నఁగా నంటితే నట్టె తెల్లవారును

చ. 2: వీడెపు మోవిసెలవి వేడుకతో నవ్వితేను
నీడలఁ గాసిన వెల్లా నిండు వన్నెలౌ
పాడితో యించుకవడి ప్రణయకలహమయితే
యేడచూచినా నదె యెండగానును

చ. 3: శ్రీవెంకటేశ యిట్టె చెలి నిన్నుఁగూడెఁగాన
సోవలుగా మోవిమీఁదఁ జుక్కలు నిండె
వేవేలు రతులచేత వెలయఁగా దిక్కులెల్ల
కావిరి మాని హృదయకమలము నించెను

రేకు: 0248-1 శుద్ధవసంతం సంపుటం: 08-283

పల్లవి: సంగడినున్నవారము సాకిరి చెప్పకపోదు
యింగిత మెరిఁగి నీవె యియ్యకోవయ్యా

చ. 1: వనిత చూచినదెంత వడి నీవేల లోఁగేవు
చెనకినదెంత నీవు సేసేదెంత
వినవయ్యా ఆపెమాట వేఁడుకొనె నింతగద్దా
యెనసి ఆడినమాట కియ్యకోవయ్యా

చ. 2: ఆపె నవ్వినది నవ్వు అప్పటి నీమతి దవ్వు
పోపో మరునియేటు పూచిన పువ్వు
వోపవయ్యా చెలి నిన్ను వొరసి చన్నులనూఁది
తీపులమోవికతలు తెలసుకోవయ్యా

చ. 3: పిలిచిన పిలుపడ బిగిసే నీగతి యేడ
వలపిల కిదా జాడ వట్టిది నీడ
యెలమి శ్రీవెంకటేశ యింతి నిన్ను నిదె కూడె
పలుకుఁ బంతాలు నీ కెప్పటివలెనయ్యా

రేకు: 0248-2 రామక్రియ సంపుటం: 08-284

పల్లవి: బల్లిదుఁడవైతివి బతుకవయ్యా
పొల్లలేకుండా నిన్నుఁ బొగడేమయ్యా

చ. 1: యెక్కడి కెక్కడి బుద్ధులెవ్వరు చెప్పరయ్య
చిక్కి నీకుఁగాఁగ ఆపె చెప్పేఁగాక
తక్కక యెవ్వరు జాణతనాలు నేరిపరయ్య
నెక్కొన్న చుట్టరికాన నేరిపెఁగాక

చ. 2: తతి నెవ్వరి కెవ్వరు దాయిదండయ్యేరయ్య
అతివ నీకుఁగాఁగా నాయఁగాక
రతుల కెవ్వరిపాటి రమ్మని పిలిచేరయ్య
గతియైవుండె తానె గక్కునఁ బిలిచెఁగాక

చ. 3: కందువతో నెవ్వరు కాఁగిలించుకొనేరయ్య
అంది నిన్నుఁగాఁగా ఆపె అలమెఁగాక
యిందులో శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁగూడితివి
విందువలె తానూ నీవెంటవచ్చెఁగాక

రేకు: 0248-3 భైరవి సంపుటం: 08-285

పల్లవి: పూవువంటిదానను పూఁపవంటిది వయసు
సావదానమున నీసంసారఫలము

చ. 1: నీవు బోధించినయట్టి నిజములె నానిజము
భావించి నీవు నడపె పంతము నాది
లావుల నీమన్నన కొలఁదుల వారమువేము
వోవసేసి మమ్ము నేల వొరసేవువిభుఁడా

చ. 2: చక్కఁగా నీవు నడపె సమేళము నాసలిగె
చెక్కుల నీవు వొత్తిన చిన్న లివిగో
పక్కన నీవు గప్పినపచ్చడము నామీఁదిది
తెక్కుల నన్నెంత కెంత తెలిపేవువిభుఁడా

చ. 3: కాఁగిట నీవుగూడిన గరిమ నేఁ బొగడేది
మాఁగిన నీమోవితేనె మావిందులు
రాఁగిన సంతోసపు రతుల నన్నేలితివి
చేఁగదేరించఁగ నేల శ్రీ వెంకటవిభుఁడా

రేకు: 0248-4 సాళంగం సంపుటం: 08-286

పల్లవి: అనవలసేమైనా నిన్నంటిఁగాక
మునుకొని నే నీకు మొక్కకుండేనా

చ. 1: సంతతము నందరును జయలువెట్టఁగ నీకు
కాంత లిఁక వేరె నిన్నుఁ గాదనేరా
వింతగా ఆవులు నీవెంటవెంటఁ దిరుగఁగా
మంతనాన గోపికలు మరుగకుండేరా

చ. 2: పచ్చి పిల్లఁగోవిలోన బలు రాగాలు రాఁగాను
రచ్చకెక్కే సతులెల్ల రాకుండేరా
గచ్చులసిరి మోహాన కమలాన వేయఁగాను
తచ్చి రుక్మిణి పువ్వులదండ వేయకుండునా

చ. 3: నిండు జలధులనీరు నిన్నుం గంటెఁ బేరఁగాను
అండ మావలపు పేరే దదియెంత
కొండల శ్రీ వెంకటేశ కూడితిమి నేము నిట్టె
పుండనుండఁదరితీపు (ల?) రూరకుండీనా

రేకు: 0248-5 సామంతం సంపుటం: 08-287

పల్లవి: దొరలకె కానిలేదు తుంటతనము
జరసి నీతో నవ్వ సరిదాననా

చ. 1: పతినలు వలుకఁగఁ బలుమారుఁగొసరఁగ
కతగరిచినవారుగాని నేరరు
మతిఁ బెట్టుకొని సారె మమ్ముఁనే నమ్మించేవు
చతురతఁ బెనఁగ నీసరిదాననా

చ. 2: బడిబడిఁ దిరుగఁగ పైపై బుజ్జగించఁగ
గడుసులయినవారుగాని నేరరు
అడియాసలు పుట్టించి ఆయము లేలంటేవు
సడిఁబెట్టి నిన్నుదూర సరిదాననా

చ. 3: రాయడిరతిఁ బెనఁగ రారాఁపులకు నోప
కాయాటులయినవారుగాని నేరరు
యీయెడ శ్రీవెంకటేశ యిటునన్నుఁ గూడితివి
చాయలు బోధించ నీకు సరిదాననా

రేకు: 0248-6 సౌరాష్ట్రం సంపుటం: 08-288
పల్లవి: ఏల సాకిరి గోరేరు యిద్దరు నన్ను
నాలి నేఁ జూచినప్పుడె నవ్వుతానె వుంటిరి
చ. 1: మతకా లెరఁగఁగాని మగువ నీమోముచూచి
చతురతలు మెరసి జంకించెను
రతికి దగ్గరఁగాని రహస్యాన నీవుండి
మితిమీరి కొనగోరు మీటుకొంటివి
చ. 2: తగవులు చెప్పఁగాని తరుణి నీవన్నందుకు
వొగరుఁజూపుల పెదవులఁ దిట్టెను
మిగిలినవేవోకాని మీదమిక్కిలి నీవైతె
జిగిఁ బంతములు చూపి చెలఁగితివి
చ. 3: యీరీతి వేరుసేయఁగా నింతి శ్రీవెంకటేశ్వర
గారవించి నిన్నుఁ గూడి కాఁగిలించెను
తేరెఁగాని నీవల్లనె తేటతెల్లమై నేఁడు
మేరతోనె పంతమిచ్చి మేకొంటివి

రేకు: 0249-1 శ్రీరాగం సంపుటం: 08-289

పల్లవి: గొల్లెతలై తేనె కొఱతా
పల్లదపు నీచే పడిరిగాకా

చ. 1: కంచుఁబదనుల కాంతల నేఁడిట్టె
వంచుకొన నీకువసమా
పంచబాణముల దారికి లోనై
ముంచి చేతులెత్తి మొక్కిరిగాకా

చ. 2: కోడెవయసు కొమెరలేమల
వాడికెకుఁ దేనువసమా
కూడఁగూడఁ బిల్లఁగోవి రాగాలకు
వాడవారు వెంటవచ్చిరిగాకా

చ. 3: కొలఁదిలేనట్టి గుబ్బెతలనెల్ల
వలపించుకొనవసమా
యెలమి శ్రీవెంకటేశ కూడఁగాను
సొలసి చనవుచూపరిగాకా

రేకు: 0249-2 శుద్ధవసంతం సంపుటం: 08-290

పల్లవి: పెనఁగకువే యిఁక ప్రియునితో నీవింత
మనసు లెఱుఁగుదుము మరి మాటలేలే

చ. 1: అలుకదేరిచి పతి అట్టె పైకొనఁగాను
చలమరితనమేల సతులకును
జలజలఁ జెమరించె జాజుకొనఁ బులకించె
చెలఁగి వేగి మిగిలి చీఁకటులు గలవా

చ. 2: నవ్వు నవ్వి యీతఁడె వనుపులు సేయఁగాను
రవ్వలఁ బెట్టఁగనేలే రామలకును
జవ్వనపు కళలుబ్బె సమ్మతులు మతికబ్బె
పువ్వులలోపలిపాల్ల పూఁచిచెప్పఁగలవా

చ. 3: శ్రీవెంకటేశ్వరుఁడు చెక్కునొక్కి వేఁడుకోఁగా
వేవేలు మాఁటలేలే యీవెలఁదులకు
నీవాతనిఁ గూడితివి నీటులునుఁ జూపితివి
చేవల చిగురు నాఁడె సేసిపెట్టఁగలవా

రేకు: 0249-3 కొండమలహరి సంపుటం: 08-291

పల్లవి: అమ్మరో యెంతగడుసరి వదేమె నీవు వల
పమ్మకతొల్లె కొనేవు అదేమె నీవూ

చ. 1: మలసి విభుఁడు నీతో మాటలాడకతొల్లె
అలిగి యెగ్గులువట్టే వదేమె నీవూ
కలసి యాతఁడు నిన్నుఁ గరఁగించకతొల్లె
అలసి వుస్సురనేవు అదేమె నీవూ

చ. 2: చక్కఁగాను నీపతి సరసమాడకతొల్లె
అక్కడజీరె ననేవు అదేమె నీవు
తక్కక యాతఁడు నీకు తమ్ముల మిడకతొల్లె
అక్కట కారమనేవు అదేమె నీవూ

చ. 3: యెనసె శ్రీవెంకటేశుఁ డిప్పుడు యింతకతొల్లె
అనుకొనే వాలనంటా నదేమె నీవూ
చెనకితి వితఁడు పైఁ జేయి చాఁచకతొల్లె
అనలుఁగొనలకెక్కే వదేమె నీవూ

రేకు: 0249-4 మంగళకౌశిక సంపుటం: 08-292

పల్లవి: ఎందాఁకాఁజూతుము నే మిటువంటి యాగడాలు
అందినచెలులము నే మాడకుండరాదు

చ. 1: వువిద తాఁ బెట్టె తొంటి వుంగర మిమ్మంటేను
యివల నింతదొరవు యేల తిట్టేవు
జవళిగన్నీరుతోడ చలపట్టుకుండఁగాను
తవిలి నీకింకా నేల దయపుట్టదు

చ. 2: నీలాగులుచూచి యాపె నీబాస వొప్పగించితే
కోలుముందుగా నేల కొంగువట్టేవు
తూలెటినెరులతోడ దోసిలించి మొక్కఁగాను
పాలుపడి దోసానకు భయమేలవుట్టదు

చ. 3: పడఁతి నీగుణాలకు పయ్యద బిగించుకొంటే
సడిఁబెట్టి నీవేల చన్నులంటేవు
తొడరి శ్రీవెంకటేశ దొమ్మిఁగలసితి వాపె
జడిసి గోరంటినా నెచ్చరి కేలపట్టదు

రేకు: 0249-5 వరాళి సంపుటం: 08-293

పల్లవి: వారివారిభాగ్యము వలపుల కొలఁది
నేరుపు గలిగితేను నిన్నమాపే రేపూ

చ. 1: కనుసన్న నాపె నిన్నుఁ గరఁగించఁ జూచితేను
యెనసి అవె(వ?)మ్ముులైతే నేమిసేసును
వెనుకొని అవియెల్ల విరహవేళల నింతె
మన లొక్కటైతె తామరపూజలవును

చ. 2: పుదవి చన్నులనొత్తి పూరడించఁ జూచితేను
యిమో పిడిగుండ్లయితే నేమిసేసును
పవళించి అవి రతిపంతమాడేవేళనింతె
కవగూడితేను జక్కవరూపులవును

చ. 3: పెదవులెత్తి చెలియ ప్రియము చెప్పఁజూచితే
యెదురుగాలములైతే నేమిసేసును
కదియనివేళ నింతెకాని శ్రీవెంకటేశుఁడ
యిదె కూడితిరి యివె యిఁక తేనెలవును

రేకు: 0249-6 హిందోళవసంతం సంపుటం: 08-294

పల్లవి: ఏఁటికి వేగిరపడే వింతలో నీవు
మేఁటిరమణుఁడ నిన్నె మెప్పించీఁగాకా

చ. 1: మచ్చికసేసినచెలి మాటలాడకమానీనా
దిచ్చరి నీతలఁపులు దెలిసీఁగాక
యిచ్చకము నీవాడఁగా నియ్యకొనకుండీనా
కచ్చుపెట్టి కొంతగొంత కైకొనీఁగాక

చ. 2: దగ్గరి వచ్చినచెలి తప్పకచూడకుండీనా
సిగ్గులు నీపైఁ గొంత చిమ్మీఁగాక
వొగ్గి విడెమిచ్చినాపె వోపననీనా యిఁక
నిగ్గులవలపు నీకు నేరిపీఁగాక

చ. 3: చేకొని కూడినమీఁద సేవసేయకమానీనా
యీకడ ముందువెనక లెంచీఁగాక
శ్రీకాంతనేలితివి శ్రీవెంకటేశ్వర నేఁడు
మాకొరకు నిన్నాపె సమ్మతింపించీఁగాక

రేకు: 0250-1 ముఖారి సంపుటం: 08-295

పల్లవి: ఊరకుండుమనవే వొక్కటొక్కటే రేఁచక
తేరకత్తె నైతేనేమి తిద్దుబడి తనదే

చ. 1: తగిన నాచెలువము తనకె శలవాయ
పొగడఁగవలెనా పొరుగులను
నగిన నానగవులు ననుపులకునువచ్చె
మగనాలనైతేనేమి మనువెల్లాఁ దనదే

చ. 2: పట్టిన నాపంతమిది పైపైఁ దనలోనాయ
అట్టె నన్నేల మెచ్చినె అందరితోను
తిట్టిన నాతిట్టులివి దీవెనలై సరిదాఁకె
చుట్టమనై తేనేమి సొమ్మయితిఁ దనకే

చ. 3: యిల్లిదె నాజవ్వనము యెప్పుడూఁ దనకెఅబ్బె
వెల్లవిరి సేయనేలె వీధివీధిని
చెల్లుబడితోఁ దానె శ్రీవెంకటేశుఁడుగూడె
గొల్లదాననైతేనేమి కొలుమోల్లాఁ దనదే

రేకు: 0250-2 సామంతం సంపుటం: 08-296

పల్లవి: ఉండరే యెక్కడిసుద్ది వొడఁబరచకురే
యెండలెల్ల నీడలాయ నిద్దరికి మాకు

చ. 1: కూరిమిలేనిపొందు కొనలెటువలెసాగు
పేరులేని పిలుపులు ప్రియమెట్టౌను
తారుకాణించేనంటే తానాడ నేనీడ
మారుత్తరమియ్యరాదు మనసులేయెరుఁగు

చ. 2: నగవురానిమేలము నయమెటువలెనౌను
మొగముచూడని మొక్కు మోచేదేడ
తగులఁబెట్టేనంటే తతిలేదు మితిలేదు
పగటు లాడఁగరాదు పట్టినదేపంతము

చ. 3: పలచఁగానిసిగ్గులు పనికెటువలెవచ్చు
చలివాయనివలపు సాదించేదెట్టు
యెలమి శ్రీవెంకటేశుఁ డీడనుండె నన్నుఁగూడె
వెలపరచఁగరాదు వేడుకలేనిండెను

రేకు: 0250-3 ధన్నాశి సంపుటం: 08-297

పల్లవి: మాపుదాఁకాఁ గొసరిన మాను మానే రాయి రాయే
దాపుదండ నీవు నాకు తగవు నీచేతిది

చ. 1: మొక్కలపు మాటలెల్ల మొన్ననె ఆడితిఁగాని
పుక్కటయిన నిన్ను నేనుఁ బొగడ నేఁడూ
వుక్కువంటి గుండెలోన లక్కవంటి మనసిదే
దక్కియున్నదాన నీకు ధర్మము నీచేతిది

చ. 2: అంగడిఁ బెట్టినచేఁత లప్పుడెపెట్టితిఁగాని
ముంగిట నీసుద్దులెల్ల మూసేనిపుడు
యెంగిలిసెలవితోన రంగువంటిమనసిదే
పొంగివున్నదాన నీకు పుణ్యము నీచేతిది

చ. 3: లోచి నిన్నుఁ గూడేది లోననే కూడితిఁగాని
యేచి నిన్నుఁగూడేను యీచాయ నేను
చేచేత నీదేవులను శ్రీవెంకటేశుఁడవు
తాచియున్నదాన దయ దలఁపు నీచేతిది

రేకు: 0250-4 కేదారగౌళ సంపుటం: 08-298

పల్లవి: నేఁడుగొత్తలా తన నేరుపులివి
వాఁడిపట్టి ముంటికొన వాదులడిచేనా

చ. 1: కానిమ్మంటినే యిఁక గాదని యెదురాడనే
తానాడినదే మాట తప్పులులేవు
రానీవే యందుకేమి రతిఁ గరఁగించుఁ దాను
నానఁబెట్టీగొడ్డలి సన్నల నింతయేఁటికే

చ. 2: బాసయిచ్చితినే తనపంతము చెల్లించేనే
సేసినదేచేఁత మరి చిక్కులులేవు
ఆసపడనీవె తాను అంబుధులు పేరఁబెట్టు
కోసి రాతనారొలిచి కూరిము లింతేఁటికే

చ. 3: కూడితినే కాఁగిటను గురుతులు నించితినే
ఆడనీవే సరసాలు అంకెలాయనే
వేడుకవెలవెట్టె శ్రీ వెంకటేశ్వరుఁడు తాను
వీడెమిచ్చి బుజ్జగించీ వేసాలిఁకనేఁటికే

రేకు: 0250-5 ముఖారి సంపుటం: 08-299

పల్లవి: ఏఁటికి బాఁతిపడేవు యేల మమ్ముఁ జెనకేవు
కాటుకవన్నెచూపులు కలవి మాజూబులు

చ. 1: కన్నులె గొప్పలుగాని కడుఁ గొంచపు మొకము
యెన్నఁగ మాచక్కఁదన మేమున్నది
వున్నతాలె కుచములు వొంటినడుము సన్నము
యెన్ని చూడఁబోతేను యిదివో మాసొబగు

చ. 2: బారెఁడె కురులుగాని చేరఁడేసి పాదాలు
యీరీతిదె మాగుట్టు యేమున్నది
నోరు మాణిక్యాలగని నొక్కితేఁ దేనెపెదవి
పేరుకొనఁబోతేను పెలుచు మాగుణము

చ. 3: చేతులె మెత్తనగాని చిమ్ము గోళ్ళు కఠినాలు
యేతులు నెమ్మెలు మాయందేమున్నది
ఘాతల శ్రీవెంకటేశ కలసితి విటునన్ను
నీతి విచారించుకొంటే నిండెను నీమన్ననే

రేకు: 0250-6 దేశా(సా)క్షి సంపుటం: 08-300

పల్లవి: ఇంతి నీసొమ్ముగాదా యెరవున్నదా
వింతవారివలె నేము వెంగె మాడేమా

చ. 1: జగడాలన్నియుఁ దేరె సతి నీతోసంతమాయ
మగుడి మగుడి నీతో మాటలింకానా
తగవరి వవుదువు తప్పులు నీయందు లేవు
మొగము చూచి చూచి మొక్కు లింకానా

చ. 2: పనులెల్లాఁ జక్కనాయ పదివేలువచ్చె నేఁడు
చెనకి చెనకి నీతో చేఁత లింకానా
వెనకటి వెంతలేవు వేడుకకాఁడవు నీవు
కొనచూపులనుఁ జూచి కొసరు లింకానా

చ. 3: కోరికలు గొనసాగె కూటములు మీకు నబ్బె
సారె సారెఁ గొరేటి చల మింకానా
యీరీతి శ్రీ వెంకటేశ యిచ్చకుఁడ వన్నిటాను
చేరి నీవు నవ్వఁగాను సిగ్గు లింకానా